# భారతి

మాసపత్రిక





సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్





ఫిబ్రవరి 1965



సంపుటము 42 : : సంచిక 2

విడిపత్రిక వెల ఒక రూపాయి




# అమృతాంజనం వాడి
## శీఘ్రంగా నివారణ పొందండి

నిరపాయకరంగా గుండె జలుబును. సాధారణ జలుబును అమోఘంగా గుణాన్నిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. కండనొప్పికి. తలనొప్పికి. బెణుకులకు కూడా అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికి కళతా నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ళ ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు • బొంబాయి • కలకత్తా • ఢిల్లీ

JWT/AM/2817

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1965



# సర్ విన్‌స్టన్ చర్చిల్

జననము : 30-11-1874 మరణము : 24-1-1965

అతడొక అతి అపూర్వ వ్యక్తి. ఈ కాలానికే కాదు. ఎల్లకాలానికి అపూర్వ వ్యక్తి. అతనిని గౌరవించటానికి మనమీరాత్రి ఇక్కడ సమావేశమైనాము.

సర్ విన్‌స్టన్ చర్చిలును గురించి చెప్పవలసినదంతా ఇదివరకే చెప్పటం జరిగింది. అతడు మహాయోధుడు. గొప్ప రాజ్యతంత్ర ప్రవీణుడు. అపూర్వ ప్రతిభాశాలి. స్వేచ్ఛావాది. జీవితం అతనికి ఒక ఆనందం. భాషకు ప్రభువు. విజయంలో ఔదార్యం. అపజయంలో ధిక్కారం. విశ్రామంలో మహనీయమూర్తి. సహచరులకు సంతోషప్రదాయి. స్నేహితులంటే అచంచలాభిమానం.

ఇదంతా ఇదివరకు చెప్పినదే. ఈ చెప్పినదంతా నిజం. చెప్పవలసినదంతా ఇదివరకే చెప్పారు. చెప్పవలసినది లేదు.

—శ్రీ క్వింటన్‌హాగ్.

# పునీత రహస్యము

## శ్రీ ఫి. గణపతి శాస్త్రి

నీ నా రహస్యమ్మ నీలోన నా లోన
ఏనాటికయిన నెంతేని వినిగూఢమై
నీరవసుషుప్తిగంభీరాబ్ధి లోలోన
నీలాలకల వోలె నిదురించు ననుకొంటి!

తేట రేయెండపన్నీట చిరుచుక్క క
న్నీటివలె ఎదలోన నీవు దాచితినంటి!
మాట నా హృదయమణిపేటిలోన వరాల
మూటవై దాగ! ముమ్మాటి కిది నిజమంటి!

కోపమ్మ నిను కనుంగొనలలో ముద్దాడె!
ఆ పరమభాగ్య మకటా! నాకె కరవాయె!
ఏ పాప మే నెరుగ నెవ్వరెరిగించిరో!
ఆ పునీతరహస్య మలముకొనె జగతిలో!

మునిమాపువేళ విరిసిన చంద్రకాంతాల
నునుకావిలోన మన అనురక్తియే నిండె!
వినువీథి నల్లెడల వెలుగు జాబిలి బిలిచి,
కనుగీటి రిక్క లిదె వినిపించె నల్లదే!

---

# బద్దెన - నన్నెచోడుల కాలము

శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

క్రీ. శ. 1964 సం. ఆగస్టు భారతిలో శ్రీ వేటూరు వేంకటరాయశాస్త్రిగారు 'నన్నెచోడుని కవిత్వం' మీది విమర్శకు సమాధానము చెప్పడములో 'తిక్కన భారత రచనా కాలము' చర్చ సాగించి, తమకు తోచిన సిద్ధాంతము కావించినారు.

ఆందలి సంశయములను కొన్నిటిని చూపి, సెప్టెంబరు భారతిలో 'సత్యమెట్ట'దో తెలుప వేడికోలు' ప్రకటించగా మరల డిశంబరు భారతిలో 'సత్యమే చరిత్ర తిక్కన సత్యేతర మెక్కటుగదా. అది సమలతకు సమిక్షింపవలసిన' అనుటయే గాక, కడపటికి శ్రీ రెడ్డిగారు ప్రతిపాదించినవి కుదరవు' అని తేల్చివైచినారు.

శ్రీ శాస్త్రిగారి ఈ ప్రతిపాదన సిద్ధాంతము కాదనుటకిప్పుడొక యుదాహరణము చర్చించుట కవకాశ మేర్పడినది.

'ఇప్పుడు (నె. శా. పుట 233—34 A. No. 25 చిరమున శాసనములో) రాజులుగాని, మనుమసిద్ధిగానిని యుద్ధము చేయుటగాని బొత్తిగా కనబడదే! ఇట్లుండగా శ్రీ రెడ్డిగారు ఎట్లు ఈ అభిప్రాయమునకు వచ్చిరో నా వూహకు అందుట లేదు. ఏదో ఒకదానిని మరియొకటి అనుకొని యుండెదరు. బద్య మహారాజ స్థాపనా చార్య' అన్నది గొల్లపూండి నాయకులకు వర్తించుచున్నది. ఈ బద్య మహా రాజెవరో తర్వాత మాటము. మనుమసిద్ధి మాత్రము కానరాడు గదా! (పు. 67) అని శ్రీ శాస్త్రిగారి జిజ్ఞాస. సమాధాన మిదిగో:

క్రీ. శ. 1285 తేది చిరమున శాసనములోని బద్య మహారాజే బద్దె మహారాజ' కావలెనుటకు 'విద్య—విద : బద్య, బద్ద' పర్యాయపద సాదృశ్యము చాలు గదా! వేములవాడ భీమకవి—వేములవాడ భీమకవిగా, బద్దెమహారాజ—బద్దెన కాకపోడు కదా! తిక్క—తిక్కన, బద్ద—బద్దె'న వంటిది.

బద్దె నీతి శాస్త్ర ముక్తావళి గద్యలో : 'ఇది లక్ష్మీ వల్లభ పాద పద్మారాధక కమలాప్తకుల పవిత్రసన్న గంధ వారణ రాజ మహోజ రాజాంక బద్దెనాఖ్య ప్రణీతంబైనది. అని చెప్పుకొనబడినది. పద్యాంత మకుటములో—నన్నెచోడ నరేంద్ర (1—13), అను నామాంతరము కూడ చేర్కొనబడినది.

కాగా, క్రీ. శ. 1285 తేది చిరమున శాసనములో పేర్కొన్న పర్ల (ల్ల) వ విజయ గండ గోపాల మహారాజ రాజ్యమున—బద్యమహా రాజస్థాపనా చార్య నామాది ప్రశస్తి కాలము స్థూలముగా క్రీ. శ. 13 శతాబ్దిలోనిదో? తత్పూర్వమిదో కాకతప్పదు.

29-9-1275 తే (A. 29) కామిరెడ్డిపాడు శాసనములో 'స్వస్తి శ్రీ మన్మహా మండలేశ్వర (నాసే) దేవ మహారాజులు నెల్లూరను సకల సామ్రాజ్యంబు జేస్తుండి సుఖసంకథా వినోదంబుల రాజ్యంబు చేయుచుండంగాను రాజునకు నిజ భృత్యుండైన మాదనము నంటంక్క రాజా సంఘానను శ్రీ జయాభ్యుదయ శకవర్ష 90 బులు 1192 వేంటయిన సంవత్సరమున ఆశ్వయుజ శుద్ధ 10 లు ఆదివారమున మహాలక్ష్మీ దేవి నందునందనకుం పుణ్యముగాదుగవి పరమేశ్వరికి నవేద్యమునకు'......దానమిచ్చినట్లున్నది. దుర్గాష్టమి ఆదివారమగుచున్నది. కాబట్టి దీన మా సండుగలో ఇచ్చినను, విజయదశమిలో శాసనము చెక్కించినట్లు తోచుచున్నది.

క్రీ. శ. 1217 తేది (A. 38) మహిమలూరు శాసనములో 'పాకనాంటి తిరుపతి కవలింటలోని తొంక కూడూరు

లో మనుమసిద్ధి ఇమ్మడి గండగోపాల విజయాదిత్య మహా రాజును పాకనాటి సముద్రతీరమందు కందుకూరు యుద్ధములో వోడించి, చాల దూరము తరిమి బాధపెట్టినట్లు తెలియుచున్నది. చంపలేదనుట నిర్వివాదము.

కందుకూరు తాలూకా (K D. 61 62, 63) పెంట్రాల శాసనములలో కాలక్రమముగా (61) జూన్, 1259 లో 'శ్రీ మన్మహా మండలేశ్వర భుజబల వీర మనుమసిద్ధయ చోడ మహారాజులకు రాజ్యాభివృద్ధిగాను' అనియు, (62) ఏప్రెల్, 1260 లో 'శ్రీ మన్మహా మండలేశ్వర ఇమ్మడి గండగోళ విజయాదిత్య దేవమహారాజులకూ రాజ్యాభివృద్ధిగాను' అనియు, మరల (63) (దుర్మతి ?) దుర్మ(తి) లో—ఏప్రెల్ 1262 లో 'విజయదేవుండు శ్రీమన్మహా మండలేశ్వర భుజబల వీరమనుమ సిద్ధయ చోడ మహారాజులకు రాజ్యాభివృద్ధిగా (ను)' అనియు పాకనాటి కందుకూరు ప్రాంతములోని—యొక గ్రామములో చెక్కించుట యుద్ధపరాజయ లక్షణములు కాన ప్రసిద్ధ చరిత్ర సమ్మతము. కాగా, 'విజయసేన పూర్వ' యుద్ధ చరిత్రను వర్ణించిన నిర్వచనోత్తర రామాయణ రచన క్రీ. శ. 1262—63 మధ్య కాలములో కొనసాగినట్లు శాసన చరిత్ర చెప్పుచున్నది.

శ్రీ శాస్త్రిగారు రూపించినట్లు క్రీ. శ. 1260—61 గణపతి రాజ్యాంతకాలములో 'గండగోపాల మనుమసిద్ధి' సుందరపాండ్య—జటావర్మచేత ముదుకూరు—ముత్తుకూరు యుద్ధములో చంపబడినచో క్రీ. శ. 1262 నాటి పెంట్రాల శాసనములో తద్రాజ్యాభివృద్ధిని సూచించుటకు వీలులేదు. దుర్ముఖి (దుర్మతి)' లేఖక కాలదోషమునుబట్టి కాలము నిశ్చయించినచో, మనుమసిద్ధి రాజ్యారంభ కాలము క్రీ. శ. 1237 ప్రాంతమగును. దీని కితరాధారములు లేవు.

ఇక్కడ క్రీ. శ. 1263 నాటి (K, V. L. 43) ముంగమూరు శాసనములో నున్న 'శ్రీ మన్మహా మండలేశ్వర మనుమసిద్ధి దేవచోడ మహారాజుల మహాప్రధాని శ్రీవత్సగోత్రం .... ' శిథిల బట్టి చూచినచో క్రీ. శ. 1263- 64 మధ్యకాలమున మనుమసిద్ధి జీవించియున్నట్లు చెప్పక తప్పదు. చిప్పన రాజ మంత్రిపని 'మహా ప్రధాని' పాకనాంటిలో 'శ్రీ గౌరీశ్వర దేవరకు సంధ్యాది వ ఎలు వెంటికి భూదానము చేసినదనుట స్వభావసిద్ధము కాదు.

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ బహుమతి నేడు కొన్న—నన్నెచోడుని కవిత్వములో శ్రీ శాస్త్రిగారి క్రింది సిద్ధాంతము చేయుట భాషావాద కాలచర్చకు ప్రత్యక్ష విరోధము.

'బద్దెన కాలము ఇంకను నిష్పందేహముగా నిర్ణయము కాలేదు.

'జయంతి రామయ్య పంతులుగారు (ఆం. సా. ప. పత్రిక రాష్ట్ర 273 పుట) ప్రకటించిన శాసనమున ఇరువురు బద్దెన లున్నారు. తాత మనుమలు. పెద్ద బద్దెన తండ్రి, మొదటి బద్దెన కొడుకు పేరు దొరయ. తారీఖు శకము 1183. క్రీ. శ. 1261. ఈ శాసనము దొరికినచోటు కృష్ణా మండలమున గన్నవరము తాలూకా కొండనాయని పరమున బ్రహ్మేశ్వరస్వామి దేవాలయమున నొక రాతిపై. ఈతడు తిక్కనకు సమకాలికుడగుచున్నాడు. ఇతనికి మునుమానుడగుని తలచిన నన్నెచోడుడు, తిక్కనకు మునుమడగును (ఇట్లు చూచిన) అది వాఙ్మయ పరిణామాదికములచే కుదరదు. కాబట్టి ఈ బద్దెన సనికిరాడు. అనంతరుని వెదుక వలసి యున్నది. పైగా శాసనోక్త బద్దెనయే కవి యగుటకు ప్రమాణమేమి ? (86, 87 పుటలు)' అని సందేహము ప్రకటించినారు.

ఇప్పుడీ తర్కమునకు ఇక తావులేదు.

క్రీ. శ. 1262—63 నాటి నిర్వచనోత్తర రామాయణ కవి : కవిబ్రహ్మ తిక్కనయు, క్రీ. శ. 1275—76 నాటి సుమతిశతక కవి : వివేకబ్రహ్మ (వివేక చతురాననుడు) బద్దెన నన్నెచోడ నరేంద్రుడును నిర్వివాదముగా సమకాలికులనుట కాక్షేపము లేదుగదా !

కాబట్టి, 'అది వాఙ్మయ పరిణామాదికములచే కుదరదు.' అనుట కల్పిత భాషాచరిత్ర లక్షణమునక తప్పదుగదా!

క్రీ. శ. 1290 నాటి ఆత్మకూరు తాలూకా (A. 55) రాజవోలు శాసనములో 'శ్రీ మనుమండలేశ్వర మహీదేవ మహారాజ రాజ్యమున .... సండిల పుండరీక షండ మార్తాండ బద్దెమ(హా)రాజ కొడుకు బయ్యనామాది ప్రశస్తి' కూడ పేర్కొనబడి యున్నది.

ఇప్పుడిక్కడ బద్దె—నన్నెచోడ కవి వంశవృక్షము శాసన—కావ్యాధారములతో పోల్చి చూపు టావశ్యకము.

| శాసనములు. | కావ్యములు. |
|---|---|
| బద్దిగ | |
| — | |
| (చో) డ దొరయ | |
| — | |
| చోడ బద్ది (గ) 1261—75 | బద్ది నరేంద్రా |
| నెల్లూరు (నన్నె)దేవ మహారాజ | నన్నెచోడ నరేంద్రా సుమతి |
| బయ్యన చినబయ్యన 1275—79 | శతకము గావించిన—బద్దెన. |

ఇప్పుడు ఈతఁడు తిక్కనకు సమకాలికుఁ డగుచున్నాఁడు '.... అది వాఙ్మయ పరిణామాదికములచే కుదరదు. కాఁబట్టి ఈ బద్దెన పనికిరాఁడు. అనంతరుని వెదుకవలసి యున్నది. పైగా శాసనోక్త బద్దెనయే కవి యనుటకు ప్రమాణమేమి ?' అని శ్రీ శాస్త్రిగారు వితర్కించుట కాస్కార మెంతమాత్రము లేదు.

ఇంకొక జిజ్ఞాస:

'ఈతని (కవిరాజ శిఖామణి) గ్రంథాంత జయ చైత్ర సంపద' లో నేదో ధ్వని యున్నది గాని తెలియుటలేదు. శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారి అక్షర సంఖ్యా గణనము సరియే గాని వారి తారీఖు క్రీ. శ. 1054 భాషా పరిణామాదిక విషయమున కుదరకపోవుటచే దీని తత్వమేమో శోధించి శ్రీ రెడ్డిగారే మున్ముందు వివరింపఁ గర్తలు :'— వేదం— నన్నెచోడుని కవిత్వము(227 పుట).'

పై జిజ్ఞాస కిప్పుడు సమాధానము లభ్యమైనదో, లేదో ! భాషాపరిణామము కాలతత్త్వవేత్తలు సింహావలోకనము చేయవలసి యున్నదని విన్నవించుట కంటె గత్యంతర మేమున్నది ? కథేతర గద్యకవితలో గూఢోక్తిగా చెప్పిన కాలము శాసనాదిక (కవిరాజ శిఖామణి) సమకాలముతోను, క్రియా పరిణామ కాల సాదృశ్యముతోను సమకాల మగుచున్న దన్నచో భాషాచారిత్రకులు విశ్వసింపకపోవుటలో ఆశ్చర్య మేమియును లేదు.

తిక్కన— కేతన— బద్దెనలు ముగ్గురు క్రీ. శ. 13 వ శతాబ్ది— ఉత్తరార్ధమున సమకాలిక కావ్యకర్తలై యుండగా, ఆ సమకాలిక కవిత్రయ కావ్యములలో భాషాపరిణామ కాలభేద మున్నదనుటకంటె విపరీత మేమున్నది.

ఇప్పుడు 'బద్దెన కాలము ఇంకను నిస్సందేహముగా నిష్పత్తి కాలేదు.' అని శ్రీ శాస్త్రిగారు వాదించుట కవకాశ మున్నదో, లేదో చూడవలసి యున్నది.

బద్దెన క్రీ. శ. 1261—75 మధ్య కాలములో నెల్లూరు చోడరాజులతో పాకనాటి యుద్ధములు చేసి గెలిచి నదే 'నెల్లూరు— సకల రాజ్యంబు నేలు(ట)' సాధ్యమగుట. ఎట్లనగా, క్రీ. శ. 1263—75 మధ్యకాలములో బద్దె మహారాజును (నన్నె) దేవమహారాజును, క్రీ. శ. 1275—79 మధ్య కాలములో అతని కుమారుడు బయ్యనయు రాజ్యము నేలుచుండగా, క్రీ. శ. 1279—81 మధ్య కాలములో మనుమసిద్ధి కొడుకు ఇరుగుడి తిరుకాళత్తిరాజు బయ్యని నోడించి నెల్లూరు రాజ్యము గెలిచికొన్నట్లు తోచుచున్నది.

కాటమరాజ కథలో పేర్కొన్న నెల్లూరి కొలుకుల మీ కాలముతో సరిపోవుచున్నది.

'తనర ప్రాయుంచిరి తిక్కన ధాత వి(బు)ష సంవత్సర
వెలయు కార్తికయా శుద్ధ విదియ యుతమి గురువారమును.

— — — —

సకలసతి మరి దైవ సద్మార ఘుపుకు

— — — —

— — — —

యాలలోన మనుసిద్ధి రాజిచ్చిన కాలం'

—(తాటియాకు 57 : ఆవుల మేపు.)

ఇందు శకకాల మీయకపోయినను, (ఖడ్గ) 'తిక్కన' స్ఫురించున్నది.

కేతన దశకుమార చరిత్రలో కవి తిక్కన వంశమును వర్ణించునప్పుడు 'సిద్ధి సేనాపతి ప్రోడ తిక్క, ఘనాథ శిఖామణి కొమ్మ మంత్రిత్వ' నట్లు చెప్పబడినది. కాబట్టి, క్రీ. శ. 13 శతాబ్ది 'విష (వృష) సంవత్సరము' లో నెల్లూరు పుల్లరి కొలు వ్రాయబడినట్లు లెక్కించే వీలున్నది. పంచాంగ ప్రకారము శా. శ. 1203 అగు నేటి వృష సంవత్సర కార్తిక శుద్ధ విదియ గురువారమునకు సరియగు 16—10—1281 తేది గురువారమునకు సమకాల మగుచున్నది. కాలదోష మేమియును లేదు. అంతవరకు ఖడ్గ తిక్కన— కవి తిక్కన లిద్దరు సజీవులై యుండరనుట కాక్షేపములేదు.

ఇప్పు డిక తిక్కన భారత రచన యెప్పటిదో శ్రీ శాస్త్రి గారు నిర్ణయించవలసి యున్నదని నా విన్నపము.

'పైగా జటావర్మ చంపినది కాకతి గణపతిలో చేరిన (వీర) గండగోపాలుని గదా.

* * *

'క్రీ. శ. 1263 లో మనుమసిద్ధి చావలేదని శ్రీ రెడ్డిగా రూహించిరి గదా ! అట్లుండినయెడల ఈ కాలమున రాజ్యమును మరల జయించుటకు తాను రాక కుమారుని పంపునా? అని శ్రీ శాస్త్రిగారు జిజ్ఞాస.

కాని, గణపతి రాజ్యాంతకాల మెప్పటిదో ? శ్రీ శాస్త్రి గారు మరచిపోయినట్లు కనబడుచున్నది.

మహాదేవరాజా క్రీ. శ. 1195—99.
గణపతి 1199—1260.
రుద్రాంబ 1260—95.

—(ఆం. క. చ. 2—47 పుట. చూడుడు.)

పై వంశ వక్షమునందలి గణపతి కాలము క్రీ. శ. 1259—60 తో ముగియుచున్నప్పుడు జటావర్మ సుందరపాండ్యుని చేత మనుమసిద్ధి చంపబడినచో లేదా క్రీ. శ. 1259—60 నాటి కందుకూరు యుద్ధములో ఇమ్మడి గండగోపాల విజయాదిత్యుని ఓడించి, సముద్రతీరమున చాలదూరము తరిమి వచ్చి మరల పెంట్రాలలో క్రీ. శ. 1261—62 సంవత్సరమున తన 'రాజ్యాభివృద్ధిగా' శాసనము ఎట్లు వేయించెనో బోధపడకున్నది. — — — —

క్రీ. శ. 1263 నాటి ముంగమూరు శాసనములో 'మనుమసిద్ధి—మహా ప్రధాని' మంత్రిపదవిలో ఉన్నాడా! మనుమసిద్ధి యుద్ధములో చచ్చినా డనుట కాదేమో. కాబట్టి, జటావర్మ సుందరపాండ్యుని యుద్ధములో మరణించిన 'వీరగండ గోపాలు' ని మనుమసిద్ధి యని పిలువరు. 'ఇమ్మడి గండగోపాలు'డో, మరియొక 'వీరగండ గోపాలు' డో క్రీ. శ. 1260—61 లో నెల్లూరు ప్రాంత యుద్ధమున మరణించినట్లు వూహించుట తప్పుకాదు.

అల్లు—తమ్ము—గండగోపాల విజయాదిత్య చోడరాజు నెల్లూరు రాజ్యము నంతను జయించి, చాల కాలము ఏలినట్లు శ్రీ శాస్త్రిగా రూహించుట క్రీ. శ. 1263—75 నాటి (మన్మ) '(నానే) దేవ మహారాజు నెల్లూరున సకల సామ్రాజ్యం చేస్తుండి' న శాసన చరిత్రను గుర్తించకపోవుటచేతనే కదా.

'ఈ బద్య మహారా జెవరో తెల్వతు ఏరాత' ని శ్రీ శాస్త్రిగా రనుట 'పండిత బద్య—సిద్ధి' రూపాంతర నామము '(మన్మ) దేవమహారాజు' దే యని గుర్తించకపోవుట వల్లనే కదా!

క్రీ. శ. 1262—63 నాటి తిక్కన నిర్వచనోత్తర రామాయణ 'విజయమాన సర్గ' రచనకు తర్వాతనే తిక్కన భారత రచన యుపక్రమించెను.

తిక్కన—కేతన—మారన మువ్వురు క్రీ. శ. 13 శతాబ్ది—ఉత్తరార్ధములో సమకాలిక కవు లనుట నిర్వివాదము.

'మన్మ సగంధ విచారణ' బిరుదాంకితుడగు నెల్లూరు మన్మచోడ కవి కంటె ('కందుకూరురు') 'ఉదయాద్రి ప్రభు' వగు మన్మచోడ కవిరాజ శిఖామణి పూర్వు డనుట శాసన—కావ్య చరిత్ర సమ్మతము కాకపోదుగదా!



గోళమునకు వెళ్ళి యచట విహరింప శక్తిగలవో ముఖమును భూగోళముతో పోల్చదరు కాపోలు) నాటి హంసలు, కృత క్రౌంచలు, కస్తూర్యాది సుగంధ ద్రవ్యములు ప్రబంధ ప్రపంచ మున జాడయే సంతోషించవలెను. నాటి నాయకుడు కులీనుడు. మహా భాగ్యాదర్యాది లక్షణములు గలవాడు. నేడు రిక్షావాడైనను కావ్య నాయకత్వమున కర్హుడు.

సంప్రదాయము—తిరుగుబాటు, నాటినుండి నేటి వరకు నొకదాని నొకటి వెంబడించుచునే యున్నవి. కావున— అనాటి శాస్త్ర మర్యాదల నీనాడు గ్రుడ్డిగా ననుకరించుట గాని, ఈనాటి ప్రయోగములను నాటి నియమములలో తూచుటగాని పొసగనేరదు.

కాని ప్రతిభా సంస్కార లబ్ధుడగు కవి (Born Poet) నిరంకుశుడని మాత్ర మంగీకరింపవలెను. ప్రాత క్రొత్తల భేదము లేకయే ఇతనిచేత బడిన ఏ వస్తువైనను అపూర్వ ముగ మారును. 'యథాస్మై రోచతే విశ్వం తథేదం పరి వర్తతే' యనునట్లు ప్రపంచ మితని యిచ్ఛానువర్తనముగ మారును.

ఇక కేవల వ్యుత్పన్నుడగువాడు కృత కవి.(Made Poet) ఇతని స్వేచ్ఛ ననేక శాస్త్రములు హరించును. ఈ రెండు తెందిన కొందరు చేతిలో నలంకారము కృతకమై యుండునన్న భరతుని కాలమున నుండిన మూడు నాల్గలంకారములు ఇప్పుడు దీక్షితులవారివరకు శతాధికమైనవి. ఇవి కావ్యములలో నున్నవో, ఆలంకారికులు సృష్టించిరో, కావ్యాంతర్గతములగు వాని వా రావిష్కరించిరో ఎరుగరాదు. ఒక్క యుత్ప్రేక్షయే తొంబది యారు తీరులకు విభజింపబడెను. వ్యుత్పన్నులకగుగాక వారి కివి యాదర్శములగును. భవతు. కాని ప్రతిభాశాలురగు కవుల లోను, ముఖ్యముగ భాషలోన ఏ యలంకార మెట్లు చోటు చేసికొనెను? అను ప్రశ్నకు సర్వాలంకార బీజ భూతముగా చెప్పబడిన ఉపమను పురస్కరించుకొని శక్త్యనుసారి సమా ధాన మాలోచింతుము, 'పెట్టని యాభరణములు' వలె నలం కారము నిసర్గముగ నైతే యుండగలదని భావించుకొనుటయే ప్రస్తుత వ్యాసోద్దేశము.

భాషయొక్క అసమగ్రతయే అలంకారములకు దారి జూపినది గావున నలంకారములకన్నముందు భాషా పరిధులను గూర్చి ఇంచుక విపులముగ నాలోచింపదగును.

సృష్టిలో ననంతములగు చేతనా చేతనములు గలవు మానవ భాష నూపింప యోగ్య వస్తుజాలమునకు— కాదనిన— మానవేంద్రియ గోచరములకు పరిమితమై యున్నది. అది యును మిక్కిలి యస్పష్టముగ నున్నది.

వస్తు, భావాదులకును, వానితో వ్యవహరింపబడు ధ్వను లకును (వర్ణములకు) ఎట్టి సంబంధము గలదు? ఆ సంబంధ మెట్టి యాధారమున సృజింపబడెను? అది సకల భాషల యందు సమాన ధర్మమున గలదా? శబ్దమునందు కర్త ప్రకా శక శక్తి సహజమా? ఆరోపితమా? (నైయాయికు లీశ్వర తత్వమందురట.) మున్నగు ప్రశ్నలకు సమాధానము లగావశ్య ములు.

ఏ భాషలోనను శబ్దములకు సమగ్ర వస్తు తత్వ విశ్వాసన శక్తి యున్నట్లు గన్పట్టదు. ఒక వస్తు తత్వమును కెట్టి సంబంధమును లేని ఏయొక ధ్వని సంకేతములవశాల మున నా వస్తువునకు సంజ్ఞా రూపముగ బోధక శక్తి నారో పించుచు శబ్దమేర్పడుచున్నదని తోచును. పూర్వాపరభావ తత్త్వజ్ఞానముచే, లేక బోధనచే నర్థము చేసికొనబడు చున్నది. కావున శబ్దములకుగల యర్థ బోధక శక్తి యసహజము.

ఊహా సంబంధములగు వస్తువులకు (భావములకు) గాఢములగు ననుభూతులకును మాటవు డపయోగించు భాష సరిపోవుటలేదు. వూహాతీతములగు వాని విషయమున నిక చెప్ప నక్కరలేదు. "King Lear" నాటకమున షేక్స్పియరు లొక పాత్రచే నిట్లు పలికించును.

I love you more than words can wield the matter,.....A love that makes breath poor and speech unable." రవీంద్రుడు తన Un sung song లో నిట్లనును.

"The words have not been rightly set;
Only there is the agony of wishing in my heart."

భాష చాలక నెన్ని యద్భుత భావము లెన్నెంత రాళముల గ్రుంగిపోవుచుండునో ఎరుగరాదు. 'మూగి లీర వలయును', 'మాటలు చాలవు', 'అనిర్వచనీయము', 'అను భవము' వంటివి మన కపరిచితములుగావు. వూహా శక్తికి గల నిరంకుశత్వ మనుభవమునకును, అనుభవమున కున్నంత స్వేచ్ఛ భాషకును లేదు. మరికొంత లోతులకు వెళ్లుదము. గ్రుడ్డివాని కొక దృశ్యమును వర్ణించి చెప్పుటకు భాషకు సమర్థత చాలదు. 'తీపి' యనుమాట, ఆ రుచి నెరుగని వాని కా రుచి ననుభవమునకు తేజాలదు. అనగా వారి యనర్హ తను భాష యధిగమింప జాలకున్నది.

ఇక శబ్దతత్వము—శబ్దములన్నియు బోధ్య వస్తువు యొక్క ఏక ధర్మ— లేక పరిమిత ధర్మ నిర్దేశకములే. సంస్కృ

తెలుపును నే శబ్ద వ్యుత్పత్తి స్వభావములను పరిశీలించినను ఆ విషయము తెల్లమగును.

'రాత్రిః' శబ్దమునకు, 'రతి సుఖమితి రాత్రిః' అని వ్యుత్పత్తి. ఎంత చిత్రము?— అనగా కష్టము నివృత్తిచేసిని రాత్రి యనరాదు. విరహార్తులకి 'తమి' శబ్దము గలదు. విరహులగాక నింకెన్ని కష్టములు, సుఖములును ఎన్ని లక్షణములు గలవు? 'రాత్రికి' సుఖ నివృత్తి పని టక్కు వేరు లక్షణము లేనియును లేవా?

'నీలకంఠ' శబ్దము పుట్టు సమయమునకు 'సముద్ర మథనము' జేయుచుండెను. 'విషమగు గరళము గలవా' డను మాట సముద్ర మథనమును జెప్పినను అదుగని వర్ణనగల శివుని మన వ్యుత్పత్తికి తేవలయును. 'నీల' యను మాటలో సముద్రమును నుండి జనించిన విషముచేనయిన నల్లదనము— అనగా నల్లనైనది? మరి ఏ ఇతర కారణముననైన కంఠమున్నై నలుపున్న వానిని నీలకంఠుడనరాదు.

'గౌః' అను మాటకు 'గచ్ఛతీతి గౌః' అని వ్యుత్పత్తి. ఇంతటి విద్వాంసుల మాహింప దగినదే—

సర్పాక్షి యను వేరొక గలదు. పాము కండ్లు గలదని వ్యాఖ్యానము. పాము కండ్లవంటి పూవులు గలదని భావార్థము పూవులకాక దానికి కాయలుండునో, కొమ్మలుండునో, భూమిపై మొలచునో, నీటిలో బుట్టునో, దాని గుణమేమిగా 'సర్పాక్షి' వ్యక్తము చేయుదు.

ఇట్లూహించుచు వెళ్లవచ్చును. ఈ లక్షణ మొక సంస్కృతమునకే గలదా? యను శంకకు తావు లేకుండ నున్నది. కొన్ని ఫార్సీ శబ్దములు చూడదగును.

'కోహకన్' అను మాట వెనుక 'షీరి' మరియు 'ఫర్హాద్' అను నాయకీ నాయకుల ప్రేమ గాథ గలదు. (ఆ గాథ యప్రస్తుతము) కోహ— పర్వతమును, కన్—కొట్టువాడు—పట్టుదల గలవాడని భావము. కమిని పీ పట్టుదల ప్రేమ సంబంధి యను సంశయమైనను శబ్దమున లేదు.

'షీర్‌ఖార్' అనగా పాలు త్రాగువాడని యర్థము. పాలు త్రాగువాని నెల్ల షీర్‌ఖార్ అనరాదు. చంటిపాలు త్రాగువాడని — శిశువని యర్థము. శిశువుయొక్క మిగిలిన స్వభావము లన్నింటిని ఈ శబ్ద మూలమున మనమే యూహించు కొనవలెను.

అరబ్బీ శబ్దములు కొన్ని చూడదగును.

'రసూల్' అనుమాట 'రసల్' (తెచ్చు) అను ధాతువు నుండి వచ్చినది. రసూలనగా తెచ్చువాడని యర్థము (ఏమి తెచ్చువాడో?) భగవంతుని వార్తను తెచ్చువాడు. [A Messenger of God] ప్రవక్తయను అర్థ యూరకొండిన సరిపోవదు గదా! ఆ వార్తను ప్రపంచమునకు బోధించి దానినుద్ధరించుటయు రసూల్ ధర్మమై యున్నది కదా.

'జువారి' అనునది 'జవర్' (తిరుగు) ధాతువునుండి ఏర్పడినది. జువారి అనగా తిరుగుటకు సంబంధించిన జాడ్యము ఏమి తిరుగుట? ఎట్లు తిరుగుట? కండ్లు తిరుగుటకు సంబంధించిన జబ్బు అని లాక్షణికార్థము.

పరిమిత ధర్మ బోధకత్వమును కొంతవరకు తీర్చుటకే పర్యాయ శబ్దము లేర్పడినవి. కావున పర్యాయ పదములు సమానార్థకములు కాకుండును. ఒకే వస్తువునకు వందల కొలది భిన్న గుణము లుండును. ప్రతి గుణమున కొక సంకేత మేర్పరుచుట ఏ భాషలోనను సంభవించలేదుమా! ఈ విషయమున నరబ్బీ భాష కొంతవరకు పురోగమించిన దనియు, అది చాల పటుత్వముగల భాషయనియు చెప్పుదురు. గుఱ్ఱమునకు నూట యేబదిరెండు పదము, ఒంటెకు నాలుగువందలకి మించియు పేర్లు గలవట. ఇట్టి భాషకు నైతము శబ్ద వ్యుత్పత్తిలో నట్టి యవస్థ తప్పలేదు.

వియుతార్థ ప్రతిపాదకములగు నిట్టి శబ్దములు కాలక్రమమున, అన్యభాషా ప్రవేశ సంసర్గములచే నరసిన యర్థాంతర బోధకములై, శబ్ద స్వరూపములు మారియు, అర్థ వైశాల్యము సంతరించుకొనియు వ్యవహరింపబడుచుండెను. ఇట్టి వృద్ధిపొందిన కొన్ని ఆంగ్ల శబ్దములు పరికింప దగును.

**Religion** అనుమాట **ligar** అను లాటిన్ ధాతువు (=**To bind**) నుండి జనించినది. దైవిక తత్వముతో కూడుకొనుట యని కాబోలును. దీని సమానార్థకముగా చెప్పబడు 'మతము' భిన్నార్థము గలది.

**Apostle** అనునది **Stelle** (= పంపుట) అను గ్రీకు ధాతువునుండి ఏర్పడినది. ప్రవక్తయని శబ్దార్థము. క్రీస్తుచే (దేవునిచే) పంపబడిన బోధకుని వివరమగును.

**Language** అనగా భాష యనిగదా! ఇది (=నాలుక) అను ఫ్రెంచి శబ్దజము. నాలుక సహాయమున పలుక బడును కావున భాష కా శబ్ద మునుయుక్తమయ్యెను. భాషకు **Tounge** అనుటయు గలదు.

**Lampoon** అనగా పేరు వ్యంగ్యములచే నాక్షేపించుట. ఇది **lampon** అను ఫ్రెంచి మాటనుండి ఏర్పడెను. **lampon** అనగా **A drinking song.** త్రాగిన మత్తులో విశృంఖలముగా పరిహాసధోరణిలో పాడెడు పాట గావచ్చును.

Onyoc ఒక మణి విశేషము. గ్రీకులో ఈ మాటకు గోరు Nail అని యర్థము. వాని పరస్పర సంబంధము లెట్టివో యెరుగరాదు.

ఇక తెలుగు పదముల పుట్టుక ఎట్టిదో ఇదమిత్థముగా నాలోచింపరాకున్నది. శ్రీ వెల్లపిళ్ల వేంకటశాస్త్రిగారు వారీ విషయమున నిట్లనిరి.

"సంస్కృత శబ్దముల వ్యుత్పత్తులే కొన్నియో ప్రాదయం గమముగా నుండును. తక్కినవి ఏదో మాదిరిగా గనబడును. నానా గోత్రాలు కలిసి.......యుండెడి తెలుగు భాషకు వ్యుత్పత్తి నాలోచింపవలసినఁ జెప్పెడిదేమి?"

వారు కొన్ని మాటల కిట్లూహించిరి.

"అలు కడు=తీగ యల్లినట్లు చుట్టరికము పల్లెడు వాడు.

చిరపాటు=పొరయుండు పడుట—లాకటి కర్థము ప్రమాదపడుట. ( ?)

అబ్బాయి=దీని వ్యుత్పత్తి భ్రాతృ వాచక హిందీ శబ్దము 'భాయి' నుండి నిష్పన్నము చేసికొనవచ్చును. (A boy కు కూడ నా మాట సన్నిహితముగా నున్నది.)

అమ్మ+అన్న—అమ్మన్న—దీని కనయువార్థముఁ జెప్ప వలసి వచ్చిన బొత్తిగా కుదురదు.

(అభినవ సరస్వతి, నవం: డిశం 1943.)

తాత, తాల, మామ పాప, నా(యు)న మొదలగు శిశువుల యుచ్చారణా నిలభ్యము కొఱకే కాక్షరమును రెండుసారులు గూర్చిన సంకేతములుగా నోపును. మమ్మా (Mamma) పప్పీ, డాడీ, దాదా, చాచా, కాకా మొదలగునవి భాషాంతరముల యందును గన్పట్టును. అత్త, అమ్మ, శబ్దములు వరుసగా తాత (శ —(తండ్రి), మామలనుండి ఏకాక్షరము దీసికొన బడి 'అ' కారముతో స్త్రీ వాచకములై వారి యక్కలు (చెల్లెండ్రు) గా నర్థవంతములు. 'అక్క', 'అవ్వ' లట్లూహింపరాదు.

చేయునది చేయి, కనునది కన్ను, వినునది వీను, మూర్కొనునది ముక్కుగా నేర్పడి యుండును. పట్టు, కొట్టు, గొట్టు, చెట్టు, గుట్టు, నెట్టు మొదలగు వానియందు పారుష్యము ధ్వనించును. వెన్న, చిన్న, కన్న మున్నగు వానియందు సారళ్యము గన్పట్టును. వీనికి వలసినన్ని మినహా యింపులు గలవు గాన నవి కేవల మూహలనియే తలంపవగును.

బారడ=పొడకుండ, =బూది యుంటుకొనియుండ వది.

తోగరు విందు=చంద్రుడు;=కలువవిందు వంటి కొన్ని మాటలకు వ్యుత్పత్తులు కొంత స్పష్టముగా గన్పట్టును.

వర్ణముల కొరతచే నులేమగాని శబ్దములకు నానార్థ బోధన శక్తి యొకటి గలదు. ఇది శ్లేష యుండనుకూల మైనను కొన్ని చోట్ల నర్థ విపర్యాసమునకు దారితీయును. ఈ ప్రాతికూల్యమును సంయోగ, విప్రయోగ, సాహచర్యాదుల మూలమున పరిహరించుకొనవలసి యుండును.

ప్రపంచమున నించుమించు మూడువేల భాషలు గల వని చెప్పుదురు.[2] ఇందు మూల భాషలే కొన్నియో! ఉద్భవ భాషల సంఖ్యయే పెద్దది. మొత్తముమీద ఏ శబ్దోత్పత్తిలోని యున్నట్లా ధర్మము సకల భాషలందును గల దనియే చెప్పవలెను. 'భాషా కుటుంబము' లీ విషయమును ధ్రువపఱచును.

సాధారణ వస్తు నిర్దేశకత్వముననే భాషలో నెంత స్పష్టత గలదో చూచితిమి. ఇక మానసికానుభూతులయందు చెప్పవక్కఱలేదు.

తాత్వికచింతన, అంతర్దృష్టి, ఛాయావాదము, ఆత్మోద్రేకము, ఆలోచనవంటి తర్కము నధిగమించు విచిత్ర ప్రపంచములందు భాష వేగము కుంటుపడును. వైయక్తికము లనదగు ఈ ప్రపంచములను సార్వజనీనమగు భాషలో తుల నాత్మకముగ సరుగెత్తించుట ఎట్టిదో చదువరులకు విదితము. మృత్యువును గురించి ఎంత ఎక్కువ కాల మాలోచింపగలమో, అంతకాలమున దానిని గురించి భాషింపలేము. ప్రపంచములోని ద్వైతీ భావములను గణింపని మర్మజ్ఞుని గురించి వివరించుచు సుప్రసిద్ధ తత్వవేత్త బెర్ట్రండ్ రస్సెల్, "మర్మజ్ఞుడు, 'మృత్యువు జీవితమున కభ్యుదయకారి' యని తలచు" నను. ఇదెట్టిదో వివరించుట సులభ సాధ్యముగాదు.

కవితా జగత్తు పై వానికి భిన్నమైనదికాదు. కవితా బాహిరముగు సామగ్రి ఎంత యుపకరమో అంతశ్చక్షుగోచరముగు సామగ్రి యంతకంటె నవసరము. ఈ రెంటి మేళవింపుతో ననిర్వాచ్యమగు నానందము నాతడు పొందును, లేనిచో రవిగాంచనిచో కవిగాంచుట ఎట్టిది? వేదాంతి, ఆత్మజిజ్ఞాసను తనలో నిముడ్చుకొనగల్గునేమోకాని కవి తన సృష్టిచే నితరుల నానందపఱచు బాధ్యతా విశేషమును పైతము వహించును. దీని కతనికి పై పరిమితులుగల భాషయే సాధనము.

2. Thre are 8,000 languages or dialects spoken through out the world (Pears Cyclopaedia)

తా ననుభవించు భావనలో చెప్పినదంతయు నితర కల్పింప గల్గునో యూహించుటకు మన యశక్తత చాలదు. ఈ ప్రక్రియలో తన హృదయావేశముతో సమముగ సహృదయు హృదయమును లాగికొని పోవుట కన్న నూతన్న విన్నూత్న విషయము లావిష్కరింపబడునో ఒక్కొక్కప్పు డాతడే నెఱుగడు. ఇట్టి యావిష్కారము లేనిచో కవియు సామాగ్రికి కొరవియు సంభవించి యూహలన్నియు గణిత సూత్రములవలె నియమములై యుండి పోవును. ఇప్పు డలంకార విషయమున పట్లగుచుండుట విషయాంతరము. నూతన విష్కారములను చేయు మనుటకును, ప్రాత వానిని నిషేధించుటకును భేదము గలదు. కేవలము సంప్రదాయములపై తిరుగుబాటు స్వతంత్రత యనిపించుకొనదు. కాగా స్వతంత్రత కొక ప్రమాణము గన్పట్టదు. ఒకరికి క్రొత్తగా దోచినది మరియొకరికి ప్రాతదిగనే భాసింపవచ్చును. ఏ శిల్పియైనను కవి, తాను చెప్పదలచిన భావమును లోక సాధారణమగు సంకేతముతో ముడిపెట్టి చెప్పుటకు కారణ మాతని సహానుభూతి నపేక్షించుటయే. ఇట్లు గాఢ భావ సముద్ర మథనమున సృష్టించిన వానినే యాలంకారికు లలంకారములని పేరిడి విశ్లేషించి చూచుకొనియుండిరి.

ఒక భావనను వ్యక్తీకరించుటకు భాషయొక్క సమర్థత కుంటుపడినప్పుడే అప్రకృత ప్రస్తావన వచ్చి చేరుట గమనార్హము.

"నీలతోయద మధ్య స్థాద్విద్యు ల్లేఖేవ భాస్వరా
నీవార శూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః" అని

తైత్తిరీయమున పరమాత్మయొక్క అణు స్వరూపము వివరింపబడును.

"ఘృత మివ పయసి నిగూఢం, భూతే భూతే వసతి విజ్ఞానం" అని అమృత బిందూపనిషత్తులో సర్వ వ్యాప్త విజ్ఞాన తత్త్వము గురించి చెప్పబడెను.

"యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం
విజ్ఞాతగ్ం
స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికే
త్యేవసత్యం"

అని ఛాందోగ్యోపనిషత్తులో సత్య స్వరూపము వర్ణింపబడెను. ఉర్వారుక మివ బంధనాన్..... అమృతోపస్తరణ మసి, వంటి వైదిక వాఙ్మయమున పెక్కులు గలవు.

శంకరాచార్యు లద్వైత ప్రతిపాదన గావించుచు జీవ దేవ సంబంధమును గో శృంగములతో నుపమించెను. పురుషులలో పుణ్య పురుషులను వేరుగా చెప్పుటకు ఉప్పు కప్పురంబులు సరియైనవని వేమనకు తోచెను.

ఒక ఆధునిక కవి మిథ్యా రూపములగు మరీచికలను వర్ణింపదలచి

"అవి యనాథ జవాళి యూహాంతరమున
కట్టుకొను గాలి మేడల పట్టణములు" (వేముగంటి)

అని యుత్ప్రేక్షించెను.

"I shall weave a chain of pearls for thy neck with my tears of sorrow." అని రవీంద్రుడు బాష్పమౌక్తికమాలను భగవానుని కంఠము నలంకరించుటకు సిద్ధము చేయును.

ఇప్పుట రవీంద్రుని గురించి ఇంచుక ప్రస్తావించుట యావశ్యకమై యున్నది. శ్రీపాదవారు రవీంద్రుని కవిత నిరలంకారముగ నుండుననిరి. వెదుకబోయిన దొరకక, అనుభూతిలోని కీడ్పుకొని పోగలుగు నలంకారము లాతడుపయోగించును. ఒక్క గీతాంజలిలోననే యట్టివి పెక్కులు గలవు.

"My song has put off her adornments" అని యాతడు చెప్పుకొనెను. ఆ పద్యముననే "Let me make my life simple and straight like a flute of reed for thee to fill with music" అని తన జీవితమును మురళిగాజేసి భగవానుని సంగీతము నింపుమనెను. అలంకారముల గలగలలో పరని గుస గుసలు వినిపించవని చెప్పుటకు కాబోలు, "The child...who has Jewelled chains round his neck, loses all pleasure in his play" అని సాదృశ్యము చూపును.

అలంకారమును పేరులోననే కృత కల్పమందురేమో కాని యలంకారమున నుండదనిపించును. ఈ క్రింద చూపబడు ప్రయోగముల నలంకారములందురో, భావా విష్కారకములందురో, అప్రకృతములందురో నినర్గములందురో — ఏమన్నను రవీంద్రుని భావముల నవి బంధించుటలేదు — సరికదా — భావ ప్రవాహమున ముంచెత్త నల్లుచున్నవి.

"After the wedding the bride shall leave her home and meet her lord in the solitude of night"" ఇందు wedding అనునది ఆయువు తీరుటను, bride జీవమును, home కాయమును, lord మృత్యువును ధ్వనింపజేయుచు భావ ప్రేరకములగుచున్నవి. ఇది శ్రీనాథుని హరవిలాసము నందలి సిరియాళ చరిత్రలోని "......మని కూరిమి నందనుఁ బెండ్లి సేయగా వలయుననంత లక్షణము, వైభవ మొప్పగ ముక్తి కన్యతోన్" అను పద్యమును జ్ఞప్తికి దెచ్చును.

స్థానము నానందించును. పాఠానువ్యుడు, 'తాను ఆన చెవిటను త్రెట్టుగుడు?'రని దప్పరించి వేయును. వింత యేమున్నదను ?

శ్రీ అక్కిరాజు ఉమాకాన్తంగారి విమర్శలను విమర్శిం చుచు శ్రీపాదవారు భారతి (సెప్టెంబరు 1963)లో "దోష విమర్శలూ—పురోగమనమూ" అను తమ వ్యాసమున నిట్లందురు.

"ధ్వనించే రచన చెయ్యడానికి కావలసినట్లే ధ్వనిని పట్టడానికి చెవులూ చైతన్యమూ కావలెను. 'తాడిపండంత [illegible] అగి చంద్రుడు తాను చెవి యొగ్గెనో' అని విని చంద్రుడికి చెవులున్నాయా? చంద్రుడు డాగేడా? అంటే భూమి తిరగ డము మానేసిందా? అని ప్రశ్నలు వేయడ మారంభిస్తే అంతమవుతుందా? 'ఒక అలంకారం చాలదా? ఇది ఎందుకూ అంటే జవాబేమిటి? కవి రచనలో ఒకప్పుడు అలంకారాలు పెనవేసికుంటాయి. వాటిని వేరే వేరే ఇస్తే వాటి సమ్మేళ నమువల్ల చదువరిలో జరిగే భావ మేళనము జరుగదు.... భావవేశాన్ని చదువరి కందించడానికి పెక్కులు ఉదాహర ణలు (అలంకారములు) అవసరమవుతాయని గ్రహించలేక పోవ డము వారి (ఉమాకాన్తంగారి) అల్పరసిక్యానికి గుర్తు."

ఏ సందర్భమున చెప్పిన నైనను పై వాక్యము లలం కార ప్రయోజనమును సమర్థింపగలవు.

పండిత దృష్టి కవియొక్క వ్యుత్పత్తిపైనను, రసికుని దృష్టి యాతని ప్రతిభా విశేషముల పైనను ప్రసరించును. (పండితులను, రసికులను, వేరుచేయు నుద్దేశముకాదు) కాని "అవ్యుత్పత్తి కృతోదోషః శక్త్యాసంవ్రియతే కవేః" అన నట్లు కావ్య విషయమున ప్రతిభకు గల గౌరవము వ్యుత్ప త్తికి లేదేమో యనిపించును. అపబద్ధ కవిత్వవాదులు చెప్పును దిందుమించుగ నిదియె కాబోలును. దీనికి విపరీత పక్షముగా కావ్య మీమాంసలో "కవేః సంవ్రియతే శక్తి ర్వ్యుత్పత్త్యా కావ్య వర్త్మని" అని రాజశేఖరు డన్నమాట ప్రతిభలేని కవుల కూండించునదే దోషము. భావనా సంస్కారమునకు శాస్త్ర పరిజ్ఞానము దోహదకారి కావలయుననే గాని తనకు తానై నిర్బంధించు కవి హృదయమునకు విలువ తగ్గును. శాస్త్రము శాసించును. ఒక్కొక్కప్పుడు భావనా బలమా శాసనమును ధిక్కరించును. మేధోగతములగు గణిత, భౌతిక శాస్త్రములందే ఈ ధిక్కార మప్పు డప్పుడు గన్పట్టును. అట్టి ఎడ కేవల మానసికమగు కావ్య వ్యాపారమున నసాధ్య మేమి?

మన యలంకారములతో పోల్చిన నాంగ్లాలంకార ములు వ్రేళ్లపై లెక్కింపవచ్చును. 18 వ శతాబ్దికి లోగడ వారికి వ్యాకరణ శాస్త్రములేదు. ఐనవేమి? అలంకారముల వాడుకగాని, భాష కొక సువ్యవస్థగాని, పుష్కలముగు పాఠ వ్యముగాని లేదనుకొనలేము. కావున నలంకారముల సద్వ్యయ నము చేసి ప్రయోజనము కవిత్వమునకున్న, కవితలో సహజ సుందరముగ నిమిడిపోవు నలంకారములను పెక్కు లీయవలె గాని లేదు. వాని నలంకారములని పిలువకున్నను సరియే.

విమర్శకులు రసిక హృదయమునకు, కవి హృదయమ్మో నకును ప్రమాణముల నిర్ధారింప గడంగుటచే నీ చిక్కు లేర్పడుచున్నవనిపించును. 'ఇది ఇట్లున్న బాగున్నది', 'ఇందు వలన బాగులేదు' అను హేతువాదము చెప్పువారల వాక్యమునుబట్టి మాటల మేరకు తాత్కాలిక సత్యమును భావింపజేయునుగాని వస్తువుయొక్క సత్యమైన విలువ మాటలకన్న ననుభూతికి విశేషముగా తెలియును. కావ్య రస మునకు నొరగల్లు సహృదయ హృదయమే.

మనవారలు బ్రహ్మానందమునకే కొలత లేర్పరచిరి కావ్యానందమునకు లేకపోవుట యేల? యని వారి వారి ప్రతిభ ననుసరించి 'ఆనంద' మను మహత్పదార్థమును విశ్లేషించిరి.

ఒకరు కవిత వాస్తవముగ నుండవలెనందురు. మరి యొకరు వస్తువమున నానంద మేమున్నది? కాల్పనికమై యుండవలెనందురు. వోల్టయర్ అను రష్యన్ రచయిత కళను గురించి యాలోచించుచు, "సౌందర్యము, వాస్తవికత్వము నకు స్వేచ్ఛను ప్రసాదించునదిగా నుండవలయును" అని భావిం చును.

విశ్వశ్రేయమని, సత్యాసార విశ్వప్రీతియని, రసాత్మక మని, రమణీయార్థ ప్రతిపాదకమని కావ్య ప్రయోజనమును కావ్యమును గురించి బహుభంగులుగా వివరించిరి. ఇటీవల నుండి రస ధ్వని ఔచిత్యమో కావ్యాత్మలను పేర్కొం దురు.

అలంకార 'సంపన్నుడు' కావ్య మలంకార భూయిష్ఠ ముగ నుండవలయు ననుటలేదు! అంటరానితనము వ్యాప్తి కొఱకు, లేదా కృత కర్మ సాఫల్యమును పరిహరించుట కొఱకు శ్రీపాదవారు నిరలంకార రచన చేయుచుండిరి. ఎవరేమన్నను కవి స్వేచ్ఛకు బాధకములు గాకుండ చూడ దగును. 'సాలంకార—నిరలంకార'ములు వాదములను విస్త రింప గల్గుటకు సహాయ మొనర్చునవేగాని 'కవి' కవి యాద ర్శములు గావు. కాకూడదు.

"చిత్తమానంద మయ మురిపికల సోల
హృదయ మానంద భంగ మాలికల దేల
కను లవానంద జనితాశ్రుకణములార" [దే.కృ]

కవి స్వేచ్ఛగా పాడుకొనుచు 'నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు?' అని పాడిపోవుచుండును.

# ఒక పల్లెటూళ్ళో సంధ్యా దృశ్యం

కమ్మిశెట్టి

జీవసత్త్వాలుడిగిన వృద్ధసూర్యుడు పశ్చిమ దిగ్వేదికపై
ప్రశాంతంగా ప్రసారం చేస్తున్నాడు ధర్మోపన్యాసం
దారీ తెన్నూ లేని చంచల మేఘ పరంపర
స్వీకరిస్తోంది కాషాయాంబరాలతో తక్షణం సన్యాసం—
ఘనీభవించిన అవనీ వేదనలా నిల్చి
దూరంగా
ఎండకు ఎండి ఎండి మండిపోతున్న కొండల రాయని
ముద్దిడ బోయిన మబ్బుకన్నె మూతికాలి, తొలగిపోయింది.
కొండ చాటున అప్పుడే మొలిచిన ఓ తార అపహాసిస్తోంది.

గాలికి చీలిపోయిన అరటాకుల గోలలో
పిచ్చి పూలు నవ్వుకుంటున్నాయి తోటలో
రెండు వైపులా నాగజెముళ్లు మొలిచి
పల్లేరు గాయలు పరచుకున్నాయి బాటలో

కొండమీద రహస్యంగా కాచిన దొంగ సారాలా
భయంగా, మందంగా, వెచ్చగా ప్రవహిస్తోంది కొండవాగు
నిముషానికోమారు కళ్లల్లో
దుమ్ముకొట్టి పోతోంది సుడిగాలి.

కర్ణ కుండలాలు తగిలించుకున్న రసాకృతులు తాటిచెట్లు
సౌశీల్యాన్నీ దానశీలతనూ చప్పుడు చేసుకుంటున్నాయి.
ఆకులు మేకలు గొరిగేస్తే
అకాల శైశిరం వచ్చి
వొళ్లంతా ముళ్ళే మిగిలి జిగుళ్లోడుస్తూ
కసిగా చూస్తున్నాయి నల్లతుమ్మలు.

ఆంజనేయావతారమని అభిమానిస్తే
కోతులు చేసిన చేష్టల్ని చూసి
గొల్లుమంటున్నాడు యజమాని మామిడితోపులో
గుండెల నిండా దిగబడిన కఠిన శిలలతో
ఎన్ని అమృత వర్షాలు కురిసినా ఆరని దాహంతో
ఎండి బీటలు వారి మొండికెత్తి
నిరాశగా పరచుకున్నాయి పొలాలు.

నింగి నీలిమా, రాగారుణిమా ప్రసరించని జాడల్లో
ఏపుగా దట్టంగా ఎదిగిన వేదనా వృక్షాల నీడల్లో
కక్షలు కత్తిరించిన అనురాగ లతల మధ్య
విద్వేషాల విషవాయువుల్లో వసివాడిన పూల మధ్య
స్తబ్ధంగా పడివుంది—
పొగచూరిన మసిబారిన మొండిగోడల పల్లెటూరు
నగరకాళికి రక్తమాంసాల్ని ధారపోసి
మిగిలిపోయిన బూమికుల గూడు
సజీవ మానవ కాష్టాలు కాలుతున్న వల్లకాడు.

పనికి మాలిన కాకులు చేస్తున్న గోలలో
డొక్కలు నిండని ఆలమందలు రేపిన ఎర్రదుమ్ములో
బండ చాకిరితో బండబారిన శ్రామికులు
అలసిన కనుచూపులు ప్రసరించినంత మేర వినిపించే
ఆశాహీన అర్థహీన మౌన జీవన సంగీతంలో
కనిపించని కత్తిపోటుతో మూల్గిన కవిహృదయం
దిగంతాల ప్రవహించిన రక్తకాంతి గీతంలో
ప్రతిరోజూ నటిస్తుంది ఆ వూళ్లో అసురసంధ్య
అందాన్ని, ఆనందాన్ని పూయలేనివంధ్య.



# సాహిత్య అకాడమీవారి భాగవతము*

## శ్రీ నిడదవోలు వేంకటరావు

'బ్రౌను పాఠాంతర పరిష్కార' ప్రతియున్నను, భాగవత ముద్రణమున్నను, భాషోద్ధారకులు బ్రౌను దొరవారు— మనకు జ్ఞాపకము వచ్చెదరు— భాగవత కర్తవలె బ్రౌను— దొరవారును సంస్మరణీయులు— తెలుగు భాషలో మొట్ట మొదట ప్రాచీన కావ్యమునకు, తాళపత్ర ప్రతులతో సంప్రదించి పాఠాంతరములను సూచించి, పాఠ నిర్ణయమును గావించి గ్రంథ పరిష్కరణమునకు శ్రీకారము చుట్టిన వారు వారే —భాగవతమునకు వారు క్రీ. శ. 1827 నాటికే, యొక పరిష్కృత ప్రతిని తమ స్వంత ద్రవ్యముతో సిద్ధము చేయించి నట్లు వారి నిఘంటువు పీఠిక— వలన విదితమగుట తెలుపుచున్నది—

ప్రస్తుత ముద్రణము బ్రౌను దొరవారి ప్రశంసతో ప్రారంభము కావలసి యుండెను. 'సంపాదకులు' వారి పేరున్నను వారేయే ప్రతులను పరిశీలించిరో, ఏయే ప్రతులలో పరి పాఠభేదములు సూచింపబడినవో, ఆ వివరము లిందు లేవు. తక్కిన తాళపత్ర ప్రతుల వివరణము లిచ్చినపుడు ప్రథమముగా భాగవత పరిష్కరణమునకు కర్తలైన బ్రౌను దొరవారి ప్రతియందలి విధాన మెట్లున్నదో, పాఠభేదము లెట్లు సూచింపబడినవో తెలియపఱచుట కూడ యావశ్యకమై యున్నది. అంతేకాదు తాళపత్ర ప్రతుల వివరణములో (పీఠిక 177 నుండి 182 పుటలు.) బ్రౌను దొరవారి పరిష్కరణ ప్రతులకు గాని, బ్రౌను పాఠములకు గాని ప్రత్యేక ముగా నేమాత్రము సూచన లేకపోవుట చేత, ఈ ముద్రణమున నా పాఠములతో సంప్రదింపు జరిగినదో లేదో సందేహముగా నున్నది.

తాళపత్ర ప్రతుల శీర్షిక పరిశీలించినచో ఈ భాగవతమున కు వివిధస్థలములనుండి 265 ప్రతుల వివరములను సేకరించి నట్లు గలదు. (పుట 177) వీనిలో బ్రౌను దొరవారివి కాక మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందున్న ఇతర ప్రతుల ప్రసక్తియే లేదు— ఇవి కాక తిరుపతి వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున నున్నవి. అవి యిప్పటి నున్నను వానిలో 101 ప్రతులకు వివరణగల కేటలాగును యిప్పటి కేంద్ర క్రిందనగా క్రీ. శ. 1915 లోనే మదరాసు ప్రభుత్వము వారు ప్రకటించి యున్నారు. పై 120 ప్రతులే గాక, మద్రాసులో, ఆ భాండాగారమున నింకను భాగవత ప్రతులు గలవు— అవి మదరాసు విశ్వవిద్యాలయము వారి నుండి ఆంధ్ర రాష్ట్రావతరణమైన వెనుక ప్రభుత్వము వారు గ్రహించి భద్రపఱచిన సంకలనములోనివి— వీని పరిశీలన జరిగినట్లు లేదు—

ఇక, వివిధ స్థలముల నుండి, సంస్థల నుండి సేకరించిన తాళపత్రముల వివరములను మాత్రమే— సేకరింపబడినవి గాని— ఆయా ప్రతులలోని పాఠములు సంప్రదింపబడి యుండలేదని — 178 పుట నుండి ఈయబడిన తాళ పత్ర ప్రతుల వివరణ సాక్ష్యమిచ్చుచున్నది. ఇందు పరిష్కరణకు సాధారణముగా చెప్పుకొనిన 26 ప్రతులలో, 21 ప్రతులు కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారినుండి గ్రహించినవే— కాని 26 ప్రతులని ఇచ్చిన సంఖ్య సరికాదు— 181 పుటలో నెం. 4200—లు గల ప్రతి 'ద' క్రింద 3, 5 సంఖ్యలుగా రెండు మార్లు పేర్కొనబడుటచే నిది యొక్కటిగానే పరిగణింపవలెను. అప్పుడు ప్రతుల సంఖ్య ఇరువదియైదే— వీనిలో 2 ప్రతులు గౌతమీ గ్రంథాలయము వారివి— 5 ప్రతులు (3456 సంఖ్య గల ప్రతితో కలిపి) తెలంగాణా ప్రాంతమునకు సంబంధించినవి. కాబట్టి, ఈ పాఠపరిశీలన మునకు—ప్రధానముగా—ఆంధ్ర సాహిత్య పరిషత్తునందలి ప్రతులే, గ్రహింపబడినవి తక్కిన ప్రతులలోని పాఠము లిందు సేకరింపబడలేదని నిశ్చయింపవచ్చును—

---

* శ్రీ మహాభాగవతము — నాలుగు సంపుటములు. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి ప్రచురణ— సంపాదక వర్గము : ఆచార్య రాయప్రోలు సుబ్బారావు (అధ్యక్షులు) డాక్టరు దివాకర్ల వేంకటావధాని. డాక్టరు బి. రామరాజు—కన్వీనరు— శ్రీ తాపీ ధర్మారావు, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి.

వెల : ఒక్కొక్క సంపుటము: ఆరున్నర రూపాయలు.

తాళపత్ర ప్రతులవే గాక ఈ ముద్రణమున కింతకు ముందుగా ముద్రితములైన ప్రతులు— గూడ సంప్రతింప బడినట్లు పీఠిక 169 పుట నుండి తెలియుచున్నది. ప్రతి పుట యడుగున వ్రాత ప్రతుల పాఠములతో పాటు, మూడు ముద్రిత ప్రతుల పాఠములు గూడ నీయబడినవి. దీనిని బట్టి పాఠ నిర్ణయ సందర్భమున ఈ రెండింటిని గ్రహించి రనుట వాస్తవము. అట్లు గ్రహించినపుడే గ్రంథముద్రణ ప్రధానాశయమే విఫలమైన దని ఈ క్రింది యంశము విశదము చేయుచున్నది.

ప్రస్తుత ముద్రణమునకు హేతువింతకుమున్న ప్రకటితములైన భాగవతము లన్నింటికన్న దీనిని ప్రామాణిక ప్రతిగా సిద్ధము చేయుటకే యని చెప్పబడుచుండ[1] అట్లుండగ, అచ్చు ప్రతులలోని పాఠములను గూడ గ్రహించుట ప్రామాణిక ప్రతి ప్రణాళికకు నత్యంతము విరుద్ధమే కాక యనావశ్యకము. ఇదివఱకు ముద్రితములైన భాగవత ప్రతులలో నాయా ప్రచురణకర్తలు సాధారణముగ నంతకు పూర్వము ముద్రిత గ్రంథములనే పునర్ముద్రణము చేసిరి. వానిలో వావిళ్ల ఆనందముద్రణ ప్రతి— (తం|ప్రతి) యందు మాత్రమే స్వల్పాతి స్వల్పముగ నచ్చటచ్చట వ్రాత ప్రతులు సూచింప బడినవి. ప్రప్రథమమున ముద్రించువారు కొన్ని తాళపత్ర ప్రతు లనుసరించియే ముద్రింతురు. కానివారి దృష్టి గ్రంథ ముద్రణమునందే యుండును గాని ఈ పాఠము ప్రామాణికమా, కాదా, అన్న సమస్యయే వారికుండదు— తక్కిన ప్రచురణకర్తలనంతే— గ్రంథ ప్రచారమే వారి ముఖ్యాశయము. ఈ కారణముచేతనే, తరువాతి వారందరి పాఠభేదములను గూర్చి శ్రద్ధ వహింపరైరి. పరిష్కర్తలకు పట్టి యవకాశ మీయరైరి. దీనివలన, అచ్చు ప్రతులందలి పాఠముల ప్రమాణికములైనవి. సుపరిష్కృత ముద్రణములలో వీనిని గ్రహింపక పోవుటకిదియే కారణము.

ప్రామాణిక ప్రతిని సిద్ధము చేయున ప్పుడు తాళపత్ర ప్రతుల పాఠములనే సేకరించి వానిని చర్చించి, పాఠ నిర్ణయము చేసి వానినే మూలపాఠములు లేక ప్రధాన పాఠములుగా నిచ్చుటయే సక్రమ పద్ధతి. పుట యడుగున తక్కినవి సూచితములగును. ముద్రిత ప్రతులలోని పాఠము యామూలాగ్రముగా పరిశీలితములుగా లేనిదే కదా, తాళపత్ర ప్రతుల పాఠములను ప్రామాణికముగా గ్రహించుట ! అట్టి పరిస్థితులలో నేటి ముద్రణమున— రెండు పాఠములను చూపుట సరికాదు.

ఇంతేకాదు. అనపాఠములన్న శీర్షిక క్రింద ముద్రణ ప్రతులలోని పాఠములే చర్చింపబడినవి కాని, తాళపత్ర ప్రతులలోని పాఠముల చర్చయే లేదు— ఇన్ని తాళపత్ర ప్రతులతో ప్రతి సంప్రతించినపుడు పరిశీలనము వలన, మనకు ముద్రిత ప్రతులకన్న నూతన పాఠము లెంత విలువగలవి లభించినవో, వానివలన, భాగవతమునకు, తెలుగు సాహిత్య విమర్శనమున కెట్టి లాభము కలిగినదో యా విషయములను విశదీకరించుట, విపుల వివరణ మావశ్యకము— ఈ ముద్రణమున పుట యడుగున వ్రాతప్రతుల పాఠములెన్ని చూపబడినను— పీఠికలో వాని విమర్శన మెచ్చటను లేదు— చాలా చోట్ల క్రింద నిచ్చిన పాఠములకు, మూల నంగీకరించిన పాఠమునకూ సంబంధము గాని— సమన్వయము గాని లేదు. మూలపాఠము గూడ— అచ్చు ప్రతి పాఠమే గ్రహింప బడినది— నిర్ణీతములైన తాళపత్రప్రతుల పాఠములు మూలమున లేనందున— నిది 'బహు పాఠాంతర పరిష్కరణమై— ప్రామాణిక మెట్లగునో' విచారింప వలసి యున్నది.

తాళపత్ర ప్రతులను పరిశీలించి, యచ్చు ప్రతులలో లేని పద్యములు వచనములు, ప్రత్యేకముగ గుర్తించి యాయా పుటల యడుగున సంపాదకులు చూపియున్నారు. అయినను కొన్ని పద్యముల కట్టి చిహ్నములు లేకపోవుటచే వాని యునికి గమనించుటకు వలను లేకున్నది. చూడుడీ క్రింది పద్యము—

క. గొల్లలకును గంబళ్లను
జిల్లులు గట్టంగ గుఱ్ఱు చీరలు నిచ్చె
మొల్లనె మేలమాలాడెడి
యుల్లంబున నడుగ నిట్లనుచితమె మీకున్

నాల్గవ సంపుటము (పుట 168)

ఇది దశమస్కంధము పూర్వభాగము.[2] 1275 వ పద్యముగా నున్నది. ఇది భాగవత ప్రథమ ముద్రణ ప్రతి నుండి తరువాత ముద్రితములైన యే ప్రతులందును లేదు— పుట యడుగున నే సూచనయు లేదు— మఱి ఇది యెక్కడ నుంచి వచ్చినది ? వ్రాత ప్రతులలో నున్నదో లేదో తెలియుట కవ కాశము లేదు.

దశమస్కంధము— ఉత్తర భాగము— 385. పుట 294. ఇందు అధోజ్ఞాపికలో ఈ క్రింది పద్యములు రెండును తం. వా. ప్రతులలో నున్నవి— 'హా'లో లేవు. అధికము.

---

1. "బమ్మెర పోతరాజ కృత భాగవతము ప్రామాణిక ప్రతిని సిద్ధముచేసి ప్రకటింపవలెనని 1961 సంవత్సరము జూన్ నెలలో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ నిర్ణయించి" 'సమర్పణ' ప్రారంభవాక్యము.

2. 'ఇదివఱకు భాగవతముద్రణములం దన్నిటియందును, దశమస్కంధము— పూర్వోత్తర భాగములు విడివిడిగా ప్రతి పుటయందు ముద్రితములు కాగా, ఈ ముద్రణమందట్టి సూచన పుటలపై లేకపోవుటచే, పద్యముల యునికిని తెలిసి కొనుట కష్టతరమైనది.

క. నీల నటాంచితమ్మై మువి
కాంచెఁ బై వాయునిహతిఁ జండధ్వనినా
ధీఃమగు నటని కేతన
మూలోన నకారణంబున మీనింగూలెన్

క. అది చూచి దనుజ పాలుడు
మదరాంతకు దాడిపట్టి మాట నిజముగా
గదనంబు గలుగు ననుమును
నెదురెదురే చూచుచుండె నెంతయు భీతిన్

ఇవి తాళపత్ర ప్రతులలో నున్నవా, లేవా యను సంగతి సూచింప బడలేదు.

కొన్ని పట్టుల పద్యములకు వ్రాత ప్రతుల పాఠములు చూపబడలేదు. వాని పాఠాంతరములు పుట యడుగున నచ్చు ప్రతులలోని యథోజ్ఞాపికలే చూపబడినవి. దశమ. పూ 1364.

క. ...............ధువలా
పాటోప నృపతి కేటున్

పుట యడుగున శోభిత బాహాస్ఫోట సత్స్వన కిరీటున్. తం. F. N. అని కలదు.

దశమ— పూ. 1230—

శా. ప్రేమర్లసి8 నిజధర్మ గేహములలో విభ్రాంత చైత
న్యయై

పుట యడుగున—3 నకు నర్మ (తం. F. N.) అని కలదు. 4 సంఖ్యకు పాఠాంతర మీయ బడలేదు. పై పద్య సంఖ్య కూడ తప్పినది. అది 1430గా నుండవలెను.

ఏకాదశ స్కంధము—6

మ. విదితుండై సకలా మరులే గొలువ నుర్వీ భారమున్
మాన్పెదు
ర్మద సంయుక్త వసుంధరాధి పతులన్ మర్దించి
కంపాటులన్
దుది ముట్టన్ స్వధియించి కృష్ణుడలి సంతుష్ట
తుండై యున్నచో
యదు సైన్యంబులు భూమి మోవఁగ సవిస్తాం
బయ్యె నుర్వీశ్వరా

పై పద్యమే— 'గొలువ అనుచో', 'పెగడ' అనియు, 'భూమి మోవఁగ' అనుచో 'భూమిలోన' అనియు, సవిస్తాం బయ్యె 'అనుటకు సవిస్తాంబయ్యె యనియు, పాఠ భేదములతో హరిభట్టు ఏకాదశ స్కంధమున నున్నది.

ఏకాదశ—96.

ఉ. దారల యందుఁ బుత్రధన ధాన్యములందు ననేక
భంగులన్
గూరిమి చేయు మర్త్యుఁ డలి ఘోర వియోగజ
దుఃఖ మగ్నుడై
నేరుపు దక్కి చిక్కుపడి నిర్భరశోక విహీనుండై
మహా
భారములో కపోతపతి భంగి నిజంబుగఁ బోవు
నష్టమై.

ఈ పద్యమునే మార్పులు లేక హరిభట్టు— ఏకాదశ స్కంధమున 202వ పద్యముగా నున్నది. (చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక,—4 సం. 41, 42. సం. 1—4) కాని పుట యడుగున నీ పద్యములు హరిభట్టు రచనములుగా తెలుప బడి యుండలేదు— పై పద్యములకు తాళపత్ర పాఠము లీయబడి యుండలేదు—

## పాఠ పరిష్కరణము

1. 1–1 శ్రీ కైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్
లోకర
క్షైకారంభకు, భక్తపాలన కళా సంరంభకున్—

ఈ పాఠమున గల 'రక్షాకార' అను మార్పును గూర్చి 'అచ్చుప్రతులు— అపపాఠములు' అను శీర్షికలో మొదటనే గలదు. ఇందు 'అఖండపది' కలదని— క్రీ. శ. 1920లో "తెనుగు" పత్రికలో (9—10 సంచికలు) శ్రీ గిడుగువారు నిర్ణయించిరి. కాని యా విషయమిందు లేదు.

2. 1—2 వాలిన భక్తి. పుటయడుగున 'ప్రాలిన' అను పాఠము గలదు— అదే సరియైనది. 'ప్రాలు' అను క్రియ 'ర'కార ఘటిత మనుటకు నీ క్రింది ప్రయోగము గలదు "ప్రాలియా క్రింది పటకుటీరంబు జూచి. రసి. 2 ఆ" శ. ర. ఇందు ప్రముక్కు అనునర్థమున గూడ— రేఫ ఘటిత ప్రయోగమే చూపబడినది— చూడుడు శ. ర. పుట 749.

3. 1—3 అరత "సేవసేపెద—ఇనుడు తాళపత్ర ప్రతుల పాఠము చూపలేదేం? 'సేవ జేసెద' యని యుండదగును.

4. 1—6 కోటీరలంబు చెప్పుడురు— కోటీరలంబు నన్నుడురు పోఁకన్"—4 వ్రాత ప్రతులలో నీ పాఠమున్నది.

ఇంతే కాదు.8 'హ. ప్రతిలో' మహాలయమున— చెప్పుడురు అను పాఠమున్నను, ఆ పద్యములున్న పుటకు ముందే "శ్రీమదాంధ్ర భాగవతమునకు ప్రారంభమునకు ముందు ప్రతిదినము చదువ వలసిన ప్రార్థనా ప్రతిపాదక పద్యములయిన క్రమణిక— "శ్రీ సరస్వతి ప్రార్థన" అను శీర్షిక క్రింద కోటీరలంబు చెప్పుడురు పోఁకన్— అనియే యున్నది. ప్రాత ద్వితీయము పొత్తునకు నిష్టమేగదా!

5. 1—7— పుట్టంగానట్టి శరంబున్ మొదట—

---

3. హ. ప్రతి యనగా పురాణంపాయ గ్రీష్మ శాస్త్రిగారి ప్రతి. ఇది యే గాక తక్కిన యచ్చు ప్రతులన్నియు నా వద్ద నున్నవి. తం. తంజనగరము వారి ఆనంద ప్రతి.

పోతరాజొకండు' అని ప్రథమ పురుషము కనబడుచున్నది. చూచిన వ్రాత ప్రతులన్నింటిలో నీ పద్య మప్పటనే యుండుట చేత అట్లే యుంచబడినది" ఇదియును క్రొత్త విషయము కాదు. దీనిని గూర్చి క్రీ. శ. 1948 భాగవత పీఠికలో పేర్కొంటిని. 'ఇదియును ప్రక్షిప్తమే. వచనము లోని "చెప్పంబడె" యను మధ్యమ పురుష క్రియతో "చెప్పెడి బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్" అను ప్రథమ పురుష క్రియగల వాక్య మన్వయించుటలేదు. ఇప్పుడున్న చోట సమ్మానితమై యున్నది. పుట 11

ఈ పద్యము పోతనకృతమే యని యాంధ్రలోక మాటాల గోషిం చేయుచున్నది. అయినను పరిష్కర్త ఈ పద్యమును గూర్చి చర్చింపనే లేదు. "చూచిన వ్రాత ప్రతులన్నింటిలో నీపద్యమిప్పటనే యుండుటచేత నట్లేయుంచబడినది" అని వ్రాసినారే! అప్పుడు పరిష్కర్తలు చూడకుండనున్న వ్రాతప్రతుల సంగతి యేమి ? ఉపలభ్యమానము ప్రతుల నన్నింటిని ప్రధానముగ పరిశీలించి గదా ఇట్టి పద్యముల యునికి నిర్ణయింప దగినది. నా యనుభవమును బట్టి కొన్ని తాళపత్ర ప్రతుల లోని పద్య మప్పుడు నుండి యుండదు దీనికొక యుదాహరణము నిచ్చుచున్నాను. భారతమున— "పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయణభట్టు" అను పద్యము— కొన్ని తాళపత్ర ప్రతులలో గానరాలేదు— చూడుడు. నా తెనుగు కవుల చరిత్ర— పుట 158. ఇట్టి సందర్భములలో, తాళపత్రముల పూర్వ, పూర్వతర, పూర్వతమ ప్రతులను కాల క్రమము ననుసరించి పరిశీలింప వలయును— ఈ పద్యమున మఱియొక విశేషము గలదు.

ఇది నన్నయ—

సార మతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ
యుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.

అను పద్యము ననుసరించినది.

ఉ. ఇమ్మను జేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసికాలచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్.

పై పద్యమున— 'సమ్మెట వాటులంబడక' అను పాఠము మూలమున నీయబడి పుట చివరగన. 'వ్రేటుల' అను పాఠము చూపబడి యున్నది.

"వ్రేటులు" అను పాఠమునకు — తాళ పత్ర పాఠముతోండి యుండ నగును. మఱియు సమ్మెట దెబ్బకు వ్రేటులనుటయే సమంజసమని భారతము భీష్మ పర్వములో "సమ్మెట లను జేరుకోలను వ్రేసి, ముంగటింబుల నాటి" ప్రయోగము తెలుపుచున్నది.

9. 1– 19

ఒవరన్ నన్నయ తిక్కనాది కవులీ. . . . .
తెనుంగుల్ సేయుచు. . . . .
తెనుగుం జేయరు. . . . . .

ఈ ముద్రణమున నిది యొక ముఖ్య పాఠభేదము— పై రెండింటికి నితర ముద్రణములలో, తెనుగుం జేయుచు, తెనుగుం జేయరు— అను పాఠములే కలవు— వీని రెండింటిలో రెండవ దానికి మాత్రమే పుటయడుగున "22. తెనుగుల్ కాయరు (క)" అని పాఠభేద మీయబడి యున్నది. కాని మొదటి దానికి పాఠాంతర మీయబడలేదు— "తెనుగుల్ సేయుచు" అను పాఠము 'హ' ప్రతి నుండి— అనగా నచ్చు ప్రతి నుండి గ్రహింప బడినది — ఆ విషయమును తెలుప లేదు. దీనికి తాళపత్ర ప్రతులలోను పాఠభేదమున్నది చూప లేదు— సరికదా. తాళపత్ర ప్రతిలోనిదని చూపిన 'తెలుగుల్ కాయరు' అను పాఠమును— మూలమున— తెనుగుం జేయరు" అని ఇచ్చియున్నారు. అచ్చు ప్రతిపాఠమునకు తాళపత్ర ప్రతిపాఠమీయకుండ, తాళపత్ర పాఠమును నచ్చులో మార్పు చేయుటకు కారణము తెలియుటలేదు. భాగవతమునకే కాక భాషకును, ముఖ్యముగ నిట్టి శబ్దమును గూర్చి, పీఠిక యందుగాని యథపాఠముల యందుగాని విమర్శయే విస్మృతమైనది. కాని ఇంతకు ముందు శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారి సాహిత్య సమీక్ష— తెలుగు నిఘంటువు, అనుశీర్షికలో నాటిన విషయము ని పాఠమును గూర్చి ఇట్లు వ్రాయబడి యున్నది.

"(6) తెనుగు చేయు— తెలిగించు.... దీని వివరణమైన వెనుక, తెనుగు చేయు— అనునర్థమున 'తెలుగు సేయు'. అనియు కలదు." అని కావ్యాలంకార చూడామణి నుండి ప్రయోగము నిచ్చి యా వెనుక వారిట్లు వ్రాసియున్నారు.

"పోతన భాగవతములో,— ఒవరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విం బురాణావళుల్ తెనుగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో తెనుగుం జేయరు." అని యున్నది.

కవి పాఠము "తెనుగుల్ చేయుచు.... తెనుగుల్ చేయరు" అని యుండునని నా యభిప్రాయము. (పుట 47)

దీనినిట్టి శ్రీ శాస్త్రిగారి యభిప్రాయము ననుస రించి రెండు చోట్లను— తెనుగుల్ చేయుచు, తెనుగుల్ చేయరు యనియే యుండవలెను— కాని నేటి ముద్రణమున— నొక్కచోట "తెలుగుల్ చేయుచు" అని యుండి రెండవ చోట, "తెనుగుం జేయరు" అని యుండుట వింతగ నున్నది. ఇంత కును, వింత ముఖ్యముగ నట్టిన— తాళపత్ర ప్రతి పాఠము ననుదాహరింపక పోవుట యెంత కంటె వింత !

'తెనుఁగుల్ చేయుచు-' తెనుఁగుల్ చేయరు అను పాఠమొకటియగా, రెండో తాళపత్ర ప్రతులలో నున్నప్పుడు, తెలుగులు- తెనుగున ఆనుశాబ్దిక విమర్శనము గూర్చి పరిష్కర్తలు చర్చింపవలసి యుండెను- తెనుఁగుల్ చేయుచు, అనురీతిగా, 'తెనుఁగులకు' అనురూపముండునా ? ఉన్నచో దానికి ప్రయోగములు గలవా ? ఇక తెనుఁగులకును అనుచోట "తెనుఁగునకు" అనియో నిర్ధారకముగా, సందుగాని కేవ యాంధ్ర భాషా భూషణమున- ఈ క్రింది పద్యము ఘోషించు చున్నది.

సీ. పా. వృక్షేణ దక్షాయ పక్షిభిః వు త్రస్య
యును విభక్తులు తెనుంగునకు లేవు-
ఇచట 'స' ప్రమాణము- ప. 28

కేతన- దేశి తెనుఁగులు- 22 ప. తెనుంగులు గావింతు (28 ప) తెనుఁగులలో (29 ప) అని యుపయోగించి నట్లు భాషా భూషణ ముద్రణములో నున్నది. పై వానిలో 'తెనుంగులు గావింతు' అనునది 'తెనుంగును గావింతు" అన్నను సరిపోవును. అట్టి యెడ పై రెండు చోట్లను- తెనుగుల్ చేయుచు, తెనుగులై చేయరు అని గాని, తెనుఁగు జేయుచు, తెనుఁగు జేయరు, అని యొకరీతిగా పాఠమును నిర్ధారించుట సమంజసము- తెనుగులు, తెనుగు శబ్దముల గూర్చి విద్వాంసు లింకను చర్చింతురుగాక.

10. 1—25—ఆ మానిని కుదియించితి మే మిథువు రము. పుట యడుగున అందు వ్రాత ప్రతులలో ' ఆ మిథు నమునకుఁ బుట్టితి' అనుపాఠము గలదు. 'హ' ప్రతిలో నీ పాఠమే గలదు— ఇప్పటి పరిష్కర్తలు. సమన్వయము చూచి కొనుక 'త' ప్రతి పాఠమునే స్వీకరించిరి. ఈ పద్యమున మార్పు 'త' ప్రతిలో గలదు. దాని ననుసరించి తక్కిన వారందఱు ముద్రించిరి. ఈ పద్యమునకు పైన మూడు పద్యములలో పోతన తలిదండ్రులు లక్కమాంబా కేసనలు- వేర్వేఱుగా పేర్కొన బడినారు కేసనకు లక్కమాంబ గేహిని యని మొదటి పద్యము- తరువాత లక్కమాంబ ప్రశంస రెండు పద్యములవి కావున తరువాతి పద్యమున- ఆ మిథునమునకు- ఆ దంపతు లకు- కేసన లక్కమాంబలకు- మేము పుట్టితిమి. అని చెప్పబడినది- మిథునమునకు అనునదియే సరియగు పాఠము అచ్చు ప్రతిగాక నందు వ్రాత ప్రతులలో మిథునమునకు- అను పాఠమే యున్నది. (పుట 5)

11. 1—44— భూషణములు వాటికి— దీనికి పుట యడుగున వాటికి బదులు— "7 చెంపులకు (హ)" అని కలదు. చెంపులకు అనునది యర్థము కాలేదు. హ ప్రతి తీసి చూచి తిని. అందు స్పష్టముగా "చెవులకు"అని యున్నది. (చూ. పుట 4) ఇప్పుడు వ్రాత ప్రతుల పాఠము చూపబడలేదు— 'హ' పాత మచ్చు ప్రతిలోనిది— భూషణములు చెవులకు' అను పాఠము వ్రాత ప్రతులలోను గుజలీ ప్రతులలోను గలదు. అందఱికీ సుపరిచితమైన పాఠము చెవులకనియే— హ ప్రతిలో పాఠము, తం ప్రతిలో 'వాటికి' అని మార్పు చెంది నది. ఆ పాఠమే ఇందు నీయబడినది. కాని ఇది సరికాదు. ప్రచుర ప్రచారమున నున్న ఇట్టి పాఠములను మార్పరాదు. 'చెవులకు' అనే పాఠము భాగవతముద్రణములలో మారుటకు ఇప్పటికి రెండు వాళ్ళ క్రిందట ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజములో శ్రీ గిడుగు వారు చర్చించి ప్రాచీన గ్రంథ ముద్రణము నందలి పాఠముల యవస్థను సూచించియున్నారు. భాగవతమున నీ పాఠము 'వాటికి' అని మారుచెందుటకు కారణ మన్యకవి, "మదిరాక్ష చెవులు లొమ్మిది లెక్కలవరాదు". అని చేసినయనుశాసనమే. దీని ననుసరించియే- కాబోలు హ ప్రతిలో చెవులని యుండగా 'త' ప్రతిలో 'వాటికి' అని మార్పు చేయబడినది— ఇంత ముఖ్యమైన పాఠభే దమునకు తాళపత్ర ప్రతిలోని పాఠములు చూపలేదు.

(12) 1—62. పంపింపబడిన- పద్యమున "నానా ప్రకటావతారముల సంఖ్యాకంబని సుముద్రితము— ఇచట 'త' ప్రతిలో "నానా ఘటనావతారముల" అను వ్రాత ప్రతి పాఠము పుట యడుగున చూపబడినది. (పుట 12) కాని ప్రస్తుతముద్రణమున దీనికి పాఠభేదము చూపబడ లేదు. కాని ఇందు 3వ పేటమున గల "బ్రాహ్మణ సంయమీంద్రులు" అను దానికి "బ్రాహ్మలు" అను పాఠము చూపబడినది. బ్రాహ్మణులు అనుటకు బ్రాహ్మలు— అనుట తప్పని కాబోలు పరిష్కర్తలా పాఠము సరిగ్గా యుంచి, ప్రాత ముద్రణమున మార్పు చెందిన బ్రాహ్మణ పాఠము స్వీకరించిరి. కాని బ్రాహ్మణ సంయమీంద్రులనగా నర్థము లేదు. అర్థము ననుసరించి చూడగా ఉర్వీశుల్, మునులున్, బ్రాహ్మలు, సంయమీంద్రులు- మున్నగుల్ అని వ్యస్తముగానే యుండవలెను. ఇది యంతయు బ్రాహ్మలు అను శబ్దమును దిద్దుటచే నేర్పడినది. కవులు దీని నుపయోగించిరి. "బ్రాహ్మడ నీ వధికారివే మహిన్" అని నన్నెచోడ కవికుమార సంభవము వ్రాత ప్రతిలో నుండగా నచ్చులో "బ్రాహ్మణ" అని ముద్రితమైనది— "పరమేశ్వరుడు తొల్లి బ్రాహ్మల కర్థి" అని బసవపురాణము. శివకవులే కాక పద్మ పురాణ కర్తయైనట్టి పింగళి— "బ్రాహ్మడైన విష్ణు భక్తుండుగా జెవి" అని దీని నుపయోగించినాడు. గౌరన నవనాథ చరిత్ర లోను ద్విపద భారతము ఆదిపర్వమునను వింకను ప్రయోగ ములు గలవు. భాగవతమునే ద్వితీయ స్కంధమున 2—96లో బ్రాహ్మలు దమలో" అని యున్నది. అప్పుడు బ్రాహ్మణు లున్ అని మారినది.

(13) 1—464 ఫణి తట్టుగ పేటికి రావానికిన్ : ప్రాచీన కాలమున, "రావానికిన్"— అని రూపము కనరాదు. రావారికిన్ అనియే యుండును. చూడుడు. సాహిత్యపరిషత్తు తెలుగు నిఘంటువులు. పుట 100—104 రావాడు —ఇందు నాలుగు పుటలలో నీ శబ్ద చర్చ గలదు.

(14) 2—94. దక్షిణల్ దేవతాద్యను గత తంత్ర వ్రతో ద్దేశ ధరణీసురోత్తమాదు—

ఇచట దక్షిణల్ దేవతాద్యనుగత తంత్ర— అని వ్యస్తముగా నుండునా ?

“దక్షిణ కాళికా తంత్ర చణుడ.” అని బాలసరస్వతి ఆంధ్ర శబ్ద చింతామణి వ్యాఖ్యాతారిక.

(15) 2—95 యాజ్ఞాంగి యజ్ఞ ఫలదుండు. ఈ పాద మునకు “యజ్ఞాంగుండెజ్ఞ ఫలదుండు” అను పాఠము. తం. ప్రతి పుట 101 అధోజ్ఞాపికలో వ్రాత ప్రతుల పాఠ ముగా చూపబడినది. ఇందా పాఠమే లేదు— ఈ ద్వితీయ స్కంధముననే 178 వ పద్యమున— “నందుని గృహమ్మందు యశోద” అను పాదమునకు, 6 ప్రతులలో నందిలో గృహిణి యశోద” అను పాఠము నిచ్చిరి అప్పుడు పై పద్యమున నేల ఈయలేదో ? ఈ రెండు పట్టుల అచ్చుప్రతుల పాఠమె గ్రహింప బడినదిగాని వ్రాత ప్రతుల పాఠము గ్రహింప బడలేదు.

(16) 2—166 సీతా నిమిత్తంబున త్రిలోక కంట కుండగు దశకంఠుం దునిమి— ఇందు “త్రిలోక కంటకుండగు” అనుదానికి— ముల్లోక కంటకుండగు. అను పాఠము లాఱు ప్రతులలో నున్నట్లు తెలుపబడినది. ఆరు ప్రతులలో నున్నను నా పాఠము గ్రహింపక పోవుటకు కారణ మట్టి సమాసము నేటి వ్యాకరణముల ననుసరించి యసాధువు. కాని— ముల్లోక నాథుండు— ముల్లోక నుతుండు ముల్లోక పాలుండు ముల్లోక వంద్యుండు— మొదలగు సమాసములను పాల్కురికి సోమ నాథుడు వాడి యున్నాడు. దీని ప్రయోగములకు శ. ర. యను బంధము 55 పుట చూడనగును. ఆంధ్ర శబ్ద చింతామణి ననుసరించి, 'హ' ప్రతిలోనే ఈ పాఠము మార్పు చెందినది. తక్కిన ప్రతులు దానిననుసరించినవి. కాని తాళపత్ర పాఠము నుదాహరించియు, ప్రస్తుతముద్రణమున యచ్చు ప్రతుల పాఠము గ్రహించుట సరికాదు. దశమ. పూ. 54 లో 'ముమ్మూర్తుల విభుండయ్యు'' అని కలదు.

(17) ఇట్లే నవీన వ్యాకరణానుసారి యగు మఱియొక మార్పు. 2—180— “తన యూగోపకు లొక్క రాతిరిని...” దీనికి— “తన యూ యొక్క నిశందు గోపకులు” అని యాఱు ప్రతులలో పాఠము గలదు. కాని బాలవ్యాకరణము ననుసరించి, తత్సమాకార సంధి దుష్టమగుటచే, నిశందు—” అనునది 'రాతిరిని' మార్పు చేయబడినది.

(18) 3—414 సి. పా. పుత్తడి కొండ మూపుర మను వాలుగంట
వారకు రా రాపాడు వాక్క మాటు.

దీనికి “పుత్తడి కొండ మూపురమును వాలుయుంగ న మఱకు లాపాడు వొక్కొక్క మాటు (హ) అని పాఠాంతర మీయబడినది. దీనికి తాళ పత్ర పాఠము చూపలేదు— “బంగారు కొండమూపురమును వార గంట” అను వ్రాత ప్రతిపాఠము— 'త' ప్రతిలో పుట యడుగున గలదు ఇచట మూపుర శబ్దము, మూపురముగా యతి స్థానమున నుండుటచే— నది తప్పుకాని యుండటచే పదమును గూడ దిద్ది బంగారు కొండను— పుత్తడి కొండగా మార్చి— మూపురమును నా కాలపు సంస్కర్తలు నిలిపిరి. అదే ఇందును స్వీకృత మైనది.

(19) 4—43 భూతిలిప్తుండస్థిభూషణుడు— ముద్రితము.
భూతి త్రిపుండాస్థి భూషణుండు—పాఠాంతరము

ఇదియే సరియైనది. భస్మ త్రిపుండ్రాంక ఫాల భాగుండు— అని పాల్కురికి సోమన— పండితారాధ్య చరిత్ర దీక్షా ప్రకరణమున గలదు. భస్మ త్రిపుండ్రమనగా మూడు విభూతి రేఖలు—

(20) 4—113— సరభస వృత్తి. . . . . .దూ
సరిత కుబేర. . . . . . . . . . .భీ
కరతమ పంచనం. . . . . . .ని
చ్చలు నడి నర్కు రాత్మల వివేక విహీనత
బొంది పొందియున్.
ముద్రితము.

పుట యడుగున “సచ్చరితమును పొంది రాత్మల విచక్షణతా రహితాత్ములై కడున్” అను పాదమంతయు పూర్తిగ మారిన పాఠ మీయబడినది. ఇదియును— (హ) నచ్చు ప్రతిపాఠమే— తాళ పత్రములలో నేమున్నది తెలియదు —'హ' ప్రతిలో నచ్చటి తాళపత్ర పాఠములలో నచ్చరి యము' అను పాఠము కానబడుటచే, నా పాఠమట్లే ముద్రిత మైనది. తరువాత 'త' ప్రతిలో నీ యచ్చరియము' అను పదము తప్పను కొని యాపరిష్కర్త లది ప్రాసస్థానమున నుండుటచే, దానిని విచ్చలవిడి అని మార్చిరి. ఆ మార్పువలన పాదమంతయును మార్చవలసి వచ్చినది. ప్రాస సాంకర్య ముల గలిగినది శబ్ద స్వరూపమున కాధారమైన యతి ప్రాసలనే తాముకొన్న అపశబ్దములని వానిని దిద్దివేయుట చేతను, వానిని సరిచూడ లేమియే, తక్కిన వారననుసరించుట భాష చరిత్ర కెంతయో యనర్థము— ఇంతకు నిచ్చట— అచ్చరియము అసాధువు గాదు— ఇది ఆశ్చర్య శబ్దభవము. తెలుగులో దీనికి అచ్చెరువు— అను తద్భవ రూపమే గాక— అచ్చరువు— అను రూపము గలదు— వేశ్యచ్చరువడి పిచ్చలింప భుజశక్తియు. (10—124) లోను—అచ్చరువు పిశాచకాంతలు పిశాచము లన్—(11—204) లోను, కుమార సంభవమున నిర్ధారక ప్రయోగములు గలవు— ఆశ్చర్యము— ఆశ్చరియము, అచ్చరి యము, అచ్చరియము— అని రూపాంతరము లందినవి. అచ్చరియమునకు యతి నిర్ధారకముగా నిరూపమున్నది. దీని వలన మనకొక క్రొత్త శబ్దము తెలియుటయే గాక—

పై పద్యమున రేఫ అకార సాంకర్యము దోషము కూడ లేకుండ చేసినది.

---

(21) 4—690. శిరమున వహించి—ముద్రితము—శిరసావహించి అని నాలుగు వ్రాత ప్రతులు.

శిరసా వహించి యనుశబ్దము సరికాదని పరిష్కర్తలు 'శిరమున వహించి' అని మూల పాఠముంచిరి. కాని ఈ శబ్దమును తెలుగు కవులు ప్రయోగించిరి. ఇవిగో ప్రయోగములు.

సరస భూపాలీయము— "చేరి పాదము లిడిశిరసా వహించి నా బాధోధి దానెంత భంగ పడక"—1—113

మిత్ర విందా పరిణయము— "ఈ ఇంతి ఇంతిగా దెంతేసి బాణంబులే ప్రొద్దు శిరసావహించి వెలఁగు 3—54

చంద్రాంగద చరిత్ర— "జలజాక్షి భర్తృ గైకొని శిరసా వహించి తథుకున్ గను దమ్మలించి— 1—90

రాధాకృష్ణ సంవాదము— "నీయాజ్ఞం శిరసావహించి 1—96

(22) 10—పూ. 491—ఎండన్ బ్రాగ్గతి . . .
. . . . . . వేయుచుం

డండంబై విహరించుచుండఁగ సమంచత్ప్రీతి భక్షింతమే.
భక్షింతమే' అనుదానికి—భుజింతుమే (వ్రా. ప్ర. అన్నిట)

అని పాఠాంతరము గలదు. (పుట. 59). దీనినిబట్టి వ్రాత ప్రతు లన్నింటను "భుజింతమే" అను పాఠ మున్నదని విశ్రుతము— కాని పరిష్కర్తలీ పాఠమును మూలముగా గ్రహింపక, పూర్వ ముద్రణ పాఠమునే గ్రహించిరి. ఇది సరికాదు. భుజించు—అను క్రియ నిఘంటువుల కెక్కకపోయినను సమీర కుమార విజయమున నిర్ధారకముగా ఈ క్రింది ప్రయోగ మున్నది.

> క. ప్రాంజలియై నృప ! మీరలు
> భుజింపక మున్నుగాఁగ భుజియింపగనా
> కుంజర దనపుడు రఘువరు
> డంజనసుతు నాదరించి యోగ్యం బనుచున్.
>
> 5—117.

ఇచట—భుజియించు—భుజించు—రెండు రూపములు మున్నవి. కావున—భుజింతమే—అనునది సరియగు పాఠము.

(23) 10. ఉ. 987.

తన మృదుతల్పమందు—వనితామణియైన రమా లామము పొందును. . . . . . . . ముద్రిత పాఠము.

దీనికి పుట యనుగుణ పాఠాంతరమే లేదు. కాని దీనికి—

'తన "పరియంకమందు" వనితామణి' అని పాఠము గలదు. ఇది చిన్నయసూరి పాఠము. ఈ పాఠమునే గ్రహించి మా. వి. కర్తలు—నిఘంటువు 5 వ సంపుటమున 230 పుటలో నిచ్చియున్నారు— చిన్నయసూరి వ్రాతప్రతుల నుండియే యీ పాఠము గ్రహించియున్నాడు. పిదపగా వాతని కాలమున వచ్చినదిన భాగవతమున (హా.ప్రతి) నీ పట్టున— "తన మృదుతల్పమందు" అను పాఠమే కలదు—'పరియంకము.' అను పదము వ్రాతప్రతులందున్నను, పిదప కాలపు— హా. ప్రతిలోనే తొలుత నీ మార్పు కావింపబడి యుండును. తరువాతి ప్రతులలో నట్లే ముద్రితమై యుండును.

(24) తెలుగున నిట్టి ప్రాచీన గ్రంథ పాఠ పరిష్కరణమునందు, శబ్దరత్నాకర నిఘంటు పాఠములలో కూడ పరిశీలించుట యావశ్యకము—శబ్దరత్నాకర కర్తలే కాక చిన్నయసూరియు భాగవతము నుండి పదములను గ్రహించియున్నాడు. అందొక దానిని యిదివరకు చూపియే యున్నాను. పర్యంకము నకు పరియంకము అన్న పాఠము గ్రహించినట్లే 1—42 లో —అలసులు, మందబుద్ధులను చోట—"అలపులు" అను పాఠము చిన్నయసూరి గ్రహించియున్నాడు.[7]

ఇక శబ్దరత్నాకరమున పాఠము లెట్లు మారినవో చూపుచున్నాను.

1. మురలు—మరల—

8—294—అలని చేతినున్న యమృతకుంభము చూచి
కెరలు వొడిచి మురలు కికురు వెట్టి
పుచ్చుకొనిరి యసురపుంగవు లెల్లను
మాటులేని బలిమి మానవేంద్ర. ము. పా.

కెరలు వొడిచి మరల కికురువెట్టి
మాటులేక . . . . . . . . అని శ. ర. పా.

చూ. కెరలు వోడుచు శబ్దము పుట. 192.

2. 9—102. చ.... పెటపెట . . . వాయుధో
త్కట వరమాన హస్తయుతుఁడై వెవరించె కవించె
రాజసైన్. ము. పా.

ఆయుధోత్కట వలమాన హస్తయుతుడై వెవరించి కవించె
రాజసైన్. శ. ర. పా.

ఇది కవించు. శబ్దమునొద్ద గలదు. శర. పుట. 161.

కవించు. దే. క్రి. కవియించు యొక్క రూపాంతరము. అని పై యుదాహరణ మీయబడినది. కవించు '(వా) లో మున్నను గ్రహింపలేదు. మొదటి దానికి పాఠాంతరములేదు. రెండింటికి వ్రాతప్రతి పాఠములు లేవు—

3. శామంతిక—సేమంతిక—శామంతికా ప్రసంచిత—
10.796 ముద్రి. పా.

---

7. నేనిదే నిప్పటి కిరువది యేండ్ల క్రిందట సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానమున పండితుడనుగా నున్నప్పుడు వ్రాసికొన్నాను. హల్లోహలము మొదలైన శబ్దములు నేను చిన్నయసూరి నిఘంటువునుండి గ్రహించినవే—ఆ వ్రాత నిఘంటు విప్పుడు లభ్యముకాదు.

హేమంతికా ప్రసంగిత—శర. పుట. 798. షష్ఠ పద్య ముదాహృతము.

ప్రస్తుత ముద్రణ పాఠముల నిర్ణయమునకు శర పాఠము లెట్లు తోడ్పడునో చూపియున్నాను.

## అఱసున్నలు - శకట రేఫలు

సంపాదక వర్గమువారు పీఠికలో పై రెండింటిని గూర్చి యిట్లు వ్రాసియున్నారు— .... వర్ణక్రమములోని ప్రాతిక్య ములను మాత్రము సవరించితిమి. అయితే ఒక్క విషయ మిక్కడ చెప్పక తప్పదు. వ్రాతప్రతులలో అరసున్నలు లేవు. పదనాదులలో కొన్నిచోట్ల నిండుసున్న కానబడును ..... రేఫ భేద విషయము బహుళ గ్రాహ్యముగా ఉన్నది.

హయగ్రీవశాస్త్రిగారు తమ ముద్రణములో తొలి సారిగా అరసున్నలు కలిపిరి. కాని యథావిధిగా సర్వత్ర ఈ నియమమును పాటించినట్లు లేదు. శకటరేఫములు కూడా అలాగే చూపట్టినవి. కాగా వ్రాతప్రతులలో ఉన్నట్లు అఱ సున్నలు తొలగించుటా, హయగ్రీవశాస్త్రిగారి ముద్రణము ననుసరించుటా లేక యథావిధిగా అంతటను పాటించుటా? ఈ విషయమై సంపాదకులకు ఏకాభిప్రాయము కుదురలేదు. తరువాత విద్వాంసులతో కూడ ఈ విషయమై సమగ్ర మీమాంస జరిగినది. అధికాభిప్రాయము స్వీకృతమైనది.

(పుట 184)

ప్రాచీన సంప్రదాయము ననుసరించి నన్నయనుండి చిన్నయసూరికి రచితములైన యే శబ్ద వ్యాకరణ లక్షణ గ్రంథము లన్నియు, ఈ రెండింటి విశిష్టతను గూర్చి ఘోషించు చుండగా, నవీన సంప్రదాయము ననుసరించి, భాషా చరిత్ర, భాషా వికాస, వైయాకరణ పారిభాషిక వ్యాకరణ సంహితా పద్య ప్రాదులు, ఈ తత్త్వమును లక్ష్య లక్షణ పూర్వకముగా చారిత్రక పరిణామ దృష్టితో నిరూపముగ వివేచన చేయుగా, ప్రాచీన గ్రంథములు సుసంస్కృతములై ముద్రణము నొందిన నాటినుండి, భారతాది సమస్త గ్రంథములందును నిరుతముగా పాటింపబడగ ముఖ్యముగా భాగవతమునందే నిటః పూర్వముద్రణ పరిష్కర్తలు వీనిని పాటించుట ప్రత్యక్షముగా జూచియు, పరిశీలించియును కూడ సంపాదకులు పై రీతిని వ్రాయుటచేత నీ గ్రంథ పరిష్కరణ విధానమునకు ప్రమాణ్యతయు, గ్రంథ ముద్రణ గౌరవమునకు గలుగదేమోయని యనుమానింపవలసి వచ్చుచున్నది.

భాషా ప్రపంచమున వందల కొలది యేండ్లుగా ప్రసిద్ధమై నేటి తెలుగునిఘంటువులయందు ప్రత్యేకముగ నిర్దిష్టములై, తెలుగు భాషకు స్వతంత్ర లక్షణములని నిరాఘాటముగా, నిర్ణీతములై యావదాంధ్ర పండిత లోకమునకు నత్యంత పరిచితములైన యర్ధానుస్వార శకట రేఫముల గూర్చి సంపాదకులు—సమగ్ర మీమాంస జరుపుట వింతలలో వింత! పైగా యిక్కడి ఈ మీమాంసకు విద్వాంసులు గూడ గలరు! వారెవ్వరో పీఠికలో తెలుపబడలేదు. వారు సంపాదకులకంటె భిన్నులని పై వ్రాతవలన తెలియ వచ్చు. అర్ధానుస్వార, శకట రేఫ విషయమై—చిత్రము— సంపాదకులతో— విద్వాంసులు గూడ పూర్ణముగ పరిభవించినారు! దీనివలన తేలినదేమి? ప్రాచీన గ్రంథ పరిష్కరణమున ముఖ్యాతి ముఖ్యము లగు పై రెండు విషయములు నిండు విస్మృతములైనవి.

సంపాదకు లీ అర్ధానుస్వార రేఫ భేదములను గూర్చి వ్రాయునప్పు డింకొక విషయమును పూర్తిగ మఱచిపోయి నారు. తక్కిన ప్రాచీన కావ్యములకంటె, భాగవతమున పై రెండును లాక్షణికుల దృష్టిని, మూడు శతాబ్దులనుండియు నాకర్షించినవి—లక్షణ గ్రంథకర్తలేగాక భాగవత పరిష్కర్తలును వీనిగూర్చి చర్చించిరి. పరిష్కరణ విధానమున, వీని ప్రాముఖ్య మెంతటిదో ఈ క్రింది వివరణమువలన తెలియ గలదు.

## అర్ధానుస్వారము లేక అరసున్న

అప్పకవీయమున తృతీయాశ్వాసమున ప్రాసల వివరణమున ఖండాఖండ ప్రాస యను నొక భేదము గలదు. ఖండాఖండ ప్రాస యనగా, అరసున్నగల శబ్దములతో నరసున్నలేని శబ్దములు ప్రాస వేయుట—దీని కుదాహరణముగా అప్పకవి భారతాది గ్రంథములనుండి పది లక్ష్యముల నొసగియున్నాడు. అప్పకవి కంటె రెండు శతాబ్దులకు ముందు అనంతుడు దీని నిచ్చియున్నాడు. ఇతడు దానికి సబిందుక నిర్బిందుక ప్రాస మన్నాడు—ఇర్వురు లాక్షణికులీ ప్రాస విషయమును తెలిపిరి. దీనినిబట్టి ప్రాసయందు 'అఱసున్న' తప్పక యుండవలెనని స్పష్టముగదా.

ప్రస్తుత సంపాదకుల కఱసున్నల నుంచుటయా మానుటయా యను మీమాంసలో, పద్యములలో, ప్రాసలలో అఱసున్నలు తప్పక ప్రసక్తము కావలెనన్న విషయమే జ్ఞప్తికి రాలేదు. దీనివలన ప్రస్తుత ముద్రణమున నేర్పడిన యవ్యవస్థను గమనింపుడు.

నవమస్కంధము—పుట. 251.

క. ఏటికి నీ రాచరికం
బాటది నెఱపెట్టి బతుకు బాతువడవో
యాటది లేని దొంగల
గోటుపు వెడలంగ శవము క్రియ నుండెదవే.

(9—407)

పై పద్యమే శబ్దరత్నాకరమున 738 లో 'బోటు' శబ్దమును క్రింద నిట్లుదాహరింపబడి యున్నది.

క. ఏటికి నీ రాచఱికము
బోటులు నెఱబెట్టి బతుకు బోరవి ఱుఱవ

## శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

సాంబ సదాశివ, సాంబ సదాశివ
సాంబ సదాశివ, సాంబ శివా—
పాపహరా భవ శాపహరా, సం
తాప హరా, హర కృపాకరా!

సర్పమాని నేత్రాంగణవర్తీ
బిల్వపత్ర సంశోభితమూర్తీ
చంద్రఖండ ధర, ఫాల నయన వర
సుందర శివ, శివ శివా శివా—

లోకదానవత దూసే అలుగా
చీకటి కావల మొలిచే వెలుగా
మనస్సుకా! సుమనస్సులకే
మరుగై అందని పరిమళమా—

నిండుగ నవ్వే పువ్వు వంటి ప్రతి
గుండె కూడ కైలాసమ్మే—
మరుల దారి బడు చీకటి కళ్లకు
'వెలుగు చూపు' విప్పుము దేవా!



# ఆంధ్ర ప్రదేశ్

## సచిత్ర మాసపత్రిక

చదవండి, ప్రకటనలు ఇవ్వండి!

అనేక క్రొత్త శీర్షికలతో ఆకర్షణీయంగా వెలువడుతున్న
యీ పత్రిక ప్రతి కుటుంబం చదవదగింది.

ప్రతి నెలా **35,000** ప్రతులకు పైగా అమ్ముడవుతున్నాయి.

తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ, హిందీ భాషలలో ప్రచురించబడుతున్నది.

**విడి ప్రతి వెల: 25 పైసలు మాత్రమే**

ఇతర వివరాలకు:

డైరెక్టర్, సమాచార పౌర సంబంధాల శాఖ,
హైదరాబాదు కు వ్రాయండి.

# చలం

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

"మీ కథల్లో ముఖ్యమైన ఆకర్షణ శైలి.కాదే'....
నా కథలూ, నా శైలి తగలబడనూ ...నా అమీనా!
నా అమీనా !" (అమీనా—3 వ భాగం)

'అమీనా' చలం వ్రాసిన నవల పేరే కాదు, ఆ నవలలో అమీనా పాత్ర చలం అంతఃకరణకు ప్రతీక కూడా ....

ఇవాళ సాహిత్యపరంగా 1 చూస్తే చలం రచనల్లో వైశిష్ట్యం శైలి, ఆయన వెలిబుచ్చిన భావాలు వాటికి వేటికి తర్కాన్ని నిర్లక్ష్యం చేసే ఇష్టానిష్టాలతో (predilections and prejudices) వైరుధ్యాలతో (Contradictions) అన్నింటినీ ఒక 'దృక్పథం' గా సూత్రీకరించటానికి అసాధ్యంగా కనిపిస్తాయి. అది దృక్పథం కానేకాదు, ఒక చిత్తవృత్తి .... ఇలా విమర్శిస్తే చలం ...... "నా కథలూ, నా శైలి తగలబడనూ!... నా అమీనా? నా అమీనా సంగతేమిటి ?" అని ప్రశ్నిస్తాడు. అయితే లోతుగా చూస్తే తరంగితమైన ఆ చిత్తవృత్తికి ఆలంబమైన అంతఃకరణ ఒకటి ఉన్నది. చిత్తవృత్తికి సంబంధించిన ఇష్టానిష్టాలనూ, విరుద్ధభావాలనూ దాటిన నిశ్చలత్వం దానికి ఉన్నది. దాన్ని గూర్చి చలంలో జరిగిన అన్వేషణను ప్రతిఫలిస్తున్న రచనలే చలం రచనల్లో సాహిత్యపరంగా కూడా ఎన్నదగినవి కావటం ఒక విశేషం. అదే మనం గుర్తించ దగిన దృక్పథ పరిణామం కూడా.

జీవితం ఎందుకు? అనే ప్రశ్నకు చలం యిచ్చే సమాధానం : 'ఆనందానికి—సెక్స్ ద్వారా కలిగే ఆనందానికి—స్వేచ్ఛతో సెక్స్ ద్వారా కలిగే ఆనందానికి' అని మనకు స్పష్టంగా ఉంటోంది. ఈ దృష్టితో సమాజంలో స్త్రీల పరిస్థితుల్ని చలం విమర్శించాడు. భావ విప్లవానికి కారకుడయ్యాడు. స్వేచ్ఛాప్రియత్వాన్ని పెంపొందించాడు. చలం చేసిన ప్రతి రచనా ప్రధానంగా పై వివాదాన్ని సమర్థించేదే!

చలం చేస్తున్న విమర్శ, కలిగిస్తున్న ఉద్వేగమూ నిర్మాణాత్మకంగా లేవనీ, కేవలం విధ్వంసక చర్యగా ఉన్నాయనీ ఆక్షేపణలు వచ్చాయి. ఆ రకం ఆక్షేపణల్లో కొంత అర్థం లేకపోలేదు. ఏమంటే 'స్వేచ్ఛ' కు చలం వాస్తవికత దృష్ట్యా (వ్యక్తుల్లో ఉండే వైవిధ్యం, పరిస్థితుల్లో ఉండే భిన్నత్వం ఆలోచించి) సమగ్రమైన, తాత్త్వికమైన వ్యాఖ్యానం చెయ్యటానికి ప్రయత్నించలేదు.

'స్వేచ్ఛ' అంటే ముఖ్యంగా (1) విశృంఖలత్వము (ఉన్న శృంఖలాల్ని వదిలించుకోవటం) అనీ, (2) నైసర్గిక జీవనం

---

1 చలం దృష్టిలో, వీరేశలింగంగారికి వలెనే, ఉద్యమం ప్రధానం, సాహిత్యదృష్టి అందుకు ఉపకరణము మాత్రమే. వీరేశలింగంగారు స్త్రీ ఉద్ధరణ అనే ధ్యేయాన్ని అతివాదిగా స్త్రీకి స్వేచ్ఛ, 'సెక్స్' లో స్వేచ్ఛ, కేవలం స్వేచ్ఛ (absolute freedom) అనే నినాదాలుగా రూపొందించాడు చలం. "వితంతు వివాహాలు సాధించిన వీరేశలింగంగారు, (19) వీరి పట్టాన్ని స్వీకరించిన చలానికి spiritual father
"..... వీరేశలింగంగారు పాతివ్రత్యమూ అని అంటే లాభంలేదు.... ఈనాడు ఆ పాత వేదాంతాన్ని అంగీకరించి మాది కాదని తోసేసి, ఈశ్వరుడు కర్మ, నీతి, మోక్షం, పునర్జన్మల ఈ అభిప్రాయాల్ని మరిపిస్తేగాని ఇండియా ముందుకు పోదు" (మ్యూజింగ్స్—4 భా) ఇలా ప్రచారకుడుగా, సంఘ సంస్కర్తగా చలం చేసిన రచనలే ('స్త్రీ', 'బిడ్డల శిక్షణ' వంటి వ్యాసాలూ, 'మైదానం', 'బ్రాహ్మణీకం' వంటి నవలలూ, కథలూ) ఎక్కువగా ఉన్నాయి. వాటిలో సాహిత్యాంశం తక్కువ, సంస్కరణోద్దేశం ఎక్కువ. ఇక్కడ పరిశీలనము సాహిత్యపరంగా ఎన్నదగిన రచనలకే పరిమితం చెయ్యబడింది.

(సమాజానికి, నీతి, ధనమూ, మర్యాదా వగైరా ప్రధానమైన నాగరకతకు దూరంగా జీవనం) అని రెండు అర్థాలు మాత్రమే ఉన్నాయి. మైదానం, కళ్యాణి, [illegible] వంటి కథలు అందుకు మంచి ఉదాహరణ. సంఘ సంస్కర్త పై రెండు అర్థాలు మాత్రమే చెప్పి వూరుకోవడం బాధ్యతారాహిత్యమే! కాని, పై రెండు అర్థాలూ కాల్పనిక వాదానికి చెందిన కవులు (Romantic Poets), తాత్త్వికమైన పుష్టిలేని కవులు, తమ రచనల్లో 'స్వేచ్ఛ' కు ఆపాదించినవే! చలం కాల్పనిక వాది అనటానికి సందేహంలేదు. అయితే ఏ కాల్పనికవాదీ ఇవ్వనంత ప్రాముఖ్యత స్త్రీ పురుష సంయోగానికి (Sexual act) చలం ఇచ్చాడు—సంయోగంలేని కథ చలం వ్రాయలేదంటే అతిశయోక్తి కాదు! ఏ కాల్పనికవాది లోనూ కనిపించని సంఘ సంస్కరణాభిలాష, తీవ్రత, ఆచరణగా చలంలో రూపొందింది. ఈ భేదం ఉండటంవల్లే చలం కాల్పనికవాదీ, కవీ, అన్న విషయం మొన్న మొన్నటి దాకా గుర్తింపబడలేదు. 2 చలం యొక్క సంస్కర్త రూపం క్రమంగా కనుమరుగైతే తప్ప కవిగా ఆయన స్వరూపం ప్రస్ఫుటంకాదు!

విశ్వాసానికి విచికిత్సకూ ఘర్షణ చలంలో కనిపించదు. 'స్వేచ్ఛతో సెక్స్ ద్వారా కలిగే ఆనందం' మీదే ఆయన విశ్వాసం. ఆ ధ్యేయానికి విప్రతిపత్తి కలిగించే ప్రతి విషయమూ అది ఆధ్యాత్మికమైనా, అది భౌతికమైనా, హేతుబద్ధమైనా కాకపోయినా, విచికిత్సకు పాత్రమే! అందువల్ల చలంలో చివరకుగాని తాత్త్వికమైన అన్వేషణ దర్శనంగా తన విశ్వాసాన్ని తను అర్థంచేసుకోవటంగా, తన అంతఃకరణ స్వరూపాన్ని తను దర్శించటంగా రూపొందలేదు.

'అమీనా' నవల నాలుగు భాగాలు. మొదటి రెండు భాగాలూ 1926 లోనూ తర్వాతి రెండు భాగాలూ 1942 లోనూ వ్రాయబడినవి. నవల పూర్వార్థానికి 16 ఏళ్ల వ్యవధి తర్వాత ఉత్తరార్థమును వ్రాయటంలోనే రచయిత ఆ నవల కిచ్చిన ప్రాముఖ్యత వ్యక్తమౌతోంది. అది రచయిత ఆత్మకథ.

"అమీనాని తలుచుకున్నప్పుడల్లా, ఆహ్లాదకరమైన ఉద్యోగోత్సాహానికి తోడ్పడే పన్నీరు పువ్వు మార్దవమైన పరిమళం జ్ఞప్తికి వస్తుంది. అదే నాజూకు, అదే మొండితనం, అదే స్నేహం" అంటూ ప్రారంభమౌతుంది నవల. నాజూకు, మొండితనం, స్నేహం—ఇవి కథానాయకుడైన రచయిత వ్యక్తిత్వం తాలూకు లక్షణాలు. ఇవే అమీనాతో అతనికి గల సంబంధం లోనూ ప్రతిఫలిస్తాయి, పరిణామం చెందుతాయి.... మొదటి సారి అమీనాను ఏటిఒడ్డున చూసి 'చిరునవ్వుతో స్నేహాన్ని' కోరుతాడు. ఆ అమ్మాయి 'మీ యిల్లెక్కడ ?' అని ప్రశ్నిస్తే "మొండిగోడల సందు" అని సమాధానం. ఇది ఒక చమత్కారం, సంఘాన్ని ఎదిరించిన మొండితనాన్ని సూచించటం. "ఎందుకు?" అని అడిగిన అమీనాతో "నీ కెందుకు ?" అంటాడు. అమీనా తను వచ్చి అతనితో ఉంటానంటుంది. "అమీనా కళ్ళు నవ్వించాయి. ఆ 'మీతోనే ఉంటా' నన్నమాటని మీరలేదు అమీనా, నువ్వు! నిర్భాగ్యవు నా అదృష్టమే నిన్ను దూర విడిచింది. నా ఔద్ధత్యమే, నా సందేహమే, నా లోక పరత్వమే, నా లాభనష్టాల గణితమే నిన్ను తరిమి మాయం చేశాయి" ఇది రచయిత ఆవేదన. జీవితపు ఆకర్షణల్లో ఒడిదుడుకుల్లో తను ఎన్నిసార్లు 'అమీనా'ని (అంతః కరణని) విస్మరించాడో, అమీనాకూ తనకూ గల సంబంధమేమిటో ధ్వనిపూర్వకంగా చిత్రించేకావ్యం 'అమీనా'.

'నేనే వొచ్చి తీసుకువెడతాలే' అంటాడు అమీనాతో కాని సుబ్బారావు ఎంత పిలుస్తున్నట్టూ, అమీనా జ్ఞాపకం వచ్చినా, స్నేహితుల బలవంతం వల్ల సమయానికివెళ్ళడు. చీకట్లోవెళ్ళితే అమీనా యింటిలో వుండదు! మరునాటిరాత్రి శ్రీమన్నారాయణ అనే అతను మిత్రుల (రచయితస్నేహితురాలు) కోసం వస్తాడు. కాని ఆసంగతి చెప్పటానికి సిగ్గుపడి ఏదో చెబుతాడు "ప్రేమ,కామం, అన్నీ తప్పుమూ,సిగ్గూ,భయమూ పడవలసిన విషయాలనిబాగా అంతరాత్మలో నాటుకుని పోయినాయి, ఈ తరమువారికి. ఎప్పటికోవిముక్తి?" అనుకుంటాడు. ఈ విషయమై లోకంతో తను పడుతున్న ఘర్షణ గుర్తుకు రావటం, అమీనాయింటివైపు వెళ్లటం, అక్కడకేకలూ, తగాదా, అప్పుడు అమీనా 'చిరిగినపరికిణీ, మురికి వోణీ'తో దర్శనమివ్వటం—దీని వైచిత్ర్యం,స్ఫూర్తి గ్రాహ్యము. ఇంచుమించు నవల మొత్తంలో అడుగడుగునా యిలాంటి ధ్వని ప్రధానమైన కవిత్వస్ఫూర్తి వుంది. 'రావెడదాం' అనిపిలుస్తాడు అమీనాని....... " 'ఎక్కడికి?'—'ఇంటికి'—'ఎందుకు?' ఆశ్చర్యంతోచూశాను. నిజం. ముళ్లకంపే. అమీనాకూడా అందులోదే. ఒళ్ళుమండింది....చప్పున వెనక్కి తిరిగి రోడ్డెక్కాను .."...శ్రీమన్నారాయణ మాటలతో ప్రవర్తనతో విసిగి కోపగించుకున్న చలంలోని అంతఃకరణ నిలదీస్తూ వేసిన ప్రశ్న'ఎందుకు'అని. కాని అతడులొంగడు. అమీనాతనే

---

2 అజీర్ రహమాన్ చలం వచన కవిత్వాన్ని, కాటూరి వెంకటేశ్వరరావుగారు అకాడెమీ పద్య సంకలనములో చలం రచననూ ప్రచురించేదాకా.

వస్తాడది ..."మెంటిక పోలాని అకస్మాత్తుగా దానికి మార్చింది, అట్లు కొంత నర్పింది. 'ఏం?'—'వస్తున్నాను.'—ఏమానను? ఇంతక ఎందుకు అవిధంగా ప్రశ్నించావని అడగాలనివుంది..తిక్కగల్ కొన్ని పవిత్రంచేస్తున్న అభోదయాతీజన్ను ఎందుకు క్షణంలో రక్తారుణమునుదాలున్నది? తీవ్ర ప్రశయంగా సంబంధాసేసి, భూమి నమస్తమూ జలమయమైతేనేగాని వదలదేమోనన్నంత వర్షం మూడు నిమిషాల్లో వెలిసి ఏమెరగనట్లు ఎండకాయడ మెందుకు? ఒకవేళ స్త్రీ కారణం చెప్పినా అది అబద్ధం. అమెకే తెలీదు ..." అన అంతఃకరణ స్త్రీ, పే తుపిదారణకు అందనిది.

నవల రెండో భాగం అమీనా పాటతో ప్రారంభమవు తుంది. అమీనా పాట ఎక్కడ నేర్చింది? "అడవుల్లో మెళ్ళ చేసుకుని కూచుని, రాత్రంతా పాడతారు. నేను వింటాను. నాకు వచ్చింది" అంటుంది అమీనా. అడవుల్లోకి వెళ్లట మెందుకంటే "మావాళ్లమీద కోపం వస్తే పారిపోతాను" అని సమాధానం. చలం తన నాయికా నాయకుల్ని మైదానా లకో, దీవులకో, అడవులకో ఏకాంతవాసానికి పంపించే కారణం ఇక్కడ తెలుస్తుంది. తర్వాత 'మొండి గోడల' సంధ్య శ్రీమన్నా రాయణా విమలా దాంపత్య ప్రవర్తన, శ్రీమన్నారాయణ విమలని చేసిన దగా, విమల ఆత్మహత్య, విమల తనని సహాయం కోర లేదే అని చలం ఆవేదనా—ఈ వ్యవహారం చలం అదర్శానికి ఒక ఎదురు దెబ్బ. అమీనా కనిపించదు. రచయిత అమెకోసం వెదుకుతాడు. చివరకు అమె కనిపిస్తుంది: "తోటకంచె పక్కన వగ మొండిన కాలవలో మోకాలు లోతువరకు దిగి బురదనంతా వెతికి చేపల్ని పడుతూంది అమీనా!" ఆ పట్టున అమీనా బురదలో దిగి ఉండటంలోని అర్థమూర్తి గ్రాహ్యం. 'అమీనా ఇదేమిటి?' అంటాడు: 'అమీనా వచ్చింది' అని సమాధానం. రచయిత విమలని రక్షించాలని ప్రయత్నిస్తాడు అమె మనసు విప్పి మాట్లాడదు. 'నేనేమైపోతాను' అని భయపడుతుంది. రచయిత సహాయ్యంతో అమెకు తృప్తి లేదు. అమెకు కావలసింది శ్రీమన్నారాయణ ఆదరణ ఒక్కటే! రచయిత చేసేదిలేక 'అదీ జీవితం' అనుకుని పూరుకుం టాడు. ఇక్కడ చలం ఆదర్శం స్త్రీ స్వేచ్ఛ. విమల తనని మోసగించిన శ్రీమన్నారాయణ మాట వదలిపెట్టి తన కాళ్ల మీద తను నిలబడలేకపోవటం చలానికి తన ఆదర్శం దృష్ట్యా అసంతృప్తి కలిగించే విషయం. ఈ పట్టున 'విమలను పంపి అమీనాకోసం వెతికించటమూ' అమీనా తల్లి అమీనాకూ 'జీతం ఎంతిస్తారేమిటి?' అని ప్రశ్నించటమూ, విమల ఉదంతానికి వ్యాఖ్యానప్రాయంగా ఉన్నాయి. 'జీతమూ ఇవ్వను ఏమీ ఇవ్వను' అంటాడు చలం. తర్వాత చలం స్నేహితురాలు డాక్టరుగారి రాక "డాక్టరుగారు జ్ఞాపకం రాగానే సంతోష తరంగాలమీద తుళ్లుకుంటూ పైపు తేలిపోతుంది నా మనసు" అంటాడు. ఈ రచయిత. డాక్టరుగారిని గూర్చి కలల్లో తేలిపోగానే అమీనా అదృశ్యమౌతుంది! అతను అమీనాకోసం వెళ్ళడు, వెతకడు డాక్టరువచ్చి వెళ్ళిందా! ఇది విషయాలవత్వంలో అంతః కరణను గూర్చి మలుపు. డాక్టరు వచ్చి వెళ్ళిన తర్వాత "ఎక్కడి వాళ్లక్కడ ప్రయాణం—అమీనా తప్ప" అదీ నవల పూర్వా ర్ధం ముగింపు. చిత్తవృత్తి ఏ పోకడలు పోయినా అమీనా అంతఃకరణ ఉంటుంది అన్న విశ్వాసం.

పూర్వార్ధానికంటె ఉత్తరార్ధంలో రచన పరిణతికి వచ్చింది. మూడో భాగం స్త్రీ ఆకర్షణను గూర్చిన చక్కని మనస్తత్వ వివరణతో ప్రారంభం అవుతుంది. రచయిత శ్యామం అనే వ్యక్తి ఆకర్షణలోపడి అమెకోసం ఆ పూరు వెడతాడు. శైలి ఈ భాగంలో శక్తివంతంగా రూపొందింది. ఇది చలం వచన రచనలో అందుకున్న ఉత్తమస్థాయి. రచయిత శ్యామం వల్ల భంగపడుతాడనే సూచనగా— దగా పడిన సత్య కన్నీళ్లు, 'మళ్లీ తిరిగి వస్తార' అని సందేహించే అమీనా—మాటి మాటికి ఎదురౌతున్నా ఆకర్షణకు లొంగి ఆశతో వెడతాడు. తీరని కోరికతో, ప్రబలమైన ఆకర్షణతో బాధ పడే రచ యిత రాత్రి నిద్రలేని నిరీక్షణా, ఆత్మ పరీక్షా :—

"నేనూ మోసపోయివాను. లేత మనసు హృదయం' విశ్వాసం, ఉన్నాయని, ప్రేమ చంచలత్వాన్ని సమర్థించే నేను.

ఏది బంధనాలు తెంచుకుని పావురం వామీద వాలితే స్వేచ్ఛకి జయ్. వాగ్దానబంధం తెంచుకుని వాలించి గంటలో ఎగిరిపోతానంటే పావురానికి రెక్కలు పెట్టిన వాడికి బుద్ధి లేదని పద్యాలు.

అర్ధరాత్రి.

నక్షత్రాలు. మెట్లమీద అలిసిన పాదాలు. చీకట్లో కన్నీళ్లతో తడిసిన మాటలు. నా భుజాలమీద చిన్న చేతులు— సత్యవి.

"నేను వెళ్ళిపోతున్నాను"

ఏమనను?

బాపురుమని ఏడువు.

ఎంత అదృష్టం! వెళ్లిపోగలగడం!

అట్లా సుఖంగా ఏడవడం నా చేతకాదు. నీకోసం, నా కోసం, సత్యా!

... ... ... ... ... ... ... ...

వెళ్లిపోయే రైలు, చీకట్లో ఎగిరే రవ్వల్ని ఎర్రదీపంతో కలుపుకుంటో....ఆ చీకట్లోకి సత్య—ఎప్పటికి యింక మాట్లాడకుండా.

... ... ... ... ... ... ... ...

అమీనా! సిగ్గు ఎందుకు అమీనా నాకు? గాయాలకు పట్టీలు తగిలించడానికా! ఎట్లా చూపను నలిగిపోయిన నా మొహాన్ని!

సంఘంలో ఓడిన అమీనాని మాత్రం నాకు నిలుపుతాయా గ్రహాలు!' అనుకుంటూ 'టికట్లో' ఇంటికి బయలుదేరుతాడు. దారిలో "దగ్గు—ఆడ దగ్గు—రహస్యపు దగ్గు—డబ్బు కావాలని అడిగే దగ్గు"......"స్త్రీ జాతిమీద క్రౌర్యం శివమే మీద చూపితే......" అనిపిస్తుంది. కాని "చలం చెప్పు వేదాంతమో—అభ్యంతరాలు—అనుభవాలు—అతిశయాలు"— ఆ బజారు స్త్రీని కాదని ఇంటికి నడుపుతాడు. "స్వేచ్ఛని ప్రేమించే మనిషికి ఎన్ని బంధనాలు! గట్లు లేంది స్వేచ్ఛ లేదు. శ్రుతి లేంది సంగీతం లేదు. దేనికి స్వేచ్ఛ—దేనికి కాని స్వేచ్ఛ మహా భారం. ఇప్పటికీ, స్వేచ్ఛకి చాలా దూరం....." అని గ్రహిస్తాడు చలం. టికట్లో తాళం వేసిన గుమ్మం ముందుపడి ఉంటుంది అమీనా! "అమీనా! అమీనా! నిన్ను వదలి నేనే వెళ్ళినాను అమీనా! వెంటనే నడిచాను చీకటి నిర్మానుష్యానికి అందమైన కవితకి, గుండెలని గుబురు దగ్గరకు! అమీనా!" అని ఆక్రోశిస్తాడు.

చివరి భాగంలో సుబ్బులు, రచయిత భార్య ప్రవేశంతో అమీనా మళ్లీ అదృశ్యమౌతుంది. "నిమిషాలు, గడియలు, దినాలు—వారాలు—ఎక్కడా ఇంట్లో గుడిసెల్లో రోడ్లలో, చెట్లలో—ఎక్కడా, ఎక్కడాలేదు అమీనా...... తల్లి నన్ను అమీనా ఏదీ? అంటోంది. తల్లికాని తల్లి! చీత మిమ్మల్ని నా జ్ఞాపకాలు లేపే తల్లి! ఎంత ప్రార్థించినా ప్రత్యుత్తర మివ్వని వేల తల్లి" అమీనా తల్లి 'వేల తల్లి' అట. రచయిత అమీనాకోసం అన్వేషిస్తూ ఉంటాడు. చివరకు "పూరి వారి దేహాల మధ్యకి—నల్లని చిక్కని మధ్యకి కాలువ—తోటకి—రోడ్డుకి మధ్య—దంట్ల పిల్లలు—చేతో బొట్టులు" కనిపిస్తారు. పళ్ళ చాపల బొకెట్టుతో, శ్యామల రిబ్బనుతో. మరకలు, మసిన్ని, దుమ్ముతో బురదకేసి చూస్తున్న కళ్ళతో కనిపిస్తుంది—గతాన్ని జ్ఞాపకం చేస్తూ. "అమీనా" అని పిలిస్తే రాదు, రచయిత బురదలోకి దిగటానికి ఉద్యుక్తుడౌతాడు "వస్తానుగా. వెళ్లండి ఇంటికి" అంటుంది. వచ్చాక "అమ్మ ఉంటే నేను రాను. ఎప్పటికీ రాను, నన్ను కొట్టింది" అంటుంది. సుబ్బులు లోకానికి, సంఘానికీ ప్రతినిధి. "ఏం తప్పను? ఎన్నిసార్లు ఏం తప్పారిగాను?—నా జీవిత మార్గమంతా నేను త్యజించినవి, నమ్మకలకోసం, మంచికోసం స్వేచ్ఛకోసం, ప్రేమకోసం—త్యజించినవి, వదిలించుకొన్నవి—విశ్వాసాలు, ప్రమాణాలు, శరీర భారాలు, మనోభారాలు—ప్రతి అడుగునా త్యాగం—ఆహుతి......అమీనా, నువ్వు కూడా కోరుతున్నావు—బలిని, ఆహుతిని. ఏం చేస్తావు? నువ్వు అమీనావికావు, నువ్వు నా వాకరివికావు, చేస్తానివికావు. నువ్వు విధి వెయ్యి నాలికలలో ఒక దానివి, నువ్వుతో బలి కోరుతున్నావు. బలి కోరకపోతే, హృదయం సమీపానికి ఎట్లా వస్తావు?.....నామీద ప్రేమ కురిపించకర్లేదు, నా హృదయంలో నుంచి, ఆహార నైవేద్యాన్ని కోరుతావు. వీటిని కాక......ఉత్త చేతులతో ఇంటికి పంపావు. సుబ్బులు దగ్గరకి, ధర్మానికి, విద్యుక్తానికి, దైనిక వస్తువు, భోజనానికి, విశ్రాంతికి......నీ ప్రేమ పంకిలం కడుక్కమని, మర్యాదస్తుల మధ్య తిరగమని, ఒళ్లో వికారాలు తప్పుకోమని, నీ బురద స్వేచ్ఛ 'మార్గం' నాకు 'అగమ్యం' అని......నీ ఆశయాలలో నీ గమ్యంలో, నీ తుదక రక్తపు విన్యాసంలో నన్ను నిరాకరించి త్రోసివేశావు......" రచయిత లోకంమీద ఆసక్తిని వదలి అంతర్ముఖుడు కావాలి. అమీనా ప్రతీక (రచయిత అంతఃకరణ) మానవులపట్ల స్నేహంగా, జీవితంలో స్వేచ్ఛ ప్రియత్వగా ప్రథమ దశలో భాసించినా క్రమ పరిణామంలో రచయిత జీవితానికి గీటురాయిగా, మంచి చెడ్డల విశ్లేషణగా, భాగధేయానికి అధిదేవతగా పర్యవసించి, చివరకు లోకంతో రచయిత సంబంధాన్నే నదలించే ఏకైక 'మార్గం'గా, లక్ష్యంగా కనిపిస్తోంది! రచయిత ఏం చెయ్యాలి? కర్మ సన్యాసానికి అంగీకరించాలా? "నా ప్రేమ సంపద అమీనా, కలువ గట్టుకింద నిద్ర గన్నేరుల అమీనా అంటుపోయింది." ధ్యాన నిమగ్నుడు కావాలా? కాని స్త్రీలు, లోకం అంగీకరించటం మానలేదు రచయితను, వయస్సు పైబడినా. అమీనా ఆంక్ష పెడుతుంది. 'ముసలివాడితో అమీనాకు పెళ్ళి, ఎలా పనుస్తుంది' అంటుంది అమీనా తల్లి. ఇందులో ముసలితనానికి ప్రేమ కలాపానికీ కుదరదని కాబోలు ధ్వని! చివరకు ఒకనాటి ముందు వెండ రోజున అమీనా వచ్చి రచయితని కావలించుకొని ఏడ్చి "నాకు చీర కావాలి, కొని పెట్టండి" అంటుంది. సంఘ సంప్రదాయకు, స్త్రీ జనోద్ధరణకు, తన వివిధ భావాలు కథలైతే అల్లగలడుకానీ ఈ 'అంతఃకరణ'కు తను ఏవిధంగా రూపం ఇవ్వగలడు? ఎందుకు, ఏ ప్రయోజనం ఆశించి ఇవ్వాలి? అని కూడా ప్రశ్న. "ఎరుగని నాకరు కన్య, అమీ నాకి?"......"[illegible], [illegible], [illegible] కుంగి, వదిగి, విశ్వాసం వదలించి చాల సిగ్గుతో—'పోనీ, పోనీ...' నా జీవం....ఇవ్వండి" అంటుంది అమీనా. [illegible] రచయిత తన ఆత్మకథగా, అంతఃకరణతో తనకి గల సంబంధాన్ని గూర్చి వ్రాయవచ్చునేమో అని. రచయిత తన రచనా కౌశలాన్ని ఉపయోగించి (సొంపు మురుగు కాంపౌండ్— దొర్లుతని— మాటల్లో కోనుకుని— అటువంటి— వేస్తుకున్న విలవైన తెక్కల్ని ఉపయోగించి) అమీనా 'జీవం ఇస్తాడు'. ఇదే అమీనాను గూర్చి చలం వ్రాసిన నవల ఉత్తరార్థం అన్న మాట......మీ ఇచ్చిన డబ్బులతో......కొన్నాను. రెండు

గజాలే వచ్చింది.....మీ జ్ఞాపకానికి.....కొబ్బరు......చెట్టు... రెండు గజాలే......" అంటుంది అమీనా. అంతే రచన చాలలేదని ధ్వని. అమీనాని తల్లి వెళ్లగొట్టిందట! అంతేకాదు, "అది నా అమ్మకాదు" అనే సత్యాన్ని బయట పెడుతుంది. అమీనా!....."అమీనాకి అమ్మేలేదు, ఇల్లులేదు, ఎవరూలేరు".' అమీనా వెళ్లిపోతోంది. రచయిత ఆమెని "ఆగు" అంటాడు కాని అందుకోలేడు. "గడ్డిబండి అడ్డం—మర్యాద కట్టుకున్న నా కళ్లే అడ్డం. చదివి చదివి గుడ్డివైన నా కళ్లే అడ్డం. సబ్బుతో కడుక్కున్న నా చేతులే అడ్డం......జన్మానికి ఆఖరు నా చిన్ని అమీనా. ఎడారి పువ్వు నా అమీనా" అని ముగిస్తాడు రచయిత.

'అమీనా' నవ్యాంధ్ర సాహిత్యంలో ఒక విశిష్టమైన రచన. కావ్యమైన నవల ఈ నవలలో చలం శైలి పొందిన పోకడలు, చూపిన మెరుగులు నేటి అనిబద్ధ కవిత్వానికి వరవడిగా ఉన్నాయి. అంతకంటె చలం చూపిన శిల్ప వైదగ్ధ్యం అమీనా పాత్ర చిత్రణలో అమీనాను ప్రాదుర్భావాత్మక ప్రతీక (Emergent Symbol) గా తీర్చటంలో కనిపిస్తుంది.

చలం తాత్త్వికుడుకాడు. దార్శనికుడుగా పరిణతి చెందిన కాల్పనికవాది. (Not a philospher but a romantic maturing in to a mystic) ఆయన దర్శనము స్త్రీకి సంబంధించినది. స్త్రీ ఆయన ఆరాధ్యదేవత. అందువల్లే ఆయన అంతఃకరణకు, ఆత్మకు ప్రతీక అయిన అమీనా స్త్రీ—కాదు ముగ్ధ బాలిక! "ఎడారి పువ్వు నా అమీనా." 'అమీనా' నవలలో ప్రతిఫలిస్తున్న అన్వేషణ (తన విశ్వాసాన్ని తను గుర్తించటం, తన అంతఃకరణ స్వరూపాన్ని తను గుర్తించటం) యొక్క విస్పష్టమైన అర్థం ఏమిటి? అని పరిశీలిస్తే మనకు మెట్లుగా కనిపిస్తుంది ఆ అన్వేషణ. చలం 'స్త్రీకి స్వేచ్ఛ' అన్న ఆదర్శంతో బయలుదేరాడు. 'అమీనా' పూర్వార్థంలో వచ్చే వివాహ ఉదంతం ఒక కను విప్పు. తను కోరిన మగవాడు తనని దగా చేసినప్పుడు, ఆతనిమీద మమకారం వదలుకోలేని స్త్రీ విషయంలో 'స్వేచ్ఛ'కు అర్థమేమిటి? ఆ దగా జరగటానికి కారణం నీతి మర్యాద, వ్యవస్థ అనేవి, 'సెక్సు' విషయంలో స్త్రీ పురుషులకు కలిగిస్తున్న అవరోధమే అనిపించి, 'సెక్సులో సంపూర్ణమైన స్వేచ్ఛ'—స్త్రీ పురుషు లిద్దరికీ ఉండాలి అన్న ఆదర్శం చలంలో రూపొందింది. 'అమీనా' మూడో భాగంలో శ్యామల ఉదంతంలో సత్య ఉదంతంలో పై ఆదర్శం అగ్ని పరీక్ష నెదుర్కొన్నది. అక్కడ సమస్య—'సెక్సు'కీ 'స్వేచ్ఛ'కీ పొసగనప్పుడు దేనికి ప్రాముఖ్యత అని! చలం సెక్సుకే ప్రాముఖ్యత నివ్వటానికి ప్రయత్నించి (శ్యామలను తాదాత్మ్యంగా—శ్యామల స్వేచ్ఛతో ప్రమేయం లేకుండా— అనుభవించాలన్న మోహం రావటం, అమీనాను శ్యామలకు కావరుగా తయారు చెయ్యటం మొ॥) చివరకు తనలోని అంతఃకరణ పొందిన విజయం ద్వారా సెక్సులో తనకు కలిగిన భంగపాటు ద్వారా 'సెక్సు' కంటె 'స్వేచ్ఛ'కే ప్రాముఖ్యత ఇచ్చి పట్టం కట్టాడు. "గుబ్బలేంది స్వేచ్ఛలేదు. ఇచ్ఛకీ, స్వేచ్ఛకీ చాల దూరం. దేనికి కాని స్వేచ్ఛ మహా భారం" అన్న బరువైన నీతం నేర్చుకున్నా, సెక్సు ఆనందాన్ని కోరే చలం 'స్వేచ్ఛ' వైపే మొగ్గాడు! 'కేవలం స్వేచ్ఛ' (absolute freedom) అనే ఆదర్శానికీ, తన అంతఃకరణకూ గల తాదాత్మ్యం గుర్తించాడు. అందువల్ల 'అమీనా' నవల మూడో భాగంలో అమీనా (అంతఃకరణ) చలంనుంచి త్యాగాన్ని కోరుతుంది—సర్వ సంగ పరిత్యాగాన్ని కోరుతుంది—కవిసం తన 'జీత' మివ్వమంటుంది. అమీనా చివరి స్వరూపం 'కేవలం స్వేచ్ఛ'—అమీనాకి అమ్మేలేదు, ఇల్లులేదు, ఎవరూలేరు! ఈ అమీనా లోకాన్ని దాటి, చలంకి అందకుండా ఎక్కడికో వెళ్ళిపోతుంది 'కేవలం స్వేచ్ఛ' అనే తన ఆదర్శం ఈ లోకంలో 'ఎడారి పువ్వులో' అది ఒక్క పసి పిల్లలోనే కనిపిస్తుంది. మళ్లీ దాన్ని అందుకో వాలంటే సర్వ సంగ పరిత్యాగం చేసిన యోగులకే సాధ్యం. చలం దాన్ని అందుకునే ప్రయత్నం మానలేదు. అందుకే రమణాశ్రమం చేరాడు. ఇది చలం అన్వేషణ పరిణామం.

'అమీనా' తర్వాత చలం రచనల్లో సాహిత్యపరంగా చెప్పదగినవి 'అరుణ' అనే నవల, 'పురూరవ' అనే నాటిక.

అరుణ చలం దర్శించిన స్త్రీత్వమునకు ప్రాదుర్భావాత్మక ప్రతీక; ".....అరుణ చచ్చిపోలేదు. నాకు తెలుసు. ఇంకా మబ్బుల్లో, చిన్న బిడ్డల లేత పాదముల మీద, కందిన ప్రియురాలి పెదవిమీద, రోజా పువ్వు రేకుల్లో, పద్మాల రేకుల నడుమ, తాగిన మా కళ్ల కొలుకుల్లో, ఎఱుపు చీరలు నశించలేదు. జీవితంలో ఈ దేహానికి నా శృంగార భావాలకి ఎట్లా స్వర్గ ద్వారాలు తెరిచిందో అట్లానే నా ఆత్మకి, నా. ఆధ్యాత్మిక సందేహాలకీ ఎప్పుడో, ఏ ఆశ్రమంలోనో కైలాస ద్వారాలు తెరుస్తుందని నా నమ్మకం" ఇవి 'అరుణ' నవల ముగింపు వాక్యాలు. రచనాకాలం 1935. ఆనాటి నమ్మకం సుమారు 20 ఏళ్ళకి ఎలా నిజమైందో లోక విదితమే!

నవలలో అరుణ ఒక స్త్రీ పాత్ర. కథా నాయక యైన రచయితకు ఒకనాటి ప్రేయసి. అంతేకాదు. స్త్రీత్వంలో, స్త్రీ ఆకర్షణలో పురుషుణ్ణి కప్పివేసే 'అర్థంకాని తనం', పురుషుడు పొందే దివ్యానుభూతి అభివ్యక్తం దృష్టాంతము చేసే (Archetype) కూడా అరుణ. ఆ

అనుభూతి శారీరకమా? మానసికమా? ఆధ్యాత్మికమా? అని జిజ్ఞాస. ఆ జిజ్ఞాస, దాని తాలూకు మధుర స్వప్నం ఒక వైపూ, సంఘం స్త్రీకి ఏర్పరచిన బాధ్యతల, కట్టుబాట్ల కర్కశ వాస్తవికత మరోవైపూ—ఈ రెండింటిమధ్యా నలిగే 'స్త్రీత్వం' నిరాశ్రయమై, నిరాధారమై అదృశ్యమౌతుంది. కాదు, స్త్రీగా అదృశ్యమైనా ప్రకృతిలో సౌందర్య భావన కలిగే ప్రతి అంశంలో ఆ 'స్త్రీతత్వం'—అరుణ—ఎప్పుడు జీవించే ఉంటుంది. ఇదీ 'అరుణ' నవలలో ధ్వనించే ఇతి వృత్తం.

"ఎక్కణ్ణుంచి వచ్చిందో! ఎంతదూరంనుంచో, పాదాల, మీదనన్నా దుమ్ములేదు. పాదాలమీద తీరాడే పట్టుచీరనుంచి తలపైన, నిగనిగలాడే జుట్టు పాపిడి వరకు చూస్తే మంచు వ్నాను. అప్పుడే గదిలో అలంకరించుకుని బైటికి వచ్చిన దాని వళ్లే ఉంది. జీవితమంతా, మురికిల్లోంచి, దుమ్ములోంచి, ద్వేష లోంచి, నిందల్లోంచి, అవనిందల్లోంచి అంత నిర్మలంగా నడిచి, పవిత్రంగా ఉండకలిగేవారు అరుదు. తామరాకుమీది నీటి బొట్టు, ఆకుల్లోంచి కిందికి జారే వెన్నెల రేఖ! నడిచిన చోటల్లా హృదయాలమీద అడుగులు మెడుతో మెడుతోం దంటే ఒక వింతా!"......."పదిహేనేళ్ల కిందట నన్ను ప్రేమిం చింది, ఆ పది రోజులూ—కాదు ఆ మూడు రోజులే. కాని అప్పుడైనా ప్రేమించిందా?........ప్రేమంటే ఏమిటి?..... ఇంకొర్ని కోరడమేగా ప్రేమ ! ...ఏది ప్రేమ, ఎవరిది ప్రేమ? ఒక్క రాత్రి తృప్తిపడ్డ తర్వాత, మళ్ళీ రక్త కణాలు వీర్యాన్ని సమకూర్చిందాకా, చచ్చిపోయేది ప్రేమా!!" "కాని— మనసు— ఇదంతా మనసు కల్పిస్తున్న ఇంద్రజాలం— కారణాలు ఎవరికి తెలుసు?......ప్రేమ ఎట్లా పుడుతుంది? శరీర సౌందర్యమా? గుణాలా? ఏవి ఆకర్షిస్తాయి? ఇక్కడ సౌందర్యమూ గుణాలూ అన్నీ అట్లానే ఉన్నాయి. ఆకర్షణ మాయమైంది. నాకేనా? నావంటి దురాత్ములకేనా?...." .. "అందరేవి ఎన్ని కోపాలు, అందితేనా—అవి ఎన్ని కలలు!.. ...ఈ సఫలమైన ఆనందంకన్న ఆ తీరని వేదన ఎక్కువ వాంఛనీయమేమో!......సుఖ దుఃఖ భేదం నిజంగా ఆ భేదం ఉందా? ఆనందం దొరకగానే, ఎన్నాళ్ల నర్ధ బాధంతా పడనట్టే తోస్తుంది. కాని ఆ ఆనందం ఇట్లా వేళ్లలలోంచి జారి, ఇంకేముంది బాధ కాక, అనిపిస్తుంది." స్త్రీత్వంలో, స్త్రీ ఆకర్షణలో పురుషుడు పొందే దివ్యాను భూతి, పురుషుణ్ణి కవ్వించే అర్థంకానితనం అభివ్యక్తంచేసే దృష్టాంతము అరుణ.

తర్వాత అరుణ ప్రేమికులు 'బీస్ట్', 'నాగన్' ప్రవే శిస్తారు. వారితో రచయిత కలిసి, ముగ్గురు ప్రేమికులూ ఒక స్త్రీ—ఇది ఒక రావళి! ఈ ఘట్టానికి సంభవా సంభ వాలతో నిమిత్తంలేదు. 'బీస్ట్' శారీరికానుభవానికీ, 'నాగన్' మానసికమైన హార్దికమైన అనుభూతికీ, రచయిత ఆధ్యా త్మికమైన అనుభూతికీ ప్రతినిధులని గ్రహిస్తే ఈ 'రావళి' అర్థమవుతుంది. "నాకు ధైర్యం లేని పని, నేను ఏ పనిని చెయ్యడానికి సిగ్గుపడతానో, ఆ పనిని యీ బీస్ట్ చెయ్యరాదా అని పిస్తుంది" అంటాడు రచయిత. "రాక? ఎన్నిసార్లు చెప్పేది? నన్నే ప్రేమించిందంటి, నాలో ఏమీ గొప్ప లేదా? అయినా— మరి ఎట్లా ప్రేమించిందో నన్ను. నేను లేకుండా బతుకలేదు" అంటాడు బీస్ట్. "భావా, అరుణకి నామీద శాశ్వతమైన, అద్భుతమైన ప్రేమ ఉన్నదంటారా? లేదం టారా?" అంటాడు నాగన్. "—రెండు గంటలసేపు అన్ని వైరాలు మరిచి, నవ్వుతూ నవ్వగలవలె ఆమెచుట్టూ ఆడాను. ఆమె కన్నెత్తి చూడకపోతే విరాగం, చూస్తే రాగం! చాల వైరాగ్యాలు ఇంతే."....."మనసన్ని మనసే కల్పిస్తుంది. మనకి కావాలని కోర్కె పుట్టిందాకా ఎంత విలువైన పదార్థ మైతేనేం మనకేం గొప్ప!"......."నేను మాట్లాడలేను నా ఆలోచనలో. మీ ఇద్దరూ ఎవరు? అరుణ నాది! అనుకుంటు న్నాను పైకి అనకపోయి" అని రచయిత (ఆధ్యాత్మికాను భూతి) ధీమా ఈ జిజ్ఞాసలో. దానికి అనుగుణంగా "సూర్యో దయావసరం. నేను అరుణ కిరణాన్ని, విన్ను చుంబిత 'దళా'న్ని చేస్తాను" అని రచయిత 'ఒళ్లో' పడుకుని మోకాలిమీద చేతులేసి తలనివంచి ముద్దు పెట్టుకుంటుంది అరుణ. కనీ ఆ రాత్రే అరుణ బీస్ట్‌తో గదిలో పడుకుంటుంది. "నిజమా?.. అంత కళ్ళు కనపడని కామమా? పువ్వుకన్న మృదువైన అరుణకి? బీస్ట్?!"....."నాకే చేతనైతేనా? పిల్లిగ్రుద్ది లించుకుంటే మాత్రం? అరుణ—ఎవరిది అరుణ? ఈ లోకంలో అందం ఎవరికి హక్కు? ఈ విశ్వ సౌందర్యాన్ని ఎవరు దాచుకో గలరు?"......."ఎదిగాను. ఒక్కర్నే ప్రేమించి, దానిని నమ్ముకుండే మనిషికాదు. పురుషులు ఆమెకి ఆట వస్తువులు ఆమె తృప్తికి ఉపకరణాలు." అని రచయిత (ఆధ్యాత్మిక దృష్టి) చివరి సమన్వయం.

ఈ జిజ్ఞాస తాలూకు స్వప్నం భగ్నమౌతుంది. అరుణ భర్త జయరావు అతనివెంట అతని తల్లి, ఒక సంగనాటాల ఆచార్యులూ ప్రవేశించటంతో. "భర్త! ఆ మాట ముందు ఇష్టాలూ, ధర్మాలూ, హృదయాలూ, స్నేహాలూ, ప్రేమలూ పాపాలూ—అన్నీ తలవంచి తప్పుకోవలసిందే!" బీస్ట్, నాగన్ భర్త అధికారాన్ని మన్నిస్తారు. "ఇదే మొగాళ్లకి మొగాళ్ల కి ఉండే **Convention** ఇదే **Fair play** ఆ **Play** లో ఆడది చేరదు. అన్నీ మొగవాళ్ల కల్పనలు" అని వ్యాఖ్యానం కాని ఆ **Convention** అటువంటి వ్యవస్థ అవ సరమనే గుర్తింపు కూడా ఉంది : "ఆ భర్త, పోలీసు రక్షణ ఉండబట్టేకదా ఆమె ఆ ఆటలాడింది!.....స్వేచ్ఛ, స్వేచ్ఛ అంటాంగాని, మనని బంధించి నిలబెట్టే ఈ దేశం, సంఘం కట్టుబాట్లు, మర్యాదలు.......మగ ఇవి లేకపోతేపోతే మన స్వేచ్ఛా వాదాలూ, ప్రణయాలూ—శరీరం సరిగా పని చేస్తున్నంతసేపే అవధ్యాలు......"

మూలశంకకు
త్వరగా నమ్మకమైన
హెడెన్‌సాతో
చికిత్సను పొందండి
-శస్త్రచికిత్స
అవసరములేదు!

సహించలేని బాధ ఉందా! తీవ్రంగా దురద వుందా? మంటతో నెత్తురు పడుతుందా? అమోఘమైన చికిత్స ఎంతమాత్రము కాలయాపన చేయవద్దు! ఉపేక్షిస్తే తీవ్రమైన పరిస్థితులకు దారితీసి- శస్త్ర చికిత్స తప్పనిసరి ఔతుంది. సకాలంలో హెడెన్‌సాతో ఉపశమనాన్ని పొందండి. ఇది నమ్మకమైన జర్మను మూలశంక విరేచనము. 108 దేశాలలో వైద్యులందరూ శిఫారసు చేస్తున్నారు. హెడెన్‌సా శీఘ్రంగా గుణాన్నిచ్చి బాధను దురదను శమింపజేస్తుంది—విరేచనము ఎంతమాత్రము కష్టమనిపించదు. హెడెన్‌సా లో ఉండే అమోఘమైన మందులు సామర్థ్యంగా గుణాన్ని కలిగించిర క్తశంకలను ముకుళింపజేసి ఆరోగ్యకరమైన టిస్యూ రంధ్రాలప్రవృద్ధికి సహకరిస్తుంది. గమనించండి. మూలశంకలకు సకాలంలో హెడెన్‌సా చికిత్సచేసుకుంటే ముమ్ముందు శస్త్ర చికిత్స అవసర ముండదు! హెడెన్‌సాలో మత్తును కల్గించే మందులు ఏమియు లేవు.

అసలైన జర్మన్ సూత్రాలకు అనుగుణంగా ఇండియాలో పేరిచే తయారు చేయబడుచున్నది.

ది డాలర్ కంపెనీ
337, తంబుచెట్టి వీధి మద్రాసు-1.
ప్రసిద్ధి పొందిన కెమిస్టు లందరివద్ద లభిస్తుంది.

B3-DOL-2ATG

స్త్రీకి 'కేవలం స్వేచ్ఛ' (Absolute Freedom) అనేది గగన కుసుమం. ఈ లోకంలో, ఈ లోకపు సంబంధ బాంధవ్యాల్లో దానికి అస్తిత్వంలేదు. ఈ సత్యం గ్రహించాక భౌతిక జీవితపు అల్పత్వం గోచరిస్తుంది. అరుణ రచనలలో చెప్పే ఆఖరు మాటలు: "......నేనింతవరకు ఎవర్నీ ప్రేమించలేదు......నా హృదయంలో గొప్ప ప్రేమ ఉంది. ప్రేమించాలనే ఆశ అపారంగా ఉంది. అందుకన్నే ఇవన్నీ. కాని నా ఆదర్శమే అతి ఉన్నతం......ఈ మనుషుల్ని చూస్తే వాళ్ళలోపల దీపా లోపలా అన్నీ కనపడతాయి......నాకు మనుష్యుల్లో ఒకరికీ ఒకరికీ భేదం నశించింది. అందరూ అంతే. ఏం చేస్తారు. పాపం! అంతకన్న చేతకాదు. మానవత్వాన్ని అతిక్రమించాలని ప్రయత్నిస్తారు కొందరు పిచ్చి వాళ్ళు. కాని, పాపం చేతకాదు. శరీరం ఒక్కటే ప్రేమ సాధనం. ఏ సిపాయైతే నేం? భర్త అయితేనేం, బ్రహ్మచారైతేనేం, ఆ మహాత్ముడైతేనేం? ఏదో కాలక్షేపానికి! ఎవరికో ఒకరికి తృష్ణ తీర్చడం. కాని ఈ మొగాళ్ళు—చూశావుగా రాత్రి? ఒకే రకం.. ఎవరున్నా కొందరున్నా ప్రేమించావా అంటూ—నిన్నే అందుకనే నీ పాదాంవద్దే నిష్క్రమిస్తున్నాను.' కేవలం స్వేచ్ఛ, అనంతమైన ప్రేమ కాంక్ష— అరుణ. కాని ఈ అరుణకు స్త్రీగా ఈ లోకంలో మనుగడలేదు.

ఈ లోకపు బంధాల్ని దాటి చలంకి అందకుండా ఎక్కడికో వెళ్ళిపోయిన అరుణ, ఈ లోకంలో మనుగడ సంకుచితత్వాన్ని అల్పత్వాన్ని భరించలేక అదృశ్యమైన అరుణ, ఏకమై ఆలోకించింది దేవతామూర్తియైన "ఊర్వశిగా ప్రత్యక్షమై చలం "ఆధ్యాత్మిక సందేహాలకు, కైలాస ద్వారాలు తెరిచిన" ('అరుణ' ముగింపు వాక్యాలు) రచన "పురూరవ". 'పురూరవ' నాటకంకాదు, గురుశిష్యుల సంవాదము. చలం అభౌతిక దర్శనం నిక్షిప్తమైన ఉపనిషత్తు. "స్త్రీముందు మోకరించడం నేర్చుకుని నువ్వు ఏం తెలుసుకున్నావు! ఏం సాధించావు? నీ వింత అల్పుడవని తెలీదునాకు" అని ప్రారంభిస్తుంది ఊర్వశి తన తత్త్వబోధ. అందులో మొదటి ప్రశ్న "మనుష్యులు?"— జిజ్ఞాస చెయ్యమంటుంది ఊర్వశి. కాలం, ప్రేమ, మతం, సైనిక వ్యవస్థ, కామవాంఛ, సౌందర్య లాలస ఈ విషయాలను గూర్చి క్రమంగా వ్యాఖ్యానిస్తుంది ఊర్వశి, కాని బోధనకంటె సొంత అనుభవం ముఖ్యం అంటుంది. "క్రమంగా కాలంలో సొంత అనుభవం బోధించవలసిందే. మాటలతో నేర్చుకునే విషయాలు చాల అల్పమైనవన్నమాట, ఎదుగు విశాలంగా తెలుస్తాయి. తెలీదనుంటే అర్థమేమిటనుకున్నావు. అనుభవించే అర్హత కలగడమన్నమాట".....సంభోగాన్ని గూర్చి ఊర్వశి వ్యాఖ్యానం ఉల్లేఖించదగింది: "సౌందర్యానికి ఆ కలయికకీ సంబంధ మేమిటి? అది కాదు బలం, సృష్టిశక్తి, చేతుల్లోకి తీసుకుని, అదిమి, తాగి, కళ్ళు ఆవేశంతో, రక్త విజృంభణతో మనస్సు పొరలు కప్పి—ఆ నిమి

షిన సౌందర్యంతో ప్రసక్తి ఏముంది? సౌందర్యాన్నే అనుభవించడం నేర్చుకున్నవాడు స్వర్గమే నీ కరతలామలకం....... ఆలింగనంలోకి ఒదుగుతూన దేహ లావణ్యాన్నేకాదు. గొప్ప సంస్కారాన్ని, విశాల విజ్ఞానాన్ని, అధ్యాత్మిక శక్తిని తీసుకుంటున్నావు. నీ ఆత్మ వికసించకపోతే, ఈ సృష్టి పిలి అర్థ విహీనం వ్యర్థం.......సుఖంకానీ, కష్టంకానీ ఏ స్థితివల్ల మానవుడి ఔన్నత్యానికి తోవ కలగదో అది వ్యర్థా. అందులో స్త్రీ శృంగారంవల్ల ఏమీ అధికంగా విజ్ఞానం తెచ్చుకోలేని వారు పట్ట దౌర్భాగ్యులు. ఈ లోకపు వెలుగులోకి జన్మకేకాదు, ఆ లోకపు వెలుగులోకి జన్మకి కూడా స్త్రీయే ద్వారం. కామియైన్లో మోక్షగామి కావడమంటే, భోగి యోగి కావడమంటే, అర్థం ఇదే! తన దగ్గర దీక్ష పొందిన పురూరవుణ్ణి లోకవ్యవహారానికి, ఇతర ధర్మాలకూ స్వస్తి చెప్పమంటుంది. "ధర్మం అంటే అర్థం తెలుసునా? మన నిగూఢమైన వాంఛ, మన స్వభావాధికారాన్ని మించిన ధర్మం బైట ఎక్కడా లేదు." తర్వాత ఊర్వశి పురూరవుడి రాజధానికి వస్తుంది—నాగరకత, కవిత్వం, శిల్పం, గానం, విజ్ఞానం, యుద్ధం నేర్పిస్తుంది. చివరకు ప్రియురాలిపట్ల అతని ధర్మాన్ని గూర్చి "తన ఆత్మ వైశాల్యానికి అనుగుణంగా ప్రియురాలు ఒటస్థిస్తుంది......ప్రియురాల్నికాదు నువ్వు ప్రేమించవలసింది, నీ ప్రేమను" అంటుంది. అతనిలో పూర్వ బంధనాలను, వాసనలను వదులుకొమ్మంటుంది. అప్పుడే 'స్వేచ్ఛ' "నీ మన పనేది నేరుకాదు. నీ మనసునే వెయ్యి దిక్కుల వెయ్యి మనసుల్లో ప్రతిఫలింప చేసుకుంటావు. ఎన్ని జన్మలనుంచో నీలో నువ్వు అన్వేషించుకున్న శృంగారాన్నే ఇదివరకు అనేక స్త్రీరూపాల, ఈనాడు నా రూపాన నీ చేతుల్లోకి తీసుకుని అనుభవిస్తున్నావు. అంటే—నేను—యుగాల ఫలితమైన శృంగార వాంఛ నా రూపం ధరించి వచ్చింపన్నమాట."......పురూరవుడి ఆత్మ స్వరూపమే ఊర్వశి!

సుఖ దుఃఖాలను గూర్చి, సంయోగ వియోగాలను గూర్చి పురూరవుని జ్ఞాన నేత్రం తెరుస్తుంది ఊర్వశి. "అయితే ఈ జీవితమంతా కలలేనంటావా?" అంటాడు పురూరవుడు. "అనుకోడంకాదు. అంతే. జీవితమంటే ప్రతి అడుగుకీ కదలిక. కదలిక అంటే త్యాగం, తోవ పొడుగునా వదలడం. అందులో ప్రేమ జీవితమంటే చాల వేగమైన కదలిక. క్షణ క్షణానికీ తీవ్రమైన పరిత్యాగం." ఆ పరిత్యాగం చెయ్యలేక, అహంమీద భ్రాంతి వదలలేక, పురూరవుడు చివరి పరీక్షలో నెగ్గలేకపోతాడు—ఊర్వశితో ఐక్యమై ఆమెతో దివి కేగలేక, ఆమె వియోగంతో తపిస్తూ భూమిమీదే ఉండిపోతాడు. ఊర్వశి చలం దర్శించిన స్త్రీయొక్క విరాణ్మూర్తి. ఆ మూర్తిలో లీనం కావటానికే ఆయన తర్వాతి సాధన.

చలం ఊర్వశిలో దర్శించిన తత్త్వానికి అద్వైత వేదాంతానికి అట్టే భేదం లేదు. వైయక్తికమైన మార్గ భేదం తప్ప. కాల్పనికవాదియైన చలం చివరకు దార్శనికుడై తన గమ్యాన్ని తను చూచుకోవటం బాగానే ఉంది. అయితే సంస్కర్తగా అతివాదిగా ఆయన చేసిన రచనల మాటేమిటి? లోక వ్యవహారానికీ, సమాజానికీ సంబంధించిన నీతి, ధర్మం ఎలా నిర్ణయం కావాలంటాడు? తన రచనల ద్వారా అవ్యవస్థను ప్రోత్సహించి, చివరకు తన కేమీ బాధ్యత లేదంటాడా? దీనికి సమాధానం చలం 'శశాంక' లో సూచించాడు.

గౌతముడు : ఇంక నీతి, దుర్నీతి, విచక్షణ లేదా?

బృహస్పతి : ఇతరుల జీవితంలో నీతి, దుర్నీతుల్ని నిర్ణయించే న్యాయాధికార పీఠానికి నిన్నభిషిక్తుణ్ణి చేసిందెవరు? ఆ విచక్షణ నీ జీవితాన్ని దిద్దుకునేందుకు ఉపయోగపడాలి లోకాన్ని దిద్దేందుకుకాదు.

గౌతముడు : భార్య, లోకమూ ఒకటా?

బృహస్పతి : నీ భార్య ఎవరు, నీవెవరు? ఇంకా మను కాలం వదలలేదా బుద్ధీ?

దేవేంద్రుడు : తమకి భేదభావంలేదు. కాని ఆమె బోటిసామాన్యులకూ, అజ్ఞానులకూ కూడా అదే ధర్మమా?

బృహస్పతి : నీ ధర్మంతప్ప, సామాన్యులుకానీ ఇంకెవరు కానీ, ఇంకొకరి ధర్మం నీవు నిర్ణయించడం మూర్ఖం, సాహసం...... సామాన్యులు వారికి తోచినట్టు వారు ప్రవర్తిస్తారు. మనకెందుకు?

గౌతముడు : బుద్ధిమలం. మనం లోకం ఆత్మాభివృద్ధి కోసం, ధర్మ బోధనకై—

బృహస్పతి : గౌతమా! అజ్ఞానంతో, దుర్బలత్వంతో, మూర్ఖత్వంతో, సమస్త రోగ, ఈతి బాధలకూ లోనై, కర్మ వశాన జరా మరణాదులనుంచి విముక్తి గానక, అంధకారంలో మూలిగే ఈ ప్రాణికోటికి ధర్మబోధన చేస్తావా? గౌతమా, వారి ఆత్మాభివృద్ధి చెయ్యాలనే సంకల్పం వాస్తవంగా నీకుందా? ఉంటే ప్రేమించు. సమస్త జీవుల్ని ప్రేమించి అధికంగా ప్రేమించు......ఖండించకు, శిక్షించకు......

ఈ దృక్పథం, చలం సంస్కర్తగా స్త్రీలకు కర్తవ్యోపదేష్టగా చేసిన రచనల లోటు పాట్లనూ, వాటి విలువనూ గ్రహించేందుకు చక్కని గీటురాయి. పోతే, నేడు సాహిత్యంలో ప్రస్ఫుటమౌతున్న వ్యక్తిత్వ వాద దృక్పథానికి ఇది చేరువలో ఉంది.

# మిస్. భారతి బి. ఏ.

## శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

"శైలజకూ సురేష్‌కూ మహా వైభవంగా వివాహం జరిగింది. పెద్దలందరూ వధూవరులను ఆశీర్వదించారు."

ఆఖరివాక్యం చదివి విసుగుతో పుస్తకాన్ని విసిరి కొట్టింది భారతి. లేచినుంచుని చీర కుచ్చెళ్ళు సవరించుకుని ఒళ్ళు విరుచుకున్నది. తర్వాత మెల్లిగా నడచిపోయి అద్దంలో ముఖం చూసుకున్నది. ఒక్కక్షణం తర్వాత మళ్ళీ అద్దాన్ని బల్లమీద ఉంచి కిటికీ పక్కన కుర్చీలో కూర్చున్నది.

కిటికీలోనుంచి తెల్లని చంద్రబింబం కనిపిస్తున్నది. ఎదురింటి ఆవరణలోవున్న కొబ్బరి చెట్ల ఆకులమీద వెన్నెల వెండి మలామా పూస్తున్నది. ఎవడో బిచ్చగాడు ఇంటిముందు నిలబడి ఎంతో సేపటినుంచి కేకలువేసి విసిగిపోయి కదిలి వెళ్ళిపోయాడు. వీధి చివర పెళ్ళివారి ఇంటిలోనుంచి సన్నాయి వాద్యం గాలి విసురుకు ఉండి ఉండి మల్లెపందిరి దులిపినట్లు మనోహరంగా వినవస్తున్నది.

భారతి నిట్టూర్చింది. మొన్నటి రాత్రి ఎనిమిది గంటల వరకూ మిస్ శకుంతలగావున్న తన స్నేహితురాలు—తనకన్నా చిన్నది—ఆపూటనుంచి మిసెస్ శకుంతలా రఘురామ్‌గా మారిపోయింది. మరికొద్ది రోజులలో భర్తతోపాటు ఢిల్లీ వెళ్ళిపోతుంది. తర్వాత సంసారం, పిల్లలూ హడావిడిలో పడిపోయి ఎప్పుడైనా సంవత్సరానికో రెండు సంవత్సరాలకో బుద్ధి పుట్టిననాడు మళ్ళీ పుట్టింటికి వస్తుంది కాబోలు!

భారతి కుర్చీలోనుంచి లేచి విసుగ్గా అటూ ఇటూ పచారు చేసింది. గోడమీద ఆమె నీడ చిత్రంగా కదులుతూ వుంటే అటే చూస్తూ ఏదో ఆలోచనలోపడి అలా చాలాసేపు పచారు చేస్తూ ఉండిపోయింది. ఆమెకు క్రితం రాత్రి పెళ్లి వూరేగింపు గుర్తు వచ్చింది. శకుంతల తల్లి దండ్రులు సంపన్నులు. ఆమె వారికి ఒక్కతే ఆడపిల్ల. పైగా వరుడు ఉన్నతోద్యోగి. అందువల్ల వారు డబ్బు విరజిమ్మి ముచ్చటగా వేడుకలూ ఘనంగా జరిపించారు. ఒక కారును పూర్తిగా పూలతో నింపివేశారు. ముందు యూనిఫారం ధరించిన బ్యాండ్ మేళమూ వెనక సన్నాయి మేళమూ తర్వాత వధూవరులు కూర్చున్నపూల కారూ, దాని వెనుక మెల్లమెల్లిగా నడుస్తున్న బంధువులూ అలా నేత్రపర్వంగా ఆ వూరేగింపు తమ ఇంటిముందుగా సాగిపోతూవుంటే భారతి కన్నులింతలు చేసుకుని రెప్పవెయ్యకుండా చూస్తూ నిలబడింది. ఆ వూరేగింపు తమ ఇంటిని దాటి ఎంతో ముందుకు వెళ్లి సందు మలుపు తిరిగేవరకూ అలా గుమ్మాని కానుకుని ఆమె కళ్లార్పకుండా చూస్తూనే ఉండిపోయింది. తర్వాత తలుపులు మూసి లోపలికి వెళ్లి పక్కమీద వాలి నిద్రపోదామని ఎంత ప్రయత్నం చేసినా ఆమె కళ్లలో చాలా సేపటివరకూ ఆ మనోహర దృశ్యమే నిలచిపోయింది.

భారతి తన నీడను చూసుకుంటూ పచారు చేస్తున్నదల్లా చటుక్కున ఆగిపోయింది. ఆమె ఎదురుగా గోడమీద ఆమె బి. ఎ. పట్టా వ్రేలాడుతున్నది. ఆమె తండ్రి డిగ్రీ కాగితం రాగానే ముచ్చటపడి దానికి ఫ్రేము కట్టించి గోడకు తగిలించి ఉంచాడు.

భారతి దగ్గరగావెళ్ళి దాన్ని పైనుంచి క్రిందిదాకా చదివింది. తర్వాత కొద్ది క్షణాలు ఆగి మళ్లీ చదివింది. తన పేరును మళ్లీ మళ్లీ చూసుకున్నది. ఆ డిగ్రీ తనకు పద్దెనిమిదోయేట చేతికి వచ్చింది. అంటే అయిదేళ్ల క్రిందటి సంగతి అది. అప్పటికి చదువూ, కాలేజీ, ధ్యాసతప్ప తలకు మరేమీ ఉండేది కాదు. తోటి ఆడపిల్లలతో కాలేజీకివెళ్ళి శ్రద్ధగా పాఠాలు విని నేరుగా ఇంటికి వచ్చేయటం, ఇంటి పనులలో తల్లికి సాయంచేసి మిగిలిన వ్యవధిలో తన పుస్తకాలు ముందు వేసుకుని కూర్చోవటం. అంతేతప్ప కాలేజీ పిల్లలు గుంపులు గుంపులుగా తను వెనక నడుస్తూ కొందరూ, సైకిళ్లమీద కొందరూ, ఫోజులుచేస్తూ వ్యంగ్యంగా మాట్లాడుకుంటూ వస్తూవున్నా పట్టించుకోవడం జరిగేదికాదు. అప్పు డప్పు డామె తల్లి మాత్రం "ఎదిగిపోయిన పిల్ల నిలా ఎన్నాళ్లని ఇంట్లో ఉంచుకుంటామండీ! ఎక్కడన్నా సంబంధాలు విచారించండీ" అంటూ ఉండేది. అందుకు సమాధానంగా ఆమె తండ్రి నవ్వి వూరుకునేవాడు. తప్పక సమాధానం చెప్పవలసి వచ్చినప్పుడు మాత్ర

"అబ్బ! వూరుకోవే! దాని పరీక్షలు కాకుండా ఎలాగా? అయిన తర్వాత మాట్లాడంతే" అనేవాడు. తర్వాత తన పరీక్షలైపోయాయి. అప్పుడొకరు పెళ్ళి చూపులకు వచ్చారు. చూసుకుని వెళ్ళిపోయారు. వారి దగ్గరినుంచి వెంటనే ఉత్తరం వచ్చింది. తమ పిల్లవాడు మెట్రిక్ ఫైనల్ మాత్రమే ప్యాసయినవాడని, వాడికి బి. ఏ. పిల్లను చేసుకోవటం తమకు ఇష్టంలేదనీ, పిల్ల బి. ఏ. పరీక్షకు వెళ్ళిందన్న సంగతి తెలియక చూపులకని వచ్చి ఇబ్బంది కలిగించినందుకు క్షమించవలసిందనీ ఉత్తరంలో సారాంశం. తర్వాత ఫలితాలు తెలిశాయి. తాను అన్ని పార్టులలోనూ ప్యాసయింది......గ్రూపులో సెకండ్ క్లాసు..... మరొక నెల రోజులకు మరొక సంబంధం వచ్చింది. కట్నం విషయంలో తాము తూగలేకపోయారు. మరొక సంబంధం. వరుడు నల్లనివాడు. అతనికి తాను నచ్చలేదట.......తర్వాత మరొక సంబంధం...... వరుడు ప్లీడరు......అప్పుడు పరిహాసం అనుకుని వెళ్ళిపోయారు......ఆతర్వాత క్రమంగా కాలం గడిచే కొద్దీ 'ఇంత చదొచ్చినా పెళ్ళి కాలేదెందుకో.....' అనే విమర్శతో సంబంధాల సంఖ్య తగ్గిపోయింది. సంవత్సరం క్రిందట తాని ఉద్యోగంలో చేరినప్పటినుంచీ మరెవ్వరైనా ఎవరూ రాలేదు. తండ్రికి వస్తున్న పెన్షన్ రాళ్ళ తప్ప వేరే ఏ ఆదాయమూ లేని తమ ఇంటి పరిస్థితి తాను ఉద్యోగంలో చేరిన తర్వాత వస్తున్న తొంభయి రూపాయలతో కొంచెం కుదుట పడింది.

భారతి జడ ముందుకు వేసుకుని చివరలు విప్పి మళ్లీ అల్లుకుంటూ అటూ ఇటూ తిరగడం ప్రారంభించింది. బల్ల మీద తెల్లని కవరు కనిపించేసరికి వెళ్లి దాన్ని చేతిలోకి తీసుకుంది. ఆ కవరు నాలుగు మూలలా పసుపు పూయబడి ఉంది. లోపల తెల్లని అట్ట పైనమీద శుభలేఖ. మామయ్య కూతురు. శశి పెళ్లి.....ఎల్లుండిరాత్రి ఇక్కడ కొంతలకు ఏ ముహూర్తంలో పెళ్లి అయిందో సరిగ్గా అదే ముహూర్తానికి వంద మైళ్ళ దూరంలో మామయ్యగారి ఇంట్లో శశి పెళ్లికూడా జరిగి ఉంటుంది. మిస్ శశి......మిసెస్ శశి రామచంద్రమూర్తిగా మారిపోయింది. పద్నాలుగేళ్ల శశి......పోయిన సంవత్సరం ఇక్కడికి వచ్చినప్పుడు తన చిన్న చెల్లెలుగా తిరిగిన శశి పెళ్ళి కూతురై గృహిణి అయింది!

భారతి కవరు మళ్లా బల్లమీద పడేసి తల్లిని తలుచుకుంది. శశి పెళ్లి శుభలేఖ రాగానే ముందురోజే బయలుదేరి వెళ్ళాలని అన్నదామె తల్లి. భారతి ఒక్క క్షణం ఆగి తల వూపుతూ 'నేను రానులే అమ్మా!' అన్నది. ఆమె ఆశ్చర్యపోయి "అదేమిటె మా తల్లీ, అలా అంటావు? వాళ్లేమైనా మనకు పరాయివాళ్లా? శశి పెళ్ళికి వెళ్ళకపోవటం ఏమిటి? పైగా నీకు అదంటే అభిమానం కూడా కదా?" అన్నది. భారతి "అదికాదమ్మా......" అంటూ ఏదో చెప్పబోయి మానుకుని చివాలున లేచి వెళ్ళిపోయింది. ఆమె తండ్రి ఆమె మనసు అర్థం చేసుకుని ఏమీ మాట్లాడకుండా కూర్చుండిపోయాడు. తల్లి విసుగుతో "ఏమిటోబాబూ! ఈ పిల్లతో వేగడం కష్టంగానే ఉంది......" అనుకున్నది స్వగతంగానే. తర్వాత పెళ్లికి తల్లీ తండ్రీ ఇద్దరూ ప్రయాణమై వెడుతూ ఉంటే భారతి "నాన్నా! మామయ్య అడిగితే నాకు సెలవు దొరకలేదని నచ్చచెప్పు......" అన్నది. ఆమె తల్లి "సరేలే అమ్మా! నీకు రావటం కష్టమైనంతమాత్రంలో ఏదో ఒక సాకు చెప్పి తప్పుకోవడం నాకు కష్టమవుతుందా ఏమిటి?" అన్నది. ఆమె అమాయకురాలు. ఒట్టి బోళా మనిషి.....

భారతికి మనస్సు కలుక్కుమన్నది. కళ్ల ఎదురుగా మనసును రంపపు కోత పెట్టే దృశ్యం. తన తల్లిని పెళ్లికి వచ్చిన వారందరూ వంతుల ప్రకారం ఎవరి కెదురయితే వారు కావాలని పలకరిస్తున్నారు. "ఏమమ్మా! పిల్ల పెళ్ళి ఎప్పుడు చేస్తావు?" అని ఒకరూ, "ఎదిగిన ఆడపిల్లను ఇంట్లో ఇంకా ఎలా ఉంచుకున్నావమ్మా? మా లచ్చికి తొమ్మిదోఏడు......నా కప్పుడే కాళ్ళక్రింద మంటలు పెట్టినట్టుగా ఉంది. సంబంధంకోసం మావారు కాలికి బలపాలు కట్టుకు తిరుగుతున్నారంటే నమ్ము......" అని ఒకరూ, "ఎదిగిన పిల్ల గుండెమీద కుంపటేనమ్మా......" అని ఒకరూ, "ఏది ఏమయినా పెళ్లి, దాని అచ్చటా ముచ్చటా చిన్నతనంలో చేస్తేనేసుమీ! ఎద్దుల్లాగా ఎదిగాక ఏం పెళ్ళిళ్లు? ఏం వేడుకలు?" అని మరొకరూ అంటున్నట్టూ, ఆమె తల్లి ఏ సమాధానమూ చెప్పలేక అవమానంతో ముఖం కందగడ్డకాగా పైకి మాత్రం నవ్వడానికి ప్రయత్నిస్తున్నట్టూ వూహించుకుని భారతి నిలువెల్లా వణికిపోయింది.

తర్వాత ఆమె కాస్సేపు కిటికీ ప్రక్కనే కుర్చీలో కూర్చున్నది. మొదటి ఆట సినిమా వొదిలినట్టున్నారు. వీధిలో గలగలమని శబ్దంచేస్తూ ఒక రిక్షా వెళ్లిపోయింది. అందులో పసిపిల్లవాణ్ణి వొళ్ళో కూర్చోబెట్టుకుని ఒకామె కూర్చుని ఉంది. ప్రక్కన ఉన్నది భర్త కాబోలు. అతనేదో చెబుతూవుంటే వింటూ ఆమె నవ్వుతున్నది. తర్వాత ఒక ముసలి మనిషి కేక వేసుకుంటూ నడిచిపోయింది. ఆ తర్వాత ఒక్క నిముషంసేపు ఎవరూ వీధిలో కనబడలేదు. అంతలో తెల్లని పలుచని చీర కట్టుకున్న పద్దెనిమిదేళ్ల యువతి, నల్లని సూటు వేసుకున్న

పాలికయొళ్ళ యువకుడూ చేతులు పట్టుకుని ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ గుసగుస నవ్వుకుంటూ నడిచిపోయారు.

భారతి లేచింది. కిటికీ రెక్కలు రెండూ మూసి వీధి గుమ్మం దగ్గరికి నడిచింది. వీధి తలుపులు రెండూ బార్లగా తీసింది. గదిలోని కాంతి తలుపులు తియ్యగానే రెండు గీతలు గీసినట్టు పంచలో కొంత మేర పడింది. అందులో తన నీడ... చలిగాలికి వణుకుతూ కొంగు మెడ చుట్టూ చుట్టుకుని ఆమె తన కదలని నీడలను చూసుకుంటూ కొద్ది క్షణాలు నిలబడి పోయింది.

వీధివైపు అరుగుమీద అంతవరకూ పడుకుని ఉన్న వ్యక్తి అలికిడి విని తల తిప్పి చూశాడు. అతనికి పంచలో కొంత మేర వెలుగూ, అందులో భారతి నీడా కనిపించి ఉండాలి. భారతి అరుగుమీద ఎవరో ఉండటం గమనించి కూడా 'ఎవరో లెమ్మ' నుకుని వెనుదిరగబోతుండగా ఆ వ్యక్తి త్వరత్వరగా అరుగు దిగివచ్చి "ఏమండీ. విపరీతంగా దాహం వేస్తున్నది. కాసిని మంచినీళ్ళిప్పిస్తారా ?" అని అడిగాడు.

భారతి లోపలికి నడిచింది. వంట యింటిలో నుంచి నీర చెంబుతో నీళ్ళు ఒక గ్లాసూ తీసుకుని చెరె కొంగు మెడ చుట్టూ చుట్టుకుంటూ ముందు గదిలోకి వచ్చేసరికి ఆవ్యక్తి గుమ్మంలో నిలబడి ఉన్నాడు. ఆమె కొద్ది దూరంలో నీళ్ల చెంబు ఉంచగా దాన్ని తీసుకుని నీళ్ళు గ్లాసులోకి వంచుకుని అతడు మూడు గ్లాసుల నీళ్ళు త్రాగాడు. ఎంతగా దాహంతో బాధపడుతున్నాడో మరి. కన్నెత్తకుండా గబగబ మూడు గ్లాసుల నీళ్ళూ త్రాగేసి అప్పుడు త్రేన్చుతూ "పోయిన ప్రాణాలు తిరిగివచ్చినట్లుంటుందండీ ..." అన్నాడు.

భారతి ఇంతసేపూ ప్రతిమలా కదలకుండా నిలబడి పోయి అతన్ని పరిశీలించింది. అతడు తనకు అపరిచితుడు కాదు. ఎప్పుడో ఏ సందర్భంలోనో తా మిద్దరికీ పరిచయం ఉంది. ఎక్కడ ? ఎప్పుడు ?

అతని గడ్డం మాసిఉంది. ధరించిఉన్న పైజమా లాల్చీ కొద్దిగా మాసిఉన్నాయి. మెడలో ఒక ముక్కుపొడి రంగు మఫ్లరు ఉంది. ప్రాక్తి లేనట్టుంది. రైలు ప్రయాణం చేసి వచ్చినవాడిలా ఉన్నాడు. కొంచెం దళసరి అద్దాల కళ్ళజోడును ఒక వ్రేలితో సర్దుకుంటూ మరొక చేత్తో నీళ్లచెంబూ, గ్లాసూ ఆమెకు చేరువలో ఉంచి అతడు తలయెత్తి చూశాడు.

అతడు ఉన్నట్టుండి "మీపేరు భారతి కదూ ?" అని అడిగాడు. ఆమె తల వూపింది. కాని అత నెవరో ఆమెకు ఇంకా గుర్తు రాలేదు.

అత డామెను చూసి నవ్వుతూ "నన్ను గుర్తుపట్ట లేదా ? మీతో బి. ఏ. చదువుకున్నాను. నాపేరు విశ్వేశ్వరరావు... 'విశ్వం' అంటూ ఉండేవా రందరూ..." అన్నాడు.

అప్పు డామె గుర్తు తెచ్చుకుని "ఓహో ! ఎలా చెప్పండి. మీరు బి. ఎ. మొదటి సంవత్సరంలో నాటకంవేసి కాలేజీ ఉత్సవ సమయంలో వచ్చారు కూడా .... ఇప్పుడు గుర్తు వచ్చింది." అన్నది.

అతడు నవ్వి "అందుకే బి. ఎ. పరీక్ష తప్పా నట్టుంది. అప్పు డందరూ నన్నొక గొప్ప యాక్టరు అనుకునేవారు ఆమాట నాముందే అనేవారు కూడా. దానితో కళ్ళు నెత్తికెక్కి చదువు ధ్యాస ఒదిలి పరీక్షలు తెడగొట్టుకున్నాను" అన్నాడు.

భారతి కుర్చీ కొంచెం పక్కకు జరిపి "ఇలా కూర్చోండి" అన్నది. అక్కడ ఒకే కుర్చీ ఉండటంతో సందే హిస్తున్న అతన్ని చూసి "ఫరవాలేదు. మీరు కూర్చోండి .... నే నిలా నిలబడి మాట్లాడుతాను. అన్నట్టు మీ రిప్పుడేం చేస్తున్నారు ?" అని అడిగింది.

విశ్వం కళ్లజోడు తీసి లాల్చీ చివరలతో తుడుస్తూ చెప్పుడిగా "మద్రాసులో ఒక ప్రయివేట్ కంపెనీలో ఉంటున్నాను. నెలకు రెండువందలు ఇస్తారు. నా భార్య ఒక స్కూల్లో టీచరు .. ఆమెకు మాట ఆరవై వస్తాయి" అని చెప్పాడు.

తర్వాత ఒక్క క్షణం ఆగి మళ్లీ "ఈ వూరికి చాల చిత్రపరిస్థితులలో వచ్చి చిక్కుపడిపోయాను" అంటూ జేబులోనుంచి ఒక ఉత్తరం తీసి "చూడండి. 'నవకళా పరిషత్తు' అనే నాటకసమాజం ఉందిట యీవూళ్లో. వారు యీ రాత్రి నేను వ్రాసిన ఒక నాటకం ప్రదర్శిస్తున్నామనీ వీలుచేసుకుని వస్తే ఆనందిస్తామనీ వ్రాశారు. ఆ వ్రాయడం కేవలం మొక్కు తీర్చుకున్నట్టే ఉంది గాని రమ్మని తప్పక వచ్చి చూడాలని వా రనుకున్నట్టు తోచడంలేదు. కేవలం ఒక ఉత్తరం వ్రాసి వూరుకున్నారు. ఎంతయినా నాటకం వ్రాసినవాణ్ణి కదా ? ప్రదర్శన ఎలా ఉంటుందో చూద్దామని కోరిక చంపుకోలేక వాళ్ళలు పెట్టుకుని బయలుదేరి వచ్చేశాను. తీరా స్టేషనులో దిగిన తర్వాత ఆ బాపతు జనాభా ఎవరూ ప్లాట్‌ఫారంమీద కనిపించలేదు. ఇది నాకు కొత్త వూరు. పైగా తెలిసినవా రెవరూ లేరు. వీధులన్నీ గంటన్నర నేటినుంచి తిరిగి తిరిగి యిక్కడికి చేరుకున్నాను" అన్నాడు.

భారతి "మరి మీ భోజనం ...." అంటూవుండగా అతడు అర్థోక్తిలో ఆపి నవ్వుతూ "ఆ దిగు లక్కరలేదు లెండి.... హోటల్లో భోజనం ముగించుకునే వచ్చాను" అని

చెప్పాడు. తర్వాత బిడియపడుతూ "మీరు నిలబడే ఉన్నారు" అన్నాడు.

ఆమె "ఫరవాలేదులెండి .... అయితే మీరు నాటకాలు వ్రాస్తూవుంటారా ?" అన్నది.

విశ్వం కళ్లజోడు తీసి మళ్లీ చొక్కా చివరలతో దాన్ని తుడుస్తూ నెమ్మదిగా "ఆఁ ! ఏదోలెండి .... ఉబుసు పోకకు తోచక తోచినప్పుడు ఏదో గిలుకుతూ ఉంటాను. అవి ఏవయినా పత్రికలలో అచ్చయితే యిలాగే నాటక సమాజాల వారు అప్పుడప్పుడు తాము అక్కడ ప్రదర్శిస్తున్నామనీ, యిక్కడ ప్రదర్శిస్తున్నామనీ ఉత్తరాలు వ్రాస్తూ ఉంటారు. సాధారణంగా నేను ఎక్కడికీ వెళ్లను. ఇవాళ మీరు ప్రదర్శిస్తున్నామని వ్రాసిన యీ నాటకం నాకు చాలా యిష్టం.. దాన్ని చాలా కష్టపడి వ్రాశాను. నేను. అందుకే అది ఎలా ఉంటుందో చూడాలని కోరిక ఆగక యిలా బయల్దేరి వచ్చేశాను" అని చెప్పాడు.

భారతి నవ్వి "బహుశా వాళ్లు కేవలం ఫార్మల్‌గా ఒక ఉత్తరం వ్రాసి పడేసి ఉంటారు 'మీరు అంతదూరం నుంచి రాబోయారా ?' అని అనుకుని ఉంటారు ఆ ఉత్తరం నమ్ముకుని మీరు వచ్చేశారు.... అన్నట్టు మనం చదువుకునే రోజుల్లో ఫైనలియర్‌లో గోపాలరావనే ఆయన ఉండేవాడు. గుర్తుందా మీకు ? ఆ రోజుల్లో ఆయన పద్యాలూ, కథలూ వ్రాస్తూ ఉండేవాడు కొన్ని పత్రికల్లో అచ్చవుతూ ఉండేవి కూడా. ఈ మధ్య ఆయన పేరే కనిపించడంలేదు" అన్నది.

విశ్వం గుర్తు తెచ్చుకుని నవ్వి "ఓహో ! మా గోపాలం మాటేనా మీరు చెప్పేది ? వాడు మన క్లాస్‌మేట్ మాత్రమే కాక నా రూమ్‌మేట్ కూడా. మీరు చెప్పినట్లు ఆ రోజుల్లో వాడు కథలు మంచివే వ్రాసేవాడు. వాడి కిప్పుడు పెళ్లయింది .... ఇద్దరు పిల్లలు కూడా ననుకుంటాను. వాడిప్పుడు రైల్వేలో గార్డు .... ఒకసారి ఎక్కడో కనిపించాడు కూడా. ఆ డ్యూటీతోనే వాడి కాలం వెళ్లమారిపోతున్నది. ఇక కవిత్వమూ, కథలూ ఎక్కడ ?' అన్నిటికీ ఒక్క నమస్కారం పెట్టి ఊరుకున్నాను" ని చెప్పాడు... పాపం ..." అన్నాడు.

భారతి నవ్వి వూరుకున్నది. విశ్వం ఒక్క క్షణం ఆగి "అన్నట్టు మా విషయాలన్నీ రాబట్టారు కాని, మీ సంగతు లేమీ చెప్పారు కారు. మీకు పెళ్లి అయిందా ? పిల్లలా ?" అని అడిగాడు.

భారతి చీరచెంగు వేలుకు చుట్టుకుంటూ "నాలుగే ళ్లయిందండీ .... యింకా పిల్లా జెల్లా లేరు .... వారు యిక్క డొక దినపత్రికలో సబ్ ఎడిటర్‌గా ఉంటున్నారు. ఇవాళ వారికి నైట్‌డ్యూటీ .... పొద్దున ఎనిమిది గంటలకు గాని రారు. మా అత్తగారు పెద్దది. జబ్బుమనిషి .... లోపల గదిలో పడు కుని ఉందిప్పుడు. ఆవిడ పెందరాళే నిద్రపోతారు...." అన్నది.

విశ్వం సర్దుకుని కూర్చుని పెదవిలో సిగరెట్ పొగలు లాగుతూ అన్నాడు, "ఏమిటోనండీ.... ఆ చదువుకునే రోజుల నాటి జీవితం మళ్ళీ రాదు ... అప్పుడు ఏ బరువులూ, బాధ్యతలూ లేకుండా హాయిగా స్వతంత్రంగా ఉండేవాళ్లం .... అన్నట్టు మీకు మన యింగ్లీషు లెక్చరరు గిరీశంగారు గుర్తు న్నారా ? ఆయన అమెరికా వెళ్లాట్ట యీమధ్య .... ఎకన మిక్స్‌లో ఒక నల్లని లావుపాటి లెక్చరరుండేవాడు .... ఆయన పేరు గుర్తు రావడంలేదు.... ఆయన సముద్ర స్నానానికి వెళ్లి మునిగి చచ్చిపోయాడు."

భారతి ఏమీ మాట్లాడలేదు. విశ్వం నెమ్మదిగా "మీతో కలిసి కాలేజీకి వస్తూవుండేది కోమలి .... ఇప్పు డెక్కడుంది ?' అని అడిగాడు.

భారతి కదిలింది. లోపలి గదిలోకి నడుస్తూ "మీకు తెలీదా ? ఆ అమ్మాయికి రెండేళ్ల క్రిందట పెళ్లయింది. కాని, మూడు నాలుగు నెలల క్రిందటనే పోయిన విషయం విన్నాను...." అన్నది. ఆమెకు అన్నీ విషయాలూ గుర్తు వచ్చాయి. కాలేజీలో చివరి సంవత్సరంలో ఈ విశ్వం, ఆ కోమలి అనబడే పిల్లను ఎన్నో రకాలుగా బాధపెట్టాడు. ఆపిల్ల కుంద నపు బొమ్మలా ఉండేది. సన్నగా, తెల్లగా నడయాడుతున్న వెన్నెల తీగలా ఉండేది. మెత్తగా మధురంగా మాట్లాడేది ఆపిల్ల. విశ్వం ప్రేమించాడట.... ఎలా అని ఉత్తరాలు వ్రాశాడు. వెంటబడి గోల చేశాడు. నలుగురిలో అప్రతిష్ట పాలు చేశాడు. ఇప్పుడా దీనురాలిని గురించి వాకబు చేస్తు న్నాడు. ఇతనికేం ? మహారాజులాగా పెళ్లిచేసుకుని మంచి ఉద్యోగం చేస్తూ సుఖపడుతున్నాడు. పాపం ! ఆ అమ్మాయి గతి చూడరాదూ, ఏమయిందో !

ఒక్క క్షణం ఆగి లోపలినుంచే పెద్దగా "ఆమె ఆత్మ హత్య చేసుకుందని విన్నాను. ఎందుకో మరి ...." అన్నది. ఆ మాటలు అని కొద్దిక్షణా లాగి ముందు గదిలోకి వచ్చింది. విశ్వం కుర్చీలో దిగాలు పడినట్టు కూర్చుని ఉన్నాడు. అతని చేతిలో కళ్లజోడున్నది. కళ్లలో ఎక్కడో నీటిపొర ఒకటి దీపపు వెలుగులో తళుక్కుమన్నది. ఒక్క నిముషం తర్వాత విశ్వం సర్దుకుని కూర్చుని మళ్లీ కళ్లజోడు తుడుచుకున్నాడు. ఏమీ మాట్లాడలేదు.

బల్లమీది అలారం గడియారం టిక్కు టిక్కు మంటున్నది. చుట్టుపక్కల అంతా ప్రశాంతంగా నిశ్శబ్దంగా ఉంది. చల్లని గాలి తెరలు తరలుగా వీస్తున్నది.

భారతి మళ్లీ "కోమలి ఎంత మంచి కథలు వ్రాసేదో తెలుసా ? ఎన్నోసార్లు పత్రికలలో ఆమె వ్రాసిన కథలు చదివాను. అన్నీ కొత్త కొత్త కథలు .... అవేమీ నే చెప్పేదూ మళ్లీ కలుసుకోలేదనుకోండి ... అయినా ఆమె పేరుతో అచ్చయిన ప్రతి కథనూ నేను మళ్లీ మళ్లీ చదివాను. ఎన్నోసార్లు ఆమెకు ఉత్తరాలు వ్రాద్దామనుకున్నాను కాని ఆమె అడ్రసు తెలియలేదు. అయినా వాటిని ప్రచురిస్తున్న పత్రికల వారికి ఉత్తరాలు వ్రాసి రీడైరెక్టు చేయమని కోరాను. వాళ్లా చేసే ఉంటారు. అయినా నాకు సమాధానం రాలేదు. ఎందు చేతనో మరి" అంటూ ఆగి మళ్లీ "పైగా మరొక విచిత్రం ఏమిటంటే ఆమె వ్రాసిన ప్రతి కథలోనూ ఏదో ఒక పాత్ర ఆత్మహత్య చేసుకుంటుంది. ఒక్కొక్క కథలో ఒక్కొక్క పాత్ర ఒక్కొక్క పద్ధతిలో ఆత్మహత్య చేసుకుంటుందన్నమాట. ఒక కథలో నాయకుడు రైలు క్రింద పడి ఆత్మహత్య చేసుకున్నాడనుకోండి. మరో కథలో మరో అమ్మాయి ఉరిపోసుకు చచ్చిపోతుంది .... మరో కథలో వంటినిండా కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకోవడం .... అలా అన్నమాట...." అన్నది.

విశ్వం ఉదాసీనంగా నవ్వి పూరుకున్నాడు. భారతి మళ్లీ ఏమీ మాట్లాడలేదు. క్రమంగా నిముషాలు గడుస్తున్నాయి. సెకండ్లముల్లు టిక్కు టిక్కుమని ధ్వని చేస్తూ నిర్విరామంగా ముందుకు పరుగెత్తి పోతున్నది.

భారతికి నిద్ర వస్తున్నది. ఆమె లేచి "మీరు ఈ గదిలో పడుకోండి నేను వెనకవైపు మా అత్తగారి గదిలో పడుకుంటాను" అన్నది.

విశ్వం "మీకు ఇబ్బంది కలిగిస్తున్నట్టున్నాను. ఓ చాప ఇస్తే చాలు ఇలా పరుచుకుని పడుకుంటాను" అన్నాడు.

భారతి చాప పరిచి ఒక దిండు వేసి ముందు తలుపు గడియవేసి లోపలికి వెళ్లబోతూ "మళ్లీ మీకు దాహం అవుతుందేమో, ఇదో నీళ్లచెంబు ఇక్కడే ఉంచుతున్నాను" అని చెప్పింది. విశ్వం చాపమీద కూర్చునిఉండి తల వూపాడు.

మరొక పావుగంట తర్వాత భారతి లోపలికి గదిలో వెచ్చగా దుప్పటిలో ముడుచుకు పడుకుని ఉంది. తాను ఒంటరిగానే ఉన్నప్పటికీ ఇప్పుడెట్టి భయమూ వేయలేదు. తాను కల్పించిన అత్తగారి పాత్ర ఇప్పుడు తనకు రక్షణ ఇస్తున్నది. హాయిగా నిశ్చింతగా నిర్భయంగా నిద్రపోవచ్చు ... ఆమెకు మాగన్నుగా నిద్రపడుతున్నది.

నిద్రలో పంచరంగుల కల.... విశాలమైన ఆవరణలో వెనకగా ముచ్చటైన ఇల్లు .... ఆవరణ నిండా రంగురంగుల పూలచెట్లు .... నేలమీద ఒత్తుగా అందంగా పట్టుపరచి పెరిగి ఉన్న మృదువైన పచ్చిక .... దానిమీద ఖరీదైన తివాచీ పరుచుకుని కూర్చుని తాను ఏదో చదువుకుంటున్నది. ఆమె భర్త పక్కనే వెల్లకిలా పడుకుని గుండెలమీద రెండేళ్ల పసివాణ్ణి కూర్చోబెట్టుకుని ఆడిస్తున్నాడు. తాను చదవటం ఆపి తల పైకెత్తి చూసేసరికి ఆకాశంలో రంగు రంగుల ఇంద్రధనుస్సు...పసిపిల్లలా కువకువలాడుతూ భర్తను చేతో తట్టి 'అటుగో .... అటు చూడండి ...'' అన్నది తాను.

దాని వెంటనే మరొక కల.... దిగంతాలను ముంచేస్తూ రొద చేస్తున్నది సముద్రం. తెల్లని వెండి పళ్లెంలా వెలుగులను చిమ్ముతున్న చంద్రబింబం ఆ అనంత జలరాశికి చిత్రవిచిత్రమైన రంగులను వేస్తున్నది. తీరాన తామిద్దరూ ఎన్నో జన్మలనాటి ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ అటూ ఇటూ తిరుగుతున్నారు.

ఆ తర్వాత కూడా అదే తరహా కలలు భారతికి బోలెడు వచ్చాయి. అయితే తెల్లవారి మెలకువ వచ్చిన తర్వాత అవి అన్నీ గుర్తు లేవు. మొదటి రెండు కలలూ మాత్రం ఎన్నాళ్లకూ మరపురానంత గాఢంగా మనస్సుకు హత్తుకుపోయాయి.

ఆమె లేచి కొనగోళ్లతో తల సవరించుకుంటూ ముందు గది గుమ్మం దగ్గరకూ వచ్చి చూసేసరికి విశ్వం ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు. అతని కళ్లజోడు కుర్చీమీద ఉంది.

భారతి తనలో తాను నవ్వుకుని లోపలికి వెళ్లి పనులలో నిమగ్నమైపోయింది. కాఫీ కుంపటి వెలిగించి నీళ్లు పడేసి ముఖం కడుక్కునేసరికి ఎండ వచ్చింది. నీళ్లు దింపి కాఫీపొడి వేసి పాలగిన్నెను కుంపటిలో ఉంచి ముందు గదిలోకి వెళ్లి చూసింది. విశ్వం అప్పుడే లేచాడు కాబోలు. కళ్లజోడు తడిమి తీసుకుని మొహానికి తగిలించుకున్నాడు. ముందు ఆమెని చూసి నవ్వి తర్వాత టేబిల్‌మీది గడియారంవైపు చూపులు తిప్పి "అరె .... చాలా టైమైపోయిందే .... నాకు ఎనిమిది గంటలకు బండి .... " అన్నాడు.

భారతి నీళ్లచెంబూ పళ్లపొడీ ముందు గదిలోకి తెచ్చి ఉంచి "ఇంకా వ్యవధి ఉందిలెండి .... మొహం కడుక్కుని కాఫీ తీసుకుని వెళుదురుగాని ....'' అన్నది.

అతడు కళ్లజోడు మళ్లీ కుర్చీమీద ఉంచి పళ్లపొడి కొద్దిగా చేతిలో వేసుకుని నీళ్లచెంబు తీసుకుని వెళ్లి అరుగు మీద కూర్చుని ముఖప్రక్షాళనం ప్రారంభించాడు.

భారతి కాఫీ కలిపి తాను తాగి అతనికోసం కప్పులో పోసి సిద్ధంగా ఉంచి తనలో తాను "సరి ... అత్తగారికో కాఫీ .... పాపం అసలే అలవాటుమనిషి.... పైగా పెద్దతనం కూడా" అనుకుని నవ్వుకుంది. తర్వాత "ఎనిమిది గంటలకు శ్రీవారు వస్తారుగా. అప్పటికి సిద్ధంగా కాఫీ ఫ్లాస్కులో ఉంచవద్దూ" అనుకుని మళ్లీ నవ్వుకుంది.

విశ్వం మాసిన చేతి రుమాలుతో మొహం తుడుచుకుని కళ్లజోడు పెట్టుకుని కుర్చీలో కూర్చుని ఉన్నాడు. భారతి కొంగు నెడమచుట్టూ చుట్టుకుని కాఫీ తెచ్చి అతని చేతిలో ఉంచి "తీసుకోండి" అన్నది. అతడు బిడియపడుతూనే కప్పు చేతిలోకి తీసుకున్నాడు. తర్వాత ఒక్కసారి కాఫీ చప్పరించి తల పైకెత్తి చూసి "మరి .... కాఫీ మీకో ?" అన్నాడు.

"నే నిప్పుడు తాగనులెండి.... ఎనిమిది దాటిన తర్వాత వారు డ్యూటీ నుంచి వస్తారు. అప్పు డిద్దరమూ ఒక్కసారే తాగుతాము. ఏమిటో ! ఇన్నేళ్లనుంచీ అలాగే అలవాటయి పోయింది.... మా అత్తగారికి యిప్పుడే యిచ్చి వచ్చాను ..." అని చెప్పింది భారతి. మళ్లీ పమిటచెంగు మెడచుట్టూ లాక్కుంటూ పైగా ఒక్క క్షణం ఆగి "మీరు ఎనిమిది గంటల బండికే వెళ్లిపోవా లంటున్నారు. లేకపోతే ఆయన రాగానే పరిచయం చేద్దును" అన్నది.

విశ్వం ఖాళీకప్పు క్రింద ఉంచుతూ "ఆఁ ! ఎందుకు లెద్దురూ .... ఇప్పటికే మీకు చాలా యిబ్బంది కలిగించాను. ఇక సెలవు తీసుకుంటాను" అంటూ లేచాడు. జేబులో చెయ్యి పెట్టి కొన్ని చిల్లర రూపాయినోట్లు బయటికి తీసి లెక్క పెట్టుకుని 'చాలు' అని గొణుక్కున్నాడు. తర్వాత చేతులు జోడించి 'సెలవు' అన్నాడు. ఆమె కూడా తల వూపుతూ చేతులు జోడించింది.

అతడు నెమ్మదిగా అడుగులువేస్తూ వీధి వాకిలిదాకా వెళ్లి ఎందుకో ఒక్క క్షణం నిలబడిపోయాడు. భారతికి అనుమానం వేసింది. అతడు తనను గురించి తాను కల్పించి చెప్పినవని నమ్మినట్లు నటనం ఏమిటి ? వెనుదిరిగి వచ్చి "ఎందుకలా లన్నీ అబద్ధాలు చెప్పారు ? నేనంత నమ్మదగని వాణ్ణే దుర్మార్గుణ్ణే అనుకున్నారా ?" అని అడుగుతాడేమో! ఒకవేళ నిజంగా అలా అడిగితే ఏం చెప్పాలో తోచలే దామెకు.

విశ్వం వెనుదిరిగి ఆమెవంక చూశాడు. అతని కళ్లు నీళ్లతో నిండుతున్నాయి. అతడు ఒక్క అడుగు ముందుకు వేసి అర్ద్రస్వరంతో "ఈ దిక్కులేని వూళ్లో నన్ను సోదరిలా ఆదరించారు మీరు. మీకు నన్ను గురించి అంతా నిజమే చెప్పడం ముఖ్యమనిపిస్తున్నది. ఇన్నేళ్లుగా ఎందరి దగ్గరో ఎన్నో అబద్ధాలు చెప్పాను. ఎంతోమందిని కేవలం మాటలు చెప్పి మోసం చేశాను. కాని మీ దగ్గర అలా చేయలేక పోతున్నా నెందుకో ! మీరు నన్ను ఆదరించడమే గాక కొసరికొసరి వడ్డించిన సమాహారం అందించి పుణ్యం కట్టుకున్నారు. నేనూ, మా ఆవిడా ఉద్యోగాలు చేస్తున్నామని చెప్పానుకదూ ! అది అబద్ధం. నా కసలు పెళ్లికాలేదు. నేను చేసుకోలేను. కొందరికి నేను ద్రోహం చేశా ననిపించింది. ఆమెను నేను మనసారా ప్రేమించాను. అది వాస్తవం. ఆమె ప్రేమను కూడా పొందాను. కాని అదే నా దౌర్భాగ్యం. అనేక కారణాల మూలంగా ఆమెను మాత్రం పొందలేకపోయాను. ఆమెకు పెళ్లి అయిందనీ, ఆత్మహత్య చేసుకుందనీ మొదటిసారి యిదే నేను వినటం .... నా కింత వరకూ ఆమెను గురించిన ఏ వివరమూ తెలియదు. నమ్మండి" అంటూ ఆగాడు. మళ్లీ తన్ను తాను సంబాళించుకుని "కోమలిని పొందలేని నా బలహీనతకు ప్రాయశ్చిత్తంగా ఆత్మహత్య చేసుకుందా మనుకున్నాను. ఎన్నోసార్లు ప్రయత్నించాను కూడా. కాని ధైర్యం చాలలేదు. నాకులేని సాహసం కోమలి కున్నది. అందుకే ఆమె అలా దాటిపోయింది. ఆత్మహత్య చేసుకుందా మనిపించినప్పుడల్లా కథ వ్రాసి అందులో నన్నొక పాత్రలో వూహించుకుని ఆ పాత్ర ఆత్మహత్యకు పాల్పడేట్టు చేసి తృప్తి చెందేవాణ్ణి. కోమలి కోసం ప్రేమతో పడిన కథలన్నీ నేను వ్రాసినవే. మీ ఉత్తరాలు కూడా నాకు చేరాయి...."

భారతి గుమ్మాని కానుకుని నిలబడి వింటున్నది. అతడు మళ్లీ "నేను చేసే ఉద్యోగం ఏమిటో చెప్పనా ? చాలా సినిమాల్లో యుద్ధ దృశ్యాలుంటాయి చూడండి. రాజులతోపాటు వాటిలో వెనక పోట్లాడుతూ ఉండేందుకు ఎందరో మనుషులు కావలసి వస్తారు. ప్రతి సినిమాలో ఆ సీనులలో రెగ్యులర్‌గా పాల్గొనేవాళ్లలో నే నొకణ్ణి. రోజూ యింతని జీతం యిస్తారు. అదీ నా ఉద్యోగం. ఏదో అలా గడిచిపోతున్నది జీవితం...." అంటూ కళ్లు తుడుచుకుని "ఎందుకో అన్ని వాస్తవ విషయాలు మీముందు మనసు విప్పి చెప్పాలనిపించింది. చెప్పాను. క్షమించండి.... వీటిని మనసులో ఉంచుకోకండి. చక్కగా వివాహం చేసుకుని సుఖంగా ఉన్నారు. మీ మనసులో ఈ క్షుద్ర విషయాలు నింపటం నా అభిమతం కాదు .... సెలవు...." అని గిరుక్కున వెనుదిరిగి పెద్ద పెద్ద అంగలు వేస్తూ వీధిలోకి వెళ్లిపోయాడు.

తెల్లబోయి శిలాప్రతిమలా నిలబడిపోయింది మిస్ భారతి బి. ఏ.

---

# 1964-65 బోనసు వత్సరం!

ఎల్ ఐ సి వారి ఆస్తుల ఐదవ మదింపు 1965 మార్చి 31వ తేదీకి జరుగుతుంది. ఆ మదింపు తేదీనాడు పూర్తి బీమా మొత్తానికి అమలులో వున్న లాభాలతోగల పట్టాలన్నీ లాభాలలో భాగం పంచుకొనుటకు అర్హత కలిగి వుంటాయి

1963 మార్చి 31వ తేదీకి జరిగిన నాల్గవ మదింపువల్ల ప్రకటించిన హెచ్చు బోనసు రేట్లు యీ క్రింది విధంగా వున్నాయి:

| పూర్తి జీవిత బీమా: | ఎండోమెంటు బీమా: |
|---|---|
| రు **17.50** వెయ్యికి సాలుకి | రు **14.00** వెయ్యికి సాలుకి |

1965 మార్చి 31వ తేదనాడు పూర్తి బీమా మొత్తానికి మీ పట్టా అమలులో వుండేలా చూడడం మీకే లాభదాయకం. ఆ తేదీకి ముందుగానే లాభాలతోగల పట్టాను తీసుకొనడంకూడా ప్రయోజనకరం. ఎందువల్లనంటే, యీ క్రొత్త పట్టా ఒక సంవత్సరం బోనసుకు అర్హత కలిగి వుంటుంది.

మీరు బీమా చేసిననాడే మీకు రక్షణ

## లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా



ASP/LIC/AS-22 TEL

# ఫలప్రదర్శనము

## శ్రీ దివాకరుని వెంకటసుబ్బారావు

ఫలభాగ మన్వయించుటకు స్థూల పద్ధతి, సూక్ష్మపద్ధతి, గణిత పద్ధతి ప్రధాన మార్గములు. ఇందు సూక్ష్మ గణితములు ఉత్తమము. ఆ యా విధానముల ననుసరించగా వెతికినగాని ఫల మన్వయించరాదు. గాన ఈ వ్యాసమునందు ఫల నిర్ణయ విధానములను చెప్పుచున్నాను. ద్వాదశరాసులు కేంద్రములని, కోణములని, త్రికములని త్రిషడాయములని మొదలుగాగల పేర్లతో వ్యవహరింపబడుచున్నవి. అట్లే గ్రహములు శుభులని, పాపులని, సములని, యోగకారకులని, యోగమారకులని వ్యవహరింపబడుచున్నారు. శుభస్థానములని, పాపస్థానములని భావముల వ్యవహరింపబడుచున్నవి. ఆ యా భేదముల నెరుగుట ముఖ్యము. 1, 4, 7, 10 – కేంద్రములు, 1, 5, 9 కోణములు, 3, 6, 8, 12 త్రికములు, 3, 6, 11 త్రిషడాయములు, 1, 4, 5, 7, 9, 10 శుభస్థానములు. 3, 6, 8, 11, 12 పాపస్థానములు. 3, 6, 10, 11 ఉపచయములు. రవి, కుజ, శని, రాహు చరరాశేతర కేతువు పాపులు. క్షీణ చంద్ర, పాపయుత బుధుడు పాపులు. పూర్ణచంద్ర, శుద్ధ బుధ, గురు, శుక్ర, చరరాశిగత కేతులు శుభులు. శుభులుగాని, పాపులుగాని, కేంద్రములుగాని, కోణములుగాని ఇతర స్థానములుగాని సమానబలము గలవిగావు. "ప్రబలాః ఉత్తరోత్తరం" అను క్రమము ననుసరించి ఉత్తర భావములు పొందిన స్థానములు ప్రబలములు. గ్రహదృష్టుల విషయమై గ్రహసంబంధములను వ్యాసమందు చెప్పియున్నాను. రవి, చంద్రులకు ఏకరాశికి మాత్రము అధిపత్య మున్నది. ఇతర గ్రహములకు రెండు రాసుల కాధిపత్య మున్నది. శుభులు కేంద్రాధిపతులై పాపులగుచో కేంద్రస్థితిచే అశుభఫలముల నీయగలరు. పాపులు కోణాధిపతులై పాపులగుచో కోణస్థితిచే అశుభఫలముల నీయగలరు. సహజముగా కేంద్ర కోణగతులు శుభ ఫలములను, పాపస్థానగతులు పాపఫలముల నిత్తురు. ఒకే సమయమందు కోణ త్రిషడాయములకు నధిపతులగు గ్రహములు పాపఫలముల నిత్తురు. తృతీయ లాభాధిపత్యముగల కేంద్రాధిపతులు పాపఫలముల నిత్తురు. లగ్న సప్తమాధిపతులకు, చతుర్థ దశమాధిపతుల కవినాభావ సంబంధ మున్నది. త్రిషడాయాధిపత్యముగల 4, 10 అధిపతులు, కోణాధిపతులు, 1, 7 అధిపతులు పాపులని గ్రహింపవలెను. తృతీయాధిపత్యము గల కేంద్రాధిపతులు అర్థపాపులైనను యోగ విషయమున శుభులగుచున్నారు. లాభాధిపత్యముగల కేంద్రాధిపతులు యోగ మివ్వజాలరు. వీరిక స్వల్ప శుభత్వమని, అధిక పాపత్వమని గ్రహింపవలెను. రవి అర్ధపాపి, కుజుడు త్రిపాదపాపి, శని రాహులు పూర్ణ పాపులు. బుధుడు అర్ధశుభుడై రవి సమానుడగుచున్నాడు. చంద్రుడు తన కళలపై నాధారపడి శుభాశుభత్వముల నొందుచున్నాడు. శుక్రుడు త్రిపాద శుభుడు. గురుడు పూర్ణ శుభుడు. కేతువు కుజసమానుడు. కేంద్ర కోణములు ఉత్తరోత్తరముగా శుభఫలముల నిచ్చును. త్రిషడాయాధిపతులు గూడ ఉత్తరోత్తర బలవంతులు. సౌమ్యులు కేంద్రాధిపతులై స్వక్షేత్రములందు గాని, కోణమునందు గాని స్థితినొంది శుభఫలముల నిత్తురు. భిన్న కేంద్రములందుగాని పాపస్థానములందుగాని యుండి పాప ఫలముల నిత్తురు. క్రూరులు కేంద్రాధిపతులై కేంద్ర స్థితిచే పాపఫలములను, కోణస్థితిచే శుభఫలములను ఇతర స్థానములందు మిశ్రమ ఫలముల నిత్తురు. స్వక్షేత్రగతులగు సౌమ్యులు శుభఫలములను, అట్లే క్రూరులు పాపఫలముల నిత్తురు. 2, 12 అధిపతులు స్వతంత్రముగా ఫలప్రదులుగారు. వీరున్న స్థానాధిపతులను, సంబంధించిన గ్రహములపై నాధారపడి ఫలముల నిత్తురు. తృతీయ లాభాధిపతులు సమాన ధర్మము గలవారు. అట్లే లగ్న సప్తమములు, చతుర్థ దశమములు, ద్వితీయ వ్యయములు, పంచమ నవమములు, షష్ఠాష్టమములు, తృతీయ లాభములు ఏకధర్మముగలవై సహా లగ్నార్థ భిన్న కర్తృత్వము నొంది శుభాశుభముల న్యూనాధికములై ప్రకటన చేయుచున్నవి. ద్వితీయ వ్యయాధిపుల పరస్పర సంబంధముగాని, వ్యయ ద్వితీయస్థాన పరస్పర స్థితిగాని పాపాధిక్య ఫలమునకు మూలము. వీరలకు రెండవ అధిపత్యము గలి

స్వక్షేత్రగతులైన ఫలదాత లగుచున్నారు. 1, 4, 5, 9 అధిపతులు అష్టమాధిపత్యము గలిగి గాని, అష్టమాధిపతి సంబంధము నొందిగాని స్వల్ప శుభఫలముల మాత్ర మిత్తురు. సౌమ్యులు కేంద్రాధిపతులై వారివారి సౌమ్యత్వముపై నాధారపడి దోషయుక్తులై మారకము చేయుచున్నారు. వీరలను యోగకారకులనుట శాస్త్రసమ్మతము గాదు. కేంద్రాధిపత్య దోషముగల గురుశుక్రులైనను, స్వక్షేత్రగతులైనను, త్రికోణములందున్నను, త్రికోణాధిపతులతో కూడినను, సంబంధించినను ఆయా స్థానాధిపతుల సంబంధమగు యోగముల నివ్వచున్నారు. ఇందు గురు, బుధులు చతుర్థ సప్తమాధిపత్యములు గాని, సప్తమ దశమాధిపత్యము గాని పొందినపుడు శుభులుగారు. శుక్రుడు తృతీయ రాజ్యాధిపత్యము గాని, చతుర్థ లాభాధిపత్యముగాని నొంది కేంద్రాధిపత్య పాపియగుచున్నాడు. రవి, చంద్రులు అష్టమాధిపత్య దోషము లేనివారు. బుధ, చంద్రులు శుభత్వము ననుసరించి వారి దోషనిర్ణయము చేయవలెను. కుజుడు తృతీయ రాజ్యాధిపత్యము గాని చతుర్థ లాభాధిపత్యముగాని పొంది పాపి యగుచున్నాడు. ఇవి కుంభ, మకర లగ్నములకు ప్రాప్తించును. ఇట్టి పాపత్వము మారక విషయమునకు ప్రధానము. యోగభావమునకు గాదు. కుజ శనులు కేంద్ర కోణాధిపతులై శుభులగుచున్నారు. రవి కేంద్రాధిపత్యమునొంది శుభు డగును. ఇట్లే పాపయుత బుధుని క్షీణ చంద్రుని కూడ చూడవలెను. ఏ గ్రహమైనను కేంద్ర కోణాధిపత్యము గలిగియున్నను, కోణస్థితిగాని, కోణాధిపతుల సంబంధముగాని నొందినను శుభఫలముల నిత్తురు. కేంద్ర లాభాధిపతిని స్థితియందు మాత్రమే విచారింపవలెను. ఏకాధిపత్యముగల రవి చంద్రుల విచారించిన రవి ఉచ్ఛనొంది కర్కాటక లగ్నమునకు శుభఫలముల నిచ్చును. స్వక్షేత్రగతుడై ధనవృద్ధి చేయును. తృతీయ స్థితిచే ధనప్రాప్తి గలుగును. అష్టమస్థితిచే ధననష్ట మొసగును. షష్ఠ స్థితిచే శత్రు రోగాది మూలకమగు ధననష్టము ప్రాప్తించును. సింహమునకు చంద్రుడు తృతీయ, రాజ్య, చతుర్థములందున్న ధననష్టమైనను దశమ స్థితిచే జీవన లాభము, చతుర్థ స్థితిచే గృహ క్షేత్ర లాభముల నొసగును. లగ్న అష్టమాధిపత్యములుగల కుజ, శుక్రులు ఆ లగ్నములకు పాపులుగారు. గురు, శుక్రులు కేంద్రాధిపతులై అష్టమగతులైన మారకులు గారు. వీరు ద్వితీయ సప్తమములందున్న మారకులు. కన్య లగ్నమైన బుధునకు కేంద్రాధిపత్య దోషములేదు. ఏలగ్నమునకైనను బుధుడు స్వక్షేత్రగతుడైనగాని శుభఫలముల నీయజాలడు. కుంభ లగ్నమునకు కుజుడు యోగప్రదుడు గాడు. వృషభ తులలకు కుజుడు కొంచెము పాపి. మేష, వృశ్చికములకు రవి—శుక్రా, వృషభములకు శని బాధకులు. నవమాధిపతి అష్టమాధిపతి సంబంధము దశమాధిపతికి లాభాధిపతి సంబంధము ప్రాప్తించిన యోగభంగ మగును. ఇట్లే పంచమాధిపతికి షష్ఠాధిపత్య సంబంధము యోగభంగమే యగును. కేంద్ర కోణాధిపతులు పాపస్థానగతులైన యోగప్రాప్తి లేకున్నను పాపఫలము లుండవు. ఉత్తమ కేంద్ర కోణాధిపతులు రెండవ పాపస్థానాధిపత్య సంబంధ దోషముగలవారైనను రాజయోగప్రదు లగుచున్నారు. శుక్రునకు కుంభ మీన లగ్నములకు తప్ప వ్యయస్థిత దోషము లేదు. కోణాధిపతులు ద్వితీయ వ్యయస్థానాధిపతులైనను విశేష శుభులగుచున్నారు. వీరికి షష్ఠమాధిపత్యములు ప్రాప్తించిన శుభులు మాత్రమేయని గ్రహింపవలెను. చతుర్థ దశమాధిపతులకు ద్వితీయమగు తృతీయ లాభాధిపత్యము ప్రాప్తించిన పాపులై సంబంధస్థితుల ననుసరించి యోగకారకులు లేదా శుభులు యగుచున్నారు. సప్తమాధిపతికి ద్వితీయ వ్యయాధిపత్యములలో నొకటి ప్రాప్తించిన శుభుడుగాడు. గాన ద్వితీయ వ్యయాధిపత్యములు లేని కేంద్రాధిపతులు గావట్టి కేంద్ర కోణాధిపతులు, కేంద్ర కోణాధిపత్యము గల రవి, చంద్రులు మాత్రమే విశేష శుభులై యోగకారకు లగుచున్నారు. కేంద్ర, త్రికోణాధిపతులు ఇతరాధిపతులతోగాని, ఇతరాధిపత్యములు గలవారైనగాని యగుదురు సామాన్య శుభులు. కేంద్ర కోణాధిపత్యములుగల ఒకే గ్రహమునకే మార్గ మన్వయింపదు. ఇట్టి స్థితి తులా వృషభములకు శనికి, కర్కాటకమునకు, కుజునకు మకర కుంభములకు, శుక్రునకు ప్రాప్తించును. విశేష శుభఫలములు ప్రాప్తింపవలెనన్న కేంద్ర కోణాధిపత్యములు గల రెండు గ్రహములు ఇతర పాపాధిపత్యము లేనపుడు సంబంధము నొందవలెను. ఇట్టి వారు విశేష యోగకారకులు. కేంద్ర కోణాధిపతులకు రెండవదగు వరకు అష్టమ లాభాధిపత్యాది సంబంధ మేర్పడినపుడు వీరలకు పరస్పర సంబంధ మేర్పడిన యోగకారకులు మాత్రమని భావింపవలెను. లగ్న సప్తమ కేంద్రాధిపతులతో కోణాధిపతులు కూడిన సంపూర్ణ యోగము ప్రాప్తింపదు. లగ్నాధిపతి తనకు సంబంధించిన భావాధిపతులపై నాధారపడి ఫలముల నీయుచున్నాడు. ఉత్తమ కేంద్ర కోణాధిపతులు కేంద్రకోణ, పాపస్థానగతులైనను పరస్పర సంబంధముచే కొంత యోగము నిచ్చుచున్నారు. వీరికి సంబంధము కలుగు కేంద్ర కోణములు నీచమైనను శుభమని చెప్పవలెను. నీచ, శత్రుక్షేత్రములు గాకున్న విశేష ఫలము ప్రాప్తించును. ఇట్లే చతుర్థ పంచమాధిపతుల సంబంధము యోగకారణమని ఎరుగవలెను. ఈ పొంతములు చతుర్థ నవమాధిపతుల సంబంధమునకు పంచమ రాజ్యాధిపతుల సంబంధమునకు సరిగావు. అనగా అట్టి సంబంధముచే అధికయోగ ముండదు. కేంద్ర కోణాధిపతులు పరి

పర్తిన చెందినను, తమ స్వక్షేత్రములందున్నను యోగ కారకు లగుదురు. ఇందు కేంద్రాధిపతిగాని, కోణాధిపతిగాని స్వక్షేత్రగతుడైనను యోగము ప్రాప్తించుచున్నది. త్రికోణాధిపతుల మధ్యనున్న బలియుడైన కేంద్రాధిపతి ఇతర ఇతరగ్రహ సంయోగము నొందినను రాజయోగ కారకు డగుచున్నాడు. అట్టి గ్రహములు నైసర్గిక పాపులైనను యోగము నిత్తురు. ఇద్దరు యోగకారకుల దశల మధ్య ప్రాప్తించు శుభ కారకత్వము గల గ్రహ దశయందు కూడ రాజయోగము ప్రాప్తించును. ఒకే గ్రహమునకు కేంద్ర కోణాధిపత్యములు ప్రాప్తించినను, కేంద్ర కోణాధిపత్యములలో నొకటి రెండవదగు 3, 6, 8, 12 స్థానాధిపత్యము ప్రాప్తించినను శుభ కారకు డగుచున్నాడు. గ్రహములు పాపఫలములకు కారకులైనను యోగకారక గ్రహ సంబంధ మొంది కొంతవరకు యోగ మిచ్చుచున్నారు. ఇట్టి పాపులు యోగకారక గ్రహ దశలందు తమ అంతరములందు యోగము నిత్తురు. రాహు, కేతువులు కేంద్ర కోణ వర్తులై కేంద్ర కోణాధిపతుల సంబంధమొంది రాజయోగ మొసగుచున్నారు. కేంద్రకోణ గతులగు ఈ ఛాయా గ్రహములకు కేంద్ర కోణాధిపతుల సంబంధ మేర్పడక పోయినను అట్టి కేంద్ర కోణాధిపతులు యోగకారకులైన రాహు కేతువులు యోగకారకులు కాకున్నను శుభులై శుభఫలముల నిత్తురు. భాగ్య రాజ్యాధిపతులు అష్టమ లాభాధిపతులైన వీరి సంబంధము యోగప్రదము కాదు. భాగ్య రాజ్యాధిపత్యములు లేని అష్టమ లాభాధిపతుల సంబంధము శుభము. లగ్న అష్టమాధిపతి, పంచమాష్టమాధిపతి, అష్టమాధిపతి, అష్టమ లాభాధిపతి, తృతీయ అష్టమాధిపతి, అష్టమ లాభాధిపత్యములు లేని భాగ్య రాజ్యాధిపతులతో సంబంధ మొందిన పూర్వ ప్రసన్నమగు యోగము భంగము నొందదు. అష్టమ భాగ్యాధిపత్యము నొందిన గ్రహము భాగ్యమందున్నను, రాజ్యమందున్నను, లాభాధిపత్యముగల రాజ్యాధిపతి భాగ్య రాజ్యములందు దున్నను సామాన్య యోగము ప్రాప్తించును. చతుర్థ పంచమాధిపతులు, చెడిపోయిన నవమ దశమాధిపతులు, భాగ్య రాజ్యాధిపతులు, చెడిపోయిన చతుర్థ పంచమాధిపతులు, చతుర్థ నవమాధిపతులు, చెడిపోయిన పంచమ రాజ్యాధిపతులు, పంచమ రాజ్యాధిపతులు, చెడినచతుర్థ భాగ్యాధిపతులు యోగకారకు లగుచున్నారు.

రవి, చంద్రులకు కేంద్ర, కోణ, పాప, ద్వితీయ స్థానాధిపత్యములు వివిధ లగ్నములకు ప్రాప్తించుచున్నవి. కుజునకు ప్రథమమున కేంద్రాధిపత్యము అనంతర పాపాధిపత్యము మేష, వృషభ, వృశ్చిక, మకరములకు ప్రాప్తించును. ప్రథమమున పాపాధిపత్యము అనంతర కేంద్రాధిపత్యము కుంభమునకు ప్రాప్తించును. కేంద్ర కోణాధిపత్యము సింహమునకు, కోణ కేంద్రాధిపత్యము కర్కాటకమునకు ప్రాప్తించును. కోణ పాపాధిపత్యము ధనస్సునకు, ద్వితీయ కోణాధిపత్యము మీనమునకు, ద్వితీయ కేంద్రాధిపత్యము తులకు, ఉభయ పాపాధిపత్యముల్ మిథున కన్యలకు ప్రాప్తించును. సహజ పాపియగు కుజునకు ప్రథమమున కోణాధిపత్యము అనంతర కేంద్రాధిపత్యము ప్రాప్తించిన పాపత్వము తగ్గి యోగకారకు డగును. అపుడు కేంద్ర కోణ గతుడైన శుభఫలములను, అందునను స్వక్షేత్రగతుడై కేంద్రమందున్న అత్యంత శుభఫలముల నీయగలడు. లగ్న పంచమములందు విశేషఫల మీయజాలడు. పాపస్థానములందున్నను పాప ఫలములు ప్రాప్తించవు. ఇట్లే వృషభమునకు శని చూడవలెను. ద్వాదశ శని శుభుడు. కేంద్ర కోణాధిపత్యము సింహమునకు ప్రాప్తించును. అపుడు కోణాధిపత్య పాపి యగుటను గన కేంద్ర కోణగతుడై శుభఫలముల నీయడు. స్వక్షేత్రములందున్న పాపఫల మధికమగును. ద్వితీయమందు గాని పాప స్థానములందుగాని స్థితినొందిన విశేష శుభఫలముల నీయగలడు. ఇట్లే తులా లగ్నమునకు కేంద్ర కోణాధిపత్యముగల శనిని గూడ ఫల విషయమున చూడవలెను.

కేంద్ర పాపాధిపత్యముగల కుజుడు కేంద్ర కోణగతుడై యోగప్రదు డగుచున్నాడుగాని ఈ కేంద్ర కోణములందు ఉచ్ఛ నొందరాదు. నీచయగుట అధిక శుభప్రదము. పాపస్థానములందుండి యోగింపడు. ద్వితీయ ఏకాదశములందు ధనమునకు శుభుడు. ఈవిధముగనే మేష, కర్కాటక, కుంభ లగ్నములకు శనిని చూడవలెను. పాపాధిపత్యము ప్రథమమును అనంతర కేంద్రాధిపత్యము ప్రాప్తించిన సహజ పాపగ్రహములు కోణ స్థితిచే శుభఫలములను, కేంద్ర స్థితిచే అత్యంత శుభఫలములను, పాప స్థాన స్థితిచే పాపఫలములు నిత్తురు. ఇట్లే సింహ, వృశ్చిక లగ్నములకు శనిని చూడవలెను. ఉభయ పాపాధిపత్యముల నొందిన పాపగ్రహములు పాపస్థానగతులై యోగప్రదులుగారు. అచట వీరు ఉచ్ఛ నొందుట అధిక పాపకారణము. కోణస్థితిచే అత్యంత శుభఫలములను, కేంద్ర స్థితిచే కొంత తక్కువ ఫలముల నివ్వగలరు. మీన లగ్నమునకు శనిని ఇట్లు చూడవలెను. కోణాధిపత్యము ప్రథమమును, అనంతర పాపాధిపత్యముగల కుజుడు ధనుర్లగ్నమునకు, శని కన్యాలగ్నమునకు కోణములందు గాని, పాపస్థానములందు గాని యుండి యోగ మివ్వరు. కేంద్ర స్థితిచే అల్ప రాజయోగ మొసగుచున్నారు. ధనుర్లగ్నమునకు కుజుడు షష్ఠాష్టమములందున్న కొంతవరకు రాజయోగ మొందును. కన్యాలగ్నమందున్న శని అతి స్వల్ప ఫలమును, దశమమందున్న ఎక్కువ యోగ మిచ్చుచున్నాడు. ప్రథమమున పాపాధి

పత్యము అనంతర. కోణాధిపత్యము శనికి మిథున లగ్నమునకు ప్రాప్తించును. ఇట్టి శని పాపస్థానములందుగాని, కోణములందు గాని స్థితినొందిన అవయోగము. కేంద్రగతుడైన కొంతవరకు రాజయోగము నివ్వగలడు. ధన కేంద్రాధిపత్యము కుజునకు తులకు, ధన కోణాధిపత్యము మీనమునకు కుజునకు ప్రాప్తించును. తులాలగ్నమునకు కుజుడు కేంద్రస్థితి నొంది అత్యంత రాజయోగ మిచ్చుచున్నాడు. కోణములందు కొంచెము తక్కువ. మకరమందు ఎక్కువ యోగ మివ్వడు. ద్వితీయ లాభములందున్న సామాన్యము. పాపస్థానగతుడైన పాపము. ఇట్లే మీనలగ్నమునకు కుజుని చూడవలెను. ధనుర్లగ్నమునకు శనికి ధన తృతీయాధిపత్యములు ప్రాప్తించును. ఇట్టి శని పాపస్థానములందు యోగ మివ్వక, కేంద్ర కోణములందున్న యోగప్రదుడగును. ఇట్లే మకరమునకు లగ్న ధనాధిపత్యము గలిగి కేంద్ర కోణము లందు యోగప్రదుడై, ద్వితీయమందు ధన మొసగును. పాప స్థానములందు యోగమివ్వక, వృశ్చికమందున్న సామాన్య ఫలము నిచ్చును.

శుభులకు ఉభయ కేంద్రాధిపత్యము, ఉభయ పాపాధిపత్యము, కోణ పాపాధిపత్యము, పాప కోణాధిపత్యము, ధన కోణాధిపత్యము, కోణ ధనాధిపత్యము, కేంద్ర కోణాధిపత్యము, కోణ కేంద్రాధిపత్యము, కేంద్ర పాపాధిపత్యము, పాప కేంద్రాధిపత్యము, ధనలాభాధిపత్యము, ధన కేంద్రాధిపత్యము ప్రాప్తించును.

బుధ గురులకు మిథున, కన్య, ధనుర్మీనములకు ఉభయ కేంద్రాధిపత్యము ప్రాప్తించును. ఇట్టి నైసర్గిక శుభులు పాపస్థానములందుండుట అత్యంత శుభము. కేంద్ర కోణము లందున్న అవయోగమని చెప్పబడియున్నను ఇది జరుగుట లేదు. స్వక్షేత్రములందున్న పాపఫలము లుండవు. ఇట్టి స్థితి మారకహేతువగును గాని యోగభంగముగాదు. కన్యాలగ్నమందు బుధుడు, ధనుర్లగ్నమందు గురుడు అధిక శుభముల నిచ్చుచున్నారు. ధనస్సునకు గురువు 6, 8, 12 అందు అందు విశేషించి 6 నందు అధిక రాజయోగ మిచ్చుచున్నాడు. వీరు కుజక్షేత్రములం దున్నను యోగము నిచ్చుచున్నారు. శుభులకు ఉభయ పాపాధిపత్యములు గురునకు, వృషభ, తుల, మకరములకు, బుధునకు మేష, కర్కాట, వృశ్చికములకు, శుక్రునకు ధనుర్మీనములకు ప్రాప్తించును. వీరి శుభత్వమందు సమత్వము లేనందున వీ రొసగు ఫలములు కూడ సమాన ప్రతిపత్తి నొందజాలవు. వీరు సామాన్యముగా కేంద్ర కోణములందున్న మంచి యోగ మిత్తురు. అందు కేంద్ర స్థితి ఉత్తమము. పాపస్థాన స్థితి నొంది అవయోగ మివ్వరు. ఇది మకర లగ్నమునకు ఉభయ పాపాధిపత్యము ప్రాప్తించిన గురునకు వర్తించదు. భాగ్య మందున్న గురువు అంత యోగప్రదుడు గాడు. గురు, బుధులు పాపస్థానగతులై యోగము నిచ్చుచున్నారు. నైసర్గిక శుభగ్రహము లలో కోణ పాపాధిపత్యము మేష సింహములకు గురునకు, తులా కుంభములకు బుధునకు, మిథునమునకు శుక్రునకు ప్రాప్తించును. ఇట్టి అధిపత్యములు గల శుభులు వీరు కేంద్ర కోణములలో ఎచట నున్నను యోగమిత్తురు. పాపస్థాన స్థితి అశుభము. సింహమునకు గురువు అష్టమ ద్వాదశములందున్న శుభ ఫలముల నీయును. మేష తులలకు గురు బుధులకు వ్యయాధిపత్య దోషములేదు. కుంభమునకు బుధుడు పాపస్థానములందు యోగించక అందు ఉచ్ఛనొందిన అత్యంత పాపఫలముల నిచ్చుచున్నాడు. పాప కోణాధిపత్యములు గురునకు, కర్కాటకమునకు బుధునకు మకరమునకు ప్రాప్తించును. వీరు కేంద్రములందున్న ఉత్తమ ఫలములను, కోణములందు సామాన్య ఫలముల నిత్తురు. పాపస్థాన స్థితిచే యోగప్రదులుగారు. కేంద్ర కోణాధిపత్యములు శుక్రునకు మాత్రము మకర కుంభములకు ప్రాప్తించుచున్నవి. మకరలగ్నమునకు ఉత్తరాధిపత్యము కేంద్ర మగును గాన పంచమమందు మాత్రము యోగించును. ఇతర కోణమందుగాని, కేంద్రములందుగాని యోగించడు. పాప స్థానములందు శుభుడు. అందు అష్టమమున అధిక ఫలదాత యగును. ద్వితీయ లాభములందు సామాన్య ఫలము. కుంభము నకు భాగ్య కోణమందు పాపస్థానములందుండి శుభఫలముల నివ్వగలడు. ద్వితీయ కోణాధిపత్యములు బుధునకు వృషభమునకు, గురునకు వృశ్చికమునకు, శుక్రునకు కన్యకు ప్రాప్తించును. ఈ స్థితిలో శుభులు ద్వితీయమందున్న అత్యంత శుభయోగ మివ్వగలరు. కేంద్ర కోణములందు శుభఫలములను, పాప స్థానములందు పాపఫలముల నిత్తురు. గురు, శుక్రులకు కేంద్ర స్థితి ఉత్తమ ఫలముల నిచ్చును. ద్వితీయ కేంద్రాధిపత్యము మేషమునకు శుక్రునికి ప్రాప్తించును. ఈ శుక్రుడు కేంద్రము లందున్న పాపము. ద్వితీయమందు అవ యోగ మొసగడు. కోణ స్థితికన్న పాపస్థానస్థితి శుభ ఫలప్రదము. ద్వితీయ లాభాధి పత్యము గురునకు కుంభమునకు, బుధునకు సింహమునకు ప్రాప్తించును. వీరు కేంద్ర కోణములందున్న రాజయోగము ప్రాప్తించును. పాపస్థాన స్థితి పాపఫలముల నిచ్చును. కుంభము నకు గురువు ధనమందుండుట శుభము. లాభస్థితి సామాన్యము. కేంద్ర పాపాధిపత్యము శుక్రునకు వృషభ, కర్కాట, తుల, వృశ్చిక ములకు ప్రాప్తించును. ఇట్టి శుక్రుడు వృశ్చికమునకు శుక్రుడు కేంద్ర కోణ స్థితిచే శుభఫలముల నివ్వడు. వృషభలగ్నమునకు శుక్రుడు తులాలగ్నముల కొసగు ఫలముల నీయును. కర్కాటకము నకు పాపస్థాన స్థితి నొంది శుభఫలముల నీయగలడు. అష్టమ మందు ఉత్తమ ఫలములను, వ్యయమందు అంతకన్న తక్కువ ఫలముల నీయును. ధనమందున్న సామాన్య ఫలము ప్రాప్తించును. పంచమమందు కొంత శుభము. భాగ్యమందు గాని కేంద్రములందు గాని స్థితినొందిన పాపఫలములు ప్రాప్తించును. తులాలగ్నమునకు [illegible]

ములందు రాజయోగ మిచ్చునా ద్వితీయ పంచమములందు సామాన్య ఫలముల నివ్వగలడు. పాపస్థాన, భాగ్యస్థాన స్థితిచే పాపఫలముల ప్రాప్తించును. పాప కేంద్రాధిపత్యము సింహ లగ్నమునకు ప్రాప్తించిన శుక్రుడు కేంద్ర కోణములందు అశుభుడు. అందు దశమస్థితి అత్యంత పాపము. పాపస్థానము లందు శుభఫలము నీయును. తృతీయ స్థితి సామాన్యము.

రవి చంద్రుల విషయమందు పై చెప్పబడిన విధముగా చూచుకొనవలెను. మేషమునకు రవి తృతీయ లాభవ్యయము లందు, ధనస్సునకు షష్ఠాష్టమములందు అధిక ఫలముల నిచ్చును. మేషమునకు కేంద్రములందుగాని, పంచమమందు గాని స్థితినొంది అశుభఫలములనిచ్చును. కన్యకు, రవి, చంద్రులు కేంద్రగతులై శుభఫలముల నీయగలరు. ఏ రిద్దరూ కేంద్రము లందు కలియరాదు. పాపస్థానములందు కలిసిన అత్యంత శుభము. మిథునమునకు రవి కేంద్ర కోణములందున్న శుభము. మీనమునకు సప్తమస్థితి రవికి సామాన్యము. ఇతర కేంద్ర స్థితి శుభము. పాపస్థాన స్థితి నొందిన యోగ మివ్వడు. సింహము నకు రవికి ప్రాప్తించు కోణాధిపత్య పాపము స్వక్షేత్రముగాన లగ్నము తప్ప ఇతర కేంద్రకోణములందు శుభుడు. పాపస్థాన స్థితి పాపము. శుభ చంద్రుడు కేంద్రాధిపత్యము నొంది పాపి యగును. క్షీణ చంద్రుడు పాపాధిపత్యముచే పాపియగును. శుభ చంద్రుని బుధుని వలె, క్షీణ చంద్రుని కుజునివలె చూచుకొన వలెను. మేష, కర్కాటక, తుల, మకరములకు పూర్ణచంద్రుడు కేంద్ర కోణములందు యోగించడు. పాపస్థాన స్థితి శుభము. సింహమునకు పూర్ణుడైన చంద్రుడు కేంద్రకోణగతుడై రాజ యోగప్రదుడగును. మిథునమునకు ద్వితీయాధిపతియై కేంద్ర కోణములందున్న ఫలప్రదుడు. పాపస్థానములందు యోగ మివ్వడు. సింహమునకు వ్యయాధిపత్యము నొంది కేంద్ర కోణములందున్న యోగమిచ్చును. వృషభమునకు కేంద్రస్థితి నొంది శుభఫలముల నీయగలడు. ద్వితీయ స్థితి సామాన్య ఫలమిచ్చును. ధనస్సునకు అష్టమాధిపతియై కేంద్ర కోణములందుండి శుభఫలముల నీయగలడు. ద్వాదశ స్థితి కూడ మంచిది. కుంభమునకు షష్ఠాధిపతియై కేంద్రస్థితి నొంది యోగమిచ్చును. పాపస్థానములందున్న అవ యోగమని భావింప వలెను.

## అధియోగములు

అధియోగములకు కారకులైన గ్రహములు పై చెప్ప బడిన స్థితి ఫలముల నతిక్రమించి శుభాశుభ ఫలముల నొసగ గలరు. సామాన్యముగా లభించు జ్యోతిష గ్రంథములందు చెప్పబడిన అధియోగములకు సంబంధము తెల్పుచూ, లభింపని గ్రంథములందు చెప్పబడిన శ్లోకముల ఇందు చెప్పుచున్నాను. పంచమహాపురుషయోగములు, చంద్రయోగములు ఆంధ్ర పత్రికయందు లోగడ వివరముగా చెప్పియున్నందున ఇచట మరల చెప్పుటలేదు.

1. చంద్రాధి యోగము :

సౌమ్యైః స్స్మరారినిధనేష్వధియోగ ఇందోస్తస్మింశ్చ
మూప సచివక్షితిపాలజన్మ
సంపద్విలాస విభవాహత శత్రవశ్చ దీర్ఘాయుషో
విగతరోగ భయాశ్చ జాతః

చంద్రాత్తు 6, 7, 8 స్థానములందు శుభులున్న అఖండ శుభఫలముల నొంది శత్రురోగాది భయములేక దీర్ఘాయుర్దాయ వంతు లగుదురు.

ద్యూనం షష్ఠమథాష్టమం శశిగృహాత్ ప్రాప్తా సమస్తాశ్శుభాః క్రూరాణాం యది గోచరేషు రహితాః సూర్యాంశుయా తా రతః భూపాలః ప్రభవేత్సుమంత్రి బలధీర్యేషాం తదోత్పత్తిః సేనామత్త కరీంద్ర దానసలిలం భృంగైర్యుతాః హాః పీయతే. ఆమిత్రం జామిత్రం విధనమథవా శీతరుచితో గిరాప్పురే సామ్యాస్తు మహాజన వేదముర్వరసఖ్యః ఘుమ్మితేనాపేకం గతవతి నిషిద్రాకు పయసో ప్రరాపాస్సి కృత్య త్వలతి హ్యాటతో కల్పను భృశమ్ము మాండవ్య వచనము.

కృతకీర్తి—విధనంద్యూనం షష్ఠం చంద్రస్థానో ద్వ్యాయుతై
ర్వ్యక్తం
అధియోగః ప్రసిద్ధో వ్యాసకృతో సప్తధాపూర్వైః ||

6, 7, 8 స్థానములందు గాని ఏ రెంటియందుగాని లేక ఏ ఒక స్థానమందు గాని శుభులున్న ఈ అధియోగము ప్రాప్తించును.

బాదరాయణ పరాశరులు—

షట్ సప్తమాష్ట సంస్థైశ్చంద్రా త్సౌమ్యైః
శుభో2ధియోగః స్యాత్
పాపః పాపైరేవం మిశ్రై ర్మిశ్రస్తు నైవోక్తః

ఈ శుభులు అధికబలులైన, మధ్యమ బలులైన, సామాన్యబలులైన క్రమముగా జాతకులు రాజయోగ, అమాత్య యోగ, సేనాధిపత్యయోగ మనుభవింతురు.

ఫలదీపిక—6 అధ్యాయము—42, 43 శ్లోకములు.

ఉత్తర కాలామృతము—చతుర్థగ్రహ భావ ఫలఖండము —66 శ్లోకము.

2. లగ్నాధియోగము—

షట్ సప్తాష్టమ సంస్థై ర్లగ్నాత్సౌమ్యైరపాప
దృష్టియుతైః
లగ్నాధియోగ మేతత్ప్రాహుః సుఖవర్ధనో భవతి.

లగ్నాత్తు 6, 7, 8 లందు పాప సంబంధములేని శుభు లుండిన లగ్నాధియోగము ప్రాప్తించును. అందు పాపు లుండిన జాతకునకు ఏ సుఖము లుండవు.

జాతక పారిజాతము— అధ్యాయము 7— శ్లోకములు 114, 115.

లగ్నాధి యోగా జాతా మంత్రి పృతనాపతిర్ధరాస్వామీ
బహుదారా న్వితో దీర్ఘాయుర్గతనాన శత్రుగణః

లగ్నాధియోగమందు జన్మించిన జాతకులు ఆచార్య పదవినిగాని, సేనానాయకత్వములోగాని, మండలాధిపత్యమును గాని పొందగలరు. అనేక భార్యలు గలిగి సుగుణవంతులై శత్రు పీడ లేక సుఖింతురు.

సారావళి - 34 అధ్యాయము— 13 శ్లోకము.

35 అధ్యాయము—21 శ్లోకము, 22 శ్లోకము.

3. ఉపచయ శుభస్థితి యోగము:— వసుమంత యోగము.

లగ్నాదతీవ వసుమాన్వసుమాంశ్చశంకే సౌమ్య
గ్రహై రుపచయోపగతైః సమస్తైః ।
ద్వాభ్యాం సమోల్ప వసుమాంశ్చ తదూనతాయా
మన్యేష్వపి సత్స్వపిఫలేష్విద ముత్కటేన.

జన్మలగ్నమునకు శుభులు 3, 6, 10, 11 అగు ఉపచయస్థితి నొందిన ధనవంతు డగును. ఇది చంద్ర లగ్నాత్తు వర్తించును. రెండు శుభగ్రహములు ఉపచయములందున్న సామాన్య ధనవంతుడు. ఒక శుభగ్రహమున్న స్వల్ప ధనవంతుడు.

సారావళి—35 అధ్యాయము— 67 శ్లోకము.

13 అధ్యాయము—32 శ్లోకము.

జాతక పారిజాతము—7 అధ్యాయము—11 శ్లోకము ఇందు కొంచెము మార్పున్నది. శుభులు ఉపచయములందుండి పాపులు లగ్న దశమ కేంద్రగతులైన క్రూరుడగు రాజగునని యున్నది.

జాతక పారిజాత వ్రాత ప్రతియందు "సర్వేచోపచయ స్థితాః శుభఖగాః నిమ్నా విలగ్నస్థితాః". పాపులు ఉపచయము లందుండి, శుభులు లగ్న దశమస్థానగతులైన క్రూరుడగు రాజగును. గాన పాపులు 3, 6, 11 లందుండవలెనని భావము.

మాండవ్య జాతకమందు—

సకల నిమ్న్య ఖగాశ్చ వివోచ్చగాస్తు సుధనాత్ కుజ
నిభ్య గతామనాః
అరి పరాక్రమ లాభగతాః ఖలో విజయతే జగతిం
పరమాయుషః

ఈ భావమును సారా: 35 అధ్యాయ 16 శ్లోకమందు చెప్పబడిన హంసయుతో సమన్వయము చేసిన యథార్థస్థితి వెరుగగును.

కరో త్యర్థక్రో బృద్ధినక్ర ధవళాభీశు సహితః
స్థితస్తు బృగ్రూపం సకల నయనానంద జననః
అపూర్వోఽయం నృప్రాయ్య నయన జలః కోఽపి
నతతం
దిప్రస్తే శోకాగ్నిర్జ్వలతి హృదయేఽతీవ సుతరామ్

పై ప్రకారము ఉపచయములందు శుభులుండి లగ్నమున రవి చంద్రులుండిరేని సకల జనుల నానందింపజేయు నట్టియు, శత్రువుల నశింపజేయునట్టియు రాజగును. ఫల దీపిక అధ్యాయము 6 శ్లోకములు 19, 20.

4. స్వక్షేత్రగ్రహ ప్రాప్తి యోగము—

కుల సమకుల ముఖ్య బంధుపూజ్యా ధని సుఖి భోగి
నృపాస్త్వ ఏక వృద్ధ్యా
పర విభవ సుహృత్సు బంధుపోష్యా, గణప బలేశ
నృపాశ్చ మిత్రభేషు.

జన్మకాలమున స్వక్షేత్రమందు ఒక గ్రహమున్న స్వకుల జనులతో సమానుడు, రెండున్న స్వకుల ముఖ్యుడు, మూడున్న బంధుపూజ్యుడు, నాల్గున్న ధనవంతుడు, అయిదున్న సుఖి ఆరున్న రాజభోగి, ఏడున్న భూపాలుడు. అట్లే మిత్ర క్షేత్రము లందు ఒక గ్రహమున్న పరధన జీవనుడు, రెండున్న స్నేహితుల మూలకముగ జీవించును, మూడున్న జ్ఞాతి జనులచే పోషింప బడును, నాల్గున్న బంధుపోషక వర్గమందుండును, ఐదున్న సమూహాధిపతి, ఆరున్న సేనాపతి, ఏడున్న రాజు.

జాతక పారిజాతము—8 వ అధ్యాయము—106 వ శ్లోకము. ఇందలి 105 వ శ్లోకము భావము వివిధ గ్రహ స్వక్షేత్రస్థిత ఫలముల తెలుపుచున్నది. మిత్రక్షేత్ర స్థితఫలము 107, 108, 109, 110 శ్లోకములందు చెప్పబడియున్నది.

మానసాగరీ పద్ధతి:—

స్వగృహాస్థే రవౌ లోకే మహోగ్రశ్చ పదోద్యమీ
చంద్రే కర్మరతః సాధుర్మాన్యో రూపవానపి
స్వగృహాస్థే కుజే . . . చపలో ధనవానపి
బుధోనాథ కథాభిజ్ఞః పీడితో ధనవానపి.
దనీకాన్తః కృతజ్ఞశ్చ సదేవ్యః స్వగృహే గురౌ
స్త్రీరతః కృషివః శుక్రే శనేమాన్యః సులోచనః

సారావళి—35 అధ్యాయము—38 శ్లోకము. ఇచట అన్తంగత్వ దోష ముండరాదని చెప్పియున్నారు. ఇదే భావము కొంతవరకు 44 వ శ్లోకమందున్నది. 44 అధ్యాయ 32 వ శ్లోకము మొదలు 38 వ శ్లోకము వరకు వివరములు చెప్పబడి యున్నవి.

ఉత్తర కాలామృతం—చతుర్థఖండ 41 వ శ్లోకమందు కొంతవరకు చెప్పబడి యున్నది.

5. ఉచ్ఛక్షేత్రస్థిత యోగము :—

జనయతి నృపమేకోఽప్యుచ్ఛ గోమిత్ర దృష్టః
ప్రచుర ధన సమేతం మిత్రయోగాచ్చ సిద్ధిం.

లగ్నమందు గ్రహమువుచ్ఛ నొంది మిత్రగ్రహముల దృష్టి నొందిన ప్రజానాయకుడుగాని, రాజుగాని యగును.

జాతకతత్త్వమందు మహాదేవుడు—"ఏకోఽప్యుచ్ఛగోమిత్ర దృష్టో భూపతిః" యని, "ఏకస్మిన్ వ్యుచ్ఛేఽక్షే సమిత్రే ప్రచుర ధనః సిద్ధిః" యని చెప్పియున్నాడు.

ఇందు లగ్నమందు ఉచ్ఛగ్రహమునుండి నైసర్గిక మిత్ర దృష్టి నొందుట ప్రధానము. తాత్కాలిక మిత్రదృష్టి ఫల మీయదని భావము. ఇందు ఉచ్ఛనొందిన చంద్రుని రవి, కుజ, బుధులు వీక్షించిన శుభఫల మెంతవరకు ప్రాప్తించునను విషయము సందేహ మున్నది. ఈ యోగము కుజ డుచ్ఛనొంది కర్కట రవిని, గురు డుచ్ఛనొంది మకర రవిని, శని ఉచ్ఛనొంది మేష రవిని వీక్షించినపుడు రవికి మిత్రగ్రహ యుతి గలిగిన ప్రజా నాయకత్వముగాని రాజపదవిగాని ప్రాప్తించును. గని, వీరు దీర్ఘ వ్యాధులకు గురియగుదురని యభిప్రాయ మున్నది.

జాతక పారిజాతమందు "ఏకేస్మిన్ పరమోచ్ఛ గేఽతి సుహృదో దృష్టే యదిక్ష్మాపతిః" యని చెప్పబడినది. అధ్యాయము 7 శ్లోకము—10.

రవ్యాది గ్రహములు ఉచ్ఛ నొందిన ప్రాప్తించు ఫలములు జాతక పారిజాతమందు 8 అధ్యాయమున 100, 101 వ శ్లోకమందు చెప్పబడియున్నవి. 102, 103 వ శ్లోకములందు 1 నుండి 5 గ్రహములు ఉచ్ఛనొందిన ప్రాప్తించు ఫలములు చెప్పబడి యున్నవి.

కాల ప్రకాశిక :—

సూర్యేస్వోచ్ఛ గతే జాతః సేనాపత్య మవాప్నుయాత్
సోమేస్వోచ్ఛ గతేజాతో ధనధాన్యాది సంభవేత్
భౌమేం స్వోచ్ఛగతే జాతో మనేరాజా భవిష్యతి
విద్యే స్వోచ్ఛగతే జాతో రాజ్యశ్రియ మవాప్నుయాత్
గురౌ స్వోచ్ఛగతే జాతో ధనీ, రాజ్యాధి పోభవేత్
శుక్రే స్వోచ్ఛగతే జాతో రాజశ్రియ మవాప్నుయాత్
శనౌ స్వోచ్ఛగతే జాతో రాజ్యాధిప పయోభవేత్.

ఫలదీపిక—7 వ అధ్యాయము 21 శ్లోకము, 9 అధ్యాయము 14 శ్లోకము.

మానసాగరీ పద్ధతియందు :—

ధీరః ప్రచండ కుశలో గారః శూరః కలానిధిశ్చతురః
దండపతిర్ధనయుక్తః ఉచ్ఛస్థే భాస్కరః కురుతే
విజ్ఞానధన సమేతో పాత్ర సమ్రతంచ కామినీ విరహీ
బహు జనతా జనవల్లభ ఉచ్ఛస్తే హిమకరః కురుతే.
ఉగ్ర ధృఢప్రహారం క్రూరం శస్త్రం పఠన బహు విదితం
నృపకుల వల్లభ శూరో ఉచ్ఛస్థో భూసుతః కురుతే
విత్తో బుద్ధిబలిష్టో మంత్ర రక్షః క్రియాలసో నిరః
అతిమతి విభవో జాతో పాపవిముక్తశ్చ ఉచ్ఛగః శశిజః
స్వాదః శుభయుక్తః సుందర వదనాశ్చ మండలో ముదితః
బహుభృత్యో భూభుజానాం చ సురమంత్రి ఉచ్ఛ గోయస్య.
దేవజ్ఞావ్ కుశలో యంత్రతంత్రే చ గాయకః కవిః
కవ లావివాకులాపి దైత్య గురు రుచ్ఛః కురుతే
సుప్రక్కారాత్మక వృత్తి ర్విఖ్యాత సకల వాహనా శూరః
మంత్రి పాపస ధైర్యోపాయాపి ఉచ్ఛః శనిః.

6. అమలయోగము:—

యస్య జన్మ సమయే శశి లగ్నా పత్ర్గ్రహాయది చ జన్మని సంస్థః
తస్య కీర్తి రమలో భువిరక్షీ దాముషాంత మవినాశన సంతత్
లగ్నాద్వా చంద్రలగ్నాద్వా దశమే శుభసంయుతే
యోగాయ మమలావామ కీర్తిరా చంద్రతారకే.

జాతకుల జననకాలమందు లగ్నమునుండి గాని, చంద్రుని నుండి గాని, దశమస్థానమును శుభగ్రహములున్న అట్టి వాని నిరుపమానకీర్తి ఆచంద్రార్క మగును. ఈ జాతకుడు అఖండ సంపద ననుభవించును.

ఫలదీపిక—6 అధ్యాయము—19, 20 శ్లోకములు.

7. మహాభాగ్య యోగము :—

పుం నక్షత్రే దివాపుంసాం పుంచే లగ్నార్క చంద్రకే
మహాభాగ్య ఇతిఖ్యాతో యోగః స్త్రీణాం విపర్యయః

పురుషులు పగటివేళయందు పురుష నక్షత్రమునందు లగ్న మొందునపుడు లగ్న, రవి, చంద్రులు బేసిరాసులందున్న మహాభాగ్య యోగము ప్రాప్తించును. స్త్రీలు స్త్రీ నక్షత్రములందు రాత్రులందు జనన మొందిగా లగ్న, రవి, చంద్రులు సమరాసులం దుండవలెను.

ఫలదీపిక—అధ్యాయము 6—14, 15 శ్లోకములు.

కాల విధానము—

హస్తాదిత్య శ్రవణ మధిజిత్ర్య మైత్రాశ్విసికస్
పున్నామై త స్సవక మథ చ ప్రోష్ఠ పాదద్వయంచ

మూలం దివ్యం శతభిషగితి స్త్రీతి వా పుంసకాని
శేషాస్సర్వే ప్యభిజిదితో యోషితో జ్యోతిషజ్ఞైః.

హస్త, పునర్వసు, శ్రవణ, అభిజిత్తు, పుష్యమి, అనూరాధ అశ్విని, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర పురుష నక్షత్రములు. మూల మృగశిర శతభిషము నపుంసక నక్షత్రములు. మిగిలినవి స్త్రీ నక్షత్రములని గ్రహింపవలెను.

మహాభాగ్యే భవేజ్జాతో నృపతిశ్రేష్ఠ సమృద్ధిమాన్
సుత విత్తయుతో భోగీ దీర్ఘాయుః పండితో జయీ.

మహాభాగ్య యోగమందు జనన మొందినవారు రాజ పూజితులు, ధనవంతులు, పుత్రమిత్రవంతులు, భోగులు, దీర్ఘాయువు గలిగి, విద్యావంతులై జయము నొందగలరు.

8. నీచభంగ రాజయోగమును గురించి ఆంధ్రపత్రిక యందు చెప్పియున్నందున మరల చెప్పుటలేదు.

9. పర్వతయోగము :—

ఉదయాస్త కర్మహి బుకే గ్రహయుక్తైః శుభైర్ధనే శ్చద్యే
యః కశ్చిన్నవమగతో యోగోఽయం పర్వతోనామ.
పర్వతయోగే జాతో భూపాలో ధర్మవాన్ వినీతశ్చ
గ్రామ పురనగర కర్తా లోకే శ్రుతవాక్య గాస్త కీర్తిః స్యాత్.

శుభులు కేంద్రగతులు కాగా, భాగ్యకోణమందు గ్రహ మునుండి షష్ఠాష్టమములు గ్రహ వర్జితములైన పర్వత యోగము ప్రాప్తించును. ఈ యోగ జాతకులు న్యాయమార్గ మవలంబించు రాజులై, పట్టణ, గ్రామాభివృద్ధి చేసి ప్రఖ్యాతి నొందగలరు.

జాతక పారిజాత 7 వ అధ్యాయమందు 128, 129 శ్లోకములలో చెప్పబడిన పర్వత యోగమందు కొంత మార్పున్నది. షష్ఠాష్టమములందు శుభగ్రహము లుండవచ్చునని, లగ్న ద్వాదశాధిపతులు పరస్పర కేంద్రగతులై మిత్రదృష్టి నొందవలెనని చెప్పబడినది. ఫల మందుకూడ వ్యత్యాస మున్నది
యవనులు :—

లగ్నాన్త వేమారణగః ప్రశస్తాః సర్వేగ్రహేంద్రా ఇహ బేదపాలాః
తం పర్వతం విద్ధి బలాధికానాం మహీపతీనాం ప్రసవాయయోగే.

పై చెప్పబడినది రాజయోగమని, జాతక పారిజాత మందు చెప్పబడినది సామాన్య యోగమని భావింపవలెను.

ఈ యోగము ఈ క్రింది విధముల ప్రాప్తించును :—

కేంద్రమందు శుభులుండగా 6, 8 స్థానములందు గ్రహములు లేకున్నను, శుభు లున్నను భూపాలయోగము. శుభులు 6 స్థానములందుండుట సంభవింపదు. గాన కేంద్రమందు శుభులున్న 6, 8 లందుండరాదు. ఇది భూపాల యోగము.

కేంద్రములందు శుభులు, భాగ్యమందు ఒక గ్రహమున్నను భూపాలయోగము ప్రాప్తించును.

లగ్న ద్వాదశాధిపతులు పరస్పర కేంద్రగతులైన గ్రామాధిపత్యముగాని, పట్టణాధిపత్యముగాని ప్రాప్తించును. ఇది సామాన్య యోగము.

లగ్నాధిపతియున్న స్థానాధిపతి స్వోచ్ఛ నొందిన, లేక స్వక్షేత్రమందున్న, అట్టి స్థానములు కేంద్ర కోణములైన పర్వతయోగము (ఫలదీపిక—6 అధ్యాయము—35 శ్లోకము.) ఇట్టి జాతకులు శాశ్వత కీర్తిమంతులై సమస్త భోగముల ననుభవించు రాజు లగుదురు.

10. పుష్కలయోగము :—

అధి మిత్రగృహే కేంద్రే జన్మాధిపతి ర్విలగ్నపతి యుక్తః
పశ్యతి బల సంపూర్ణో లగ్నం స్యాత్పుష్కలో యోగః.

చంద్ర లగ్నాధిపతికి కేంద్రములలో నొకటి యధిమిత్ర స్థానమై అందు ఆ లగ్నాధిపతి, జన్మకాల లగ్నాధిపతితో జేరి బలియుడై అధి మిత్రస్థానమగు కేంద్రమునుండి లగ్నమును చూచిన పుష్కల యోగము ప్రాప్తించును.

పుష్కలయోగే పుంసా జాయంతే భూమి పాలకానిత్యం
సుచిరం భ్రమంతి హరిపు గజ మదగంధేన వాసిత దిగంతః.

ఈ యోగ జాతకుడు భూముల సంరక్షించును. రాజ వంశజుడైన శత్రుహింసచేయు రాజగును.

ఫలదీపిక— 6 అధ్యాయము— 19, 20 శ్లోకములు.

రెండవ పద్ధతిని లగ్నాధిపతి చంద్రయుతి నొంది, చంద్ర లగ్నాధిపతి అధి మిత్రక్షేత్రమందుగాని, కేంద్రమందుగాని యుండి లగ్నమును వీక్షింపవలెను. లగ్నమందు బలియుడగు శుభగ్రహ ముండవలెను. అట్టి జాతకుడు రాజగును. కుంభ లగ్నమందు గురుడు, చతుర్థమున శని చంద్రులు (లగ్నాధిపతి ఉచ్ఛ చంద్రునితో యుతి), సప్తమమందు శుక్రుడు (చంద్ర లగ్నాధిపతికి లగ్న వీక్షణ), రవి కర్కాటమందున్న ఈ యోగము ప్రాప్తించును. ఇది అధిక శుభప్రదమగు యోగము.

11. శంఖయోగము :—

కేంద్ర త్రికోణగాః సర్వే తిష్ఠంతి యదిఖేచరాః
యః కశ్చిత్ స్వోచ్ఛరాశి స్థోయోగః సాఖ్యాంచ శంఖితః

గ్రహములన్నియు కేంద్రకోణ గతులై అందు ఒకరు ఉచ్ఛనొందిన శంఖయోగము ప్రాప్తించును.

శంఖయోగోద్భవే మర్త్యః రాజావా తత్సమోపివా
దేవతావద్యోగయుక్తో దానే వ్రత సమోభవేత్.

ఇట్టి జాతకులు రాజులుగాని, రాజతుల్యులుగాని యగుదురు. దేవతలవలె భోగము లనుభవింతురు. రాజులవలె దాన ధర్మముల చేయుగలరు.

ఈ యోగము కొంత మార్పుతో జాతపారిజాతమున 7 వ అధ్యాయమందు 138, 139 శ్లోకములలో చెప్పబడి యున్నది. ఫలదీపికయందు 6 వ అధ్యాయమున 37, 38 శ్లోకములందు చెప్పబడినది. ఇందుకూడ కొంత మార్పు గలదు.

కేంద్ర కోణాధిపతులు శుభస్థానగతులైన శంఖయోగమని, అట్టి జాతకులు సర్వ భోగముల ననుభవింపగలరని మంత్రేశ్వర మతము. పంచమ షష్ఠాధిపతులు పరస్పర కేంద్రములందుండగా లగ్నాధిపతి బలవంతుడయ్యెనేని శంఖయోగమని భావము. లగ్నాధిపతిగాని, రాజ్యాధిపతిగాని చరభావమందుండగా భాగ్యాధిపతి బలవంతుడైనను శంఖయోగము ప్రాప్తించునని మరియొకయభిప్రాయము. ఈ యోగ జాతకులు సర్వ శుభముల ననుభవించుచూ 81 సంవత్సరములు జీవింపగలరు.

12. లక్ష్మీయోగము :-

శశి మంగళ సంయోగే యస్య జన్మని విద్యతే
విముంచతి న తం లక్ష్మీ లజ్జా కులవధూమివ.

ఏ జాతకునకు కుజ చంద్రులు యుతి నొందుదురో అతనిని లక్ష్మీదేవి విడువదు.

పరమోచ్ఛ గతే కేంద్రే భాగ్యనాథేఽభివీక్షితే
లగ్నాధిపే బలాఢ్యే లక్ష్మీయోగ ఇతీరితః.

భాగ్యాధిపతి కేంద్రమందు పరమోచ్ఛ నొంది, శుభవీక్షణ నొందుచుండగా లగ్నాధిపతి బలవంతుడైన లక్ష్మీయోగము ప్రాప్తించును.

జాతక పారిజాతము— 7 అధ్యాయము— 152, 153 శ్లోకములు.

ఫలదీపిక— 6 అధ్యాయము— 21, 24 శ్లోకములు.

ఇందు భాగ్యాధిపతి, శుక్రుడు కేంద్ర లేక కోణములందు తమ స్వక్షేత్రమందు గాని, ఉచ్ఛయందుగాని యుండవలెనని చెప్పబడి యున్నది. ఇవిగాక,

1, 9 అధిపతులకు సంబంధమున్నను, భాగ్యాధిపతి కేంద్ర కోణగతుడై ఉచ్ఛనొంది శుభగ్రహ వీక్షణ నొందినను, శుక్రుడు వర్గోత్తముడై భాగ్యమందు ఉచ్ఛనొందిన నేక గ్రహయుతుడైనను లేదా ఉచ్ఛగ్రహము 3 నందున్నను లక్ష్మీయోగము ప్రాప్తించును.

13. చామరయోగము—

పూర్వపక్షే దివాజన్మ లగ్నేశే స్వోచ్ఛ భంగతే
ధన కేంద్రగతే జీవే యోగశ్చామర సంజ్ఞకః.
యోగేస్మిన్ చామరే జాతో దీర్ఘాయు ర్ధర్మవాన్ సుధీః
బహు దేశాధినాథః స్యాద్ధర్మిష్ఠో వేదపారగః.

శుక్లపక్షమందు పగటివేళ జననమొంది, లగ్నాధిపతి ఉచ్ఛనొందగా, గురువు ద్వితీయమందుగాని, కేంద్రమందుగాని, స్థితి నొందిన చామరయోగము ప్రాప్తించును. ఇట్టి జాతకులు దీర్ఘాయువు గలిగి శుభకృత్యముల చేయుచూ సర్వ సుఖముల ననుభవించు దేశాధిపాలకులగుదురు. వీరు పండితులు.

జాతక పారిజాతము—7 అధ్యాయము—136 శ్లోకము ఇందు లగ్నాధిపతి కేంద్రమందు ఉచ్ఛనొంది గురువీక్షణ నొందుట, ఏదో ఒక కేంద్రమందు ఇద్దరు శుభులుండుట. ఫలమందు కూడ వ్యత్యాస మున్నది.

14. వర్గోత్తమ గ్రహయోగము :—

వర్గోత్తమగతే చంద్రే లగ్నేవా చతురాదిభిః
గ్రహై ర్నిరీక్షితే యస్మిన్ జాతో నరపతి ర్భవేత్.

చంద్రుడుగాని, లగ్నముగాని వర్గోత్తముడై నాల్గుగాని అంతకన్న ఎక్కువగాని గ్రహములచే వీక్షింపబడిన ఈ యోగము ప్రాప్తించును. ఇట్టి జాతకులు రాజయోగ మనుభవింతురు.

సారావళి—35 అధ్యాయము—11 శ్లోకము. ఇందు కొంత మార్పున్నది. ఇవి 44 యోగములు.

బృహజ్జాతకము—11 అధ్యాయము—3 శ్లోకము.

జాతక పారిజాతము— 7 అధ్యాయము— 5 శ్లోకము,

జాతకాభరణము :—

వర్గోత్తమేఽమృతకరే యదివా శరీరే సంవీక్షితే చతురాదిభి రిందుహీనైః
ద్వా వింశతి ప్రమితయః ఖలు సంభవంతి
యోగాః సముద్ర వలయక్షితి పాలకానామ్.

మాండవ్యుడు :—

విలగ్నభవనం గతే బలయుతే వర్గోత్తమే
(1 పాదమున్నది)

చతుః ప్రభృతిభిర్గ్రహైః శశినివాన మాలోకితే
న సంభవతి పార్థివః ఖలు కృపాణపాణిర్నరో
కదా చిదపి వీక్షితే ర్భుజగో న యస్యాననం.

బృహద్యవన జాతకము :—

లగ్నే వర్గోత్తమాంశస్థే దృశ్యమానే సమస్తైః
చతుర్భిః పంచభిః షడ్భిరపి చే ద్విద్వి వింశతిః.
చంద్రే చ తాదృశే చైవం రాజయోగాన్ సమాసతః
జానీహి భో నిస్య చతుశ్చత్వారింశ దుదంచతే.
వక్ష్యామి లగ్నయోగేషు వంశజః స్యాత్తదాస్యద
చంద్రః పశ్య తాకారం న ప్రత్యక్షేణ గణ్యతే.

15. భాస్కరయోగము— జాతక పారిజాతము— 7 అధ్యాయము—67 శ్లోకము.

# శబ్దమయ ప్రపంచం-2

శ్రీ జాఁ పోల్ సార్త్రె

లైబ్రరీలో ఫ్రెంచి గ్రంథాలు ఉన్నాయి. జర్మన్ గ్రంథాలు ఉన్నాయి. అన్నీ ఉద్గ్రంథాలు. క్లాసిక్కులు. ఇవికాకకొన్ని గ్రామర్లుకూడా ఉన్నాయి. కొన్ని నవలలు ఉన్నాయి. ప్రసిద్ధమైనవి. మొపాసాగారి కథలు సంకలనం చేశారు. కూంత్ పోక్ట్రె అని. అది ఉంది. శిల్ప కళకు సంబంధించిన గ్రంథాలు ఉన్నాయి. రూబెన్స్; వాన్‌డైక్; డ్యూరేర్; రేంబ్రాండ్ట్; ఇట్లా. ఇవి మా తాతయ్యవి. ఆయనకు శిష్యులు బహూకరించినవి. ఒక్క ఉగాది రోజున ఇచ్చారట. ఇదో చిన్న ప్రపంచం. లింగజగత్తు వంటిది. నాకు ఇది పట్టలేదు. ఈ లైబ్రరీలో 'గ్రా లారూస్' ఉంది. పెద్ద నిఘంటువు. అది సమస్త ఆక్రమించుకుంది. నాకు సర్వమూ అదే అయింది. ఇంకోటి పట్టలేదు. పట్టనివ్వలేదు. లైబ్రరీలో "డెస్క్" ఉంది. దాని వెనుక 'షెల్ఫ్'లు ఉన్నాయి. చివరి 'షెల్ఫ్'కు క్రిందుగా వున్న 'షెల్ఫ్'లో ఈ "గ్రా లారూస్" సంపుటాలు ఉన్నాయి. నేను అట్లాపోయి, వాటిల్లో ఒక సంపుటాన్ని చూచి చూడనట్లు ఎత్తుకుంటాను. చేతికి అందినదాన్ని ఎత్తుకుంటాను. ఆ సంపుటాంకం - A-BELLO: BELLOC - CH: CI-D; MELE-PO: PR-Z ఇట్లాగుర్తులు. ఈరకంగా అక్షరలకూడిక నాకు ఏమోఅనిపించేది. అవి అన్నీ నామవాచకా లనుకునేవాణ్ణి. మానవుని విజ్ఞానసంపున్నదా, అవిజ్ఞానాన్ని విడమరిచి చెప్పే క్షేత్రాలు అనుకునేవాణ్ణి. అంటులో CI - D క్షేత్రము, PR - Z క్షేత్రము; ఉన్నాయి కాబోలు. ఆ క్షేత్రాల చెట్లు ఆ క్షేత్రాలకు, ఆ క్షేత్రాలు పూలు ఆ క్షేత్రాలకు; ఆ క్షేత్రాల తరులతాగుల్మాదులు ఆ క్షేత్రాలకు; ఆ క్షేత్రాల తనుంత సంతాన విశేషాలు ఆ క్షేత్రాలకు ఉన్నాయి కాబోలు. వాటి పట్టణాలు వాటికి ఉన్నాయికాబోలు. ఆ క్షేత్రాలలో గూడా మహాపురుషులు ఉన్నారు కాబోలు. వారి యుద్ధాలు వారు చేసుకుంటూ ఉంటారు—కాబోలు. అనుకునేవాణ్ణి. మా తాతయ్య బల్ల ఉంది. ఆ బల్లమీద ఆ సంపుటాలను పెట్టుకునేవాణ్ణి. తెరిచేవాణ్ణి. ఈ సంపుటాలలో అసలైన పక్షులు ఉన్నాయా? వాటి గూడులకోసం వెదికేవాణ్ణి. అసలైన సీతాకోక చిలుకలను వెంటబడి తరిమేవాణ్ణి. అవి ఏవి సీతాకోక చిలుకలు! అచ్చమైన సీతాకోక చిలుకలు. అసలైన పూవులమీద వాలి ఉండేవి. ఆ సంపుటాలలో మనుష్యులూ ఉండేవాళ్లు; జంతువులూ ఉండేవి. [illegible] ఉన్నట్లు ఆ మనుష్యులు ఉండేవాళ్లు; ఆ జంతువులు ఉండేవి. వానిలో బొమ్మలు వాని శరీరాలు, ప్రాణవాని ఆత్మ. వాని యొక్క సారభూతమైన సత్తా; ఇల్లుదాటి వెడితే, అంతఎందుకు ఈ లైబ్రరీ గోడలు దాటిపోతే, ఏవే ఆకారాలు మసక మసకగా కన్పించేవి. వానికి ఒక నిశ్చిత ఆకృతి ఉండదు. ఈ పుస్తకాలలో అంతా ఎట్లా ఉంది! బయట ఒక్క మనిషికి, ఒక్క జంతువుకు, ఒక్క పురుగుకు, ఆ పొందా, ఆ పుష్టి, ఆ ఆకృతి వైశిష్ట్యం—మచ్చుకైనా ఉండదు. ఉన్నట్లు కన్పించదు. జంతువులను చూపించేచోట్ల ఉన్నాయి. అందులో కోతులు ఉంటాయిగదా! ఒక్క కోతి కోతిలాగా కన్పించదు. లక్సెంబర్గ్ గార్డెన్స్‌కు పోయి చూస్తే, అక్కడి మనుష్యులు మనుష్య మాత్రులలాగా కూడా ఉండరు. నేను సహజంగా 'ప్లేటో' అంటే విశ్వాసం కలవాడిని. ఆయన సిద్ధాంతాలు నా సిద్ధాంతాలు. నేను వస్తువును తీసుకొని, తద్వారా విజ్ఞానాన్ని పొందలేదు. అది నాపద్ధతికాదు. ముందు విజ్ఞానం. ముందు ప్రమ. తద్వారా వస్తు దర్శనము. వస్తు పరామర్శ. ఇది నా పద్ధతి. వస్తువులు ఉన్నాయి. చిచ్ఛాయఉంది. అంటే భావం. నాకు వస్తువుకన్నా ఈ చిచ్ఛాయ ముఖ్యమనిపించింది. అనిపించడంకాదు. ముఖ్యమని తెలుసుకున్నాను. ఇందుకు కారణం ఉంది. ముందు నాకు భావ జగత్తు పరిచయమైంది. చిచ్ఛాయా శక్తి అలవడింది. వస్తుజాలం అందినట్లు అవి నా మనస్సుకు అందాయి. నాకు అచ్చు పడ్డాయి. విశ్వాన్ని నేను పుస్తకాలలో దర్శించాను. పుస్తకాలలో విశ్వరహస్యాలు నాకు పట్టుపడినాయి. ఎవరినో కలుసుకున్నట్లు. వాటిని కలుసుకున్నాను. జీర్ణించుకున్నాను. వర్గాలు కుదుర్చుకున్నాను. నామకరణం చేశాను. అధ్యయనం చేశాను. ఇంకా అవి గొప్పగానే ఉన్నాయి. పుస్తకాలు చదివి నేను సంపాదించిన ఈ అనుభవం—అదో అవ్యవస్థ. ప్రపంచం అట్లా ఉంటుందా? యదార్థ జగత్తు లక్షణంవేరు. నేను నేర్చిన దానిని భూతార్థ జగత్తులో చూడబోయి తికమక పడ్డాను. యదార్థ జగత్తులో పరిస్థితి ఉల్టాగతి కష్ట భూయిష్టంగా ఉంటుంది. పుస్తకాలలో

ఉన్నట్లు ఉండదు. మరి నాకు ఈ భావసంఘర్షణాన్ని, విచ్ఛయవాదాన్ని వదుల్చుకోవాలి అంటే ముప్ఫయి సంవత్సరాలు పట్టింది అంటే అందులో ఆశ్చర్యం ఏమి ఉంది!

ప్రతి దిన జీవితం ఉంది. అది కళ్లకు కట్టినట్లు తెలుస్తూ ఉంటుంది. మా ఇంటికి రోజూ ఎవరో వస్తూ ఉండేవాళ్లు. వాళ్లంతా బుద్ధిమంతులు. మనుష్య లోకం కలవాళ్లు. ఒక్కడూ నసుకుతూ మాట్లాడేవాడుకాడు. గట్టిగా, పట్టుగా మాట్లాడేవాళ్లు. వారి నమ్మకాలు వారికి ఉండేవి. వారి సిద్ధాంతాలు వారికి ఉండేవి. వారి నమ్మకాలకు అవి ఆధారాలు. వారి లోకజ్ఞత గొప్పది. దానినిబట్టి గూడా వారి మాటలు తూకంగా ఉండేవి. మామూలు మనుష్యుల్లాగా ఉండేవాళ్లుకాదు. వారికంటే వేరు అన్నట్లు ఉండే వాళ్లు. అదో విధమైన గడుసు లక్షణం ఒలకబోసేవాళ్లు. అది వారి జీవ లక్షణం. దానికి నేను అలవాటు పడ్డాను. వారు అట్లా మాట్లాడితేనాలు, నాకు అదే యదార్థమనిపించేది. యదార్థమే అయ్యేవి. స్పష్టము, అప్రతిహతము అయిన వ్యక్తమై అవభాసించేది. వాళ్లు ఏమైనా చెప్పాలనుకున్నారు; అది నిజం అని చెప్పాలనుకున్నారు; అందుకు అబ్బ! ఎన్నో ఉపపత్తులు చూపించేవాళ్లు. దృష్టాంతాలు కొట్టిపోసేవాళ్లు. వినడానికి నాకు విసుగ్గా ఉండేవి. ఉంటే ఏమి? ఆ చెప్పింది నిజం కాక ఏమౌతుందని అనిపించేది. నిజం అయి తీరా లనిపించేది. నీతి విషయం ఉంది. వారికివున్న చిక్కులు వారికి ఉన్నాయి. అందులో వాళ్లకు అర్థంకాని విషయాలు ఉన్నాయి. వాళ్లు ఒప్పుకునేవాళ్లు. అర్థం కాలేదని చెప్పేవాళ్లు. అందులో దాపరికంలేదు. అది నాకు కష్టం కల్గించేది. నాకు వాళ్ల ఆ మాటలు వింటుంటే అదోవిధంగా ఉండేది. గొప్పగా ఉండేవి కాదు. ఎక్కువ బాధ కల్గించేది. అవి అన్నీ కృత్రిమమైన ఆప త్తులు. ముందుగానే వాటికి ప్రతిక్రియలు కూడా కుదిరి ఉండేవి. ఎప్పుడు ఒక్కవిధంగా ఉండేవి. వారిలో దోషం ఏమున్నా ఉన్నదే అనుకుందాం. వారు దోషాన్ని గుర్తించారని కూడా అనుకుందాం. వారికి అది పట్టేదే కాదు. తేలిగ్గా ఉండేది. వారి విశ్లేషణలో కూడా నాకు కొన్ని బాధకాలు కల్పించాయి. అందులో తొందరపాటు ఒకటి. ఇంకోటి చిర్రు బుర్రు మనడం. అట్లా చిర్రు బుర్రుమనటం సహజమే కావచ్చు. కాని ఇక్కడ 'అతి'కి దగ్గరగా ఉండటం నాకు నచ్చలేదు. అస్పష్టం కలిసి వచ్చింది. ఈ దోషాలు ఉన్నట్లు వారు గూడా గ్రహించు కున్నారు. కొన్ని దోషాలు ఉంటాయి. అవి తీవ్రమైనవి. అవి క్షంతవ్యాలుకాదు. ఇంటిదగ్గర మాకు ఎవరినీ చూడే అల వాటులేదు. అది కష్టమే అనండి. ఇతరులలో తప్పులు ఉంటాయి. ముఖ్యంగా శీలానికి సంబంధించి. వాటిని గుర్తించక తప్పదు. పూరుకోకవు తప్పదు. నేను వినడం నేర్చు కున్నాను. వినేవాణ్ణే. అర్థం చేసుకునేవాణ్ణే. ఒప్పుకునేవాణ్ణే. ఈ అన్నింటికీ నేను అలవాటు పడ్డాను. అవి నాకు నచ్చేవి. నాకు ధైర్యం కల్గిస్తున్నట్లు ఉండేవి. అది అట్లా ఉండాలనే వాళ్లు మాట్లాడేవాళ్లు. అది నాకు తెలియకకాదు. ఆ పొరపాటు నేను ఎప్పుడూ చెయ్యలేదు. బాగుపడచాలి అను కోవాలేగాని ప్రపంచంలో బాగుపడరానిదేదీ ఉండదు. అంత రాంతరాలలో ఏదీ చరించదు. స్పందనం అన్నదిలేదు. మన భాగధేయం ఒక్కటే. అది ప్రకాశంలో ప్రజ్వలత వంటిది గోరీల దొడ్డిలో కాంతివంటిది. తాత్కాలికంగా శవాలను అటే పెట్టెచోటులు ఉంటాయి. అక్కడ చలనము, స్పందనము ఏమీ ఉండదు. అటువంటిది ఇది. మన భాగధేయం. పైకి ఏదో స్పందిస్తున్నట్లు, చలన చైతన్యరేఖ పిలుస్తుంది. అది వృథా స్పందనం. అది వ్యర్థమైన కదలిక.

మా ఇంటికివచ్చే అతిథులు ఉన్నారు. వారు 'వెళ్లి వస్తాము' అని చెప్పి వెళ్ళిపోతారు. నేను ఒక్కణ్ణే అయి పోతాను. ఒంటరివాణ్నై పోతాను. ఇదో ప్రకాశం. పరవసు విసుగ్గా ఉంటుంది. అందులోంచి తప్పించుకుపోతాను. లైబ్రరీ ఉంది. పుస్తకాలు ఉన్నాయి. అది జీవితం. నిజమైన జీవితం. తేలిగ్గా ఉంటుంది. ప్రేక్ష ఉండదు. నేను అక్కడికి వెడ తాను. అక్కడ చేయవలసిన పని ఒక్కటే. ఒక పుస్తకం పుచ్చుకోవడం. తెరవడం. ఎన్ని ఆందోళనలు. ఎంత అద్భుతాలు అన్నీ ఆ పుస్తకాలలో ఉంటాయి. మానవులము ఉన్నామా? ఆ మానవులు చేయని భావ ప్రపంచం వాటిల్లో గోచరి స్తుంది. ఏమి ఆడంబరం! ఏమి మనక మసకల విడల గుస గుసలు. ఆ పుస్తకాలలో భావాలు, ప్రవాహాలు అట్లా ఉంటాయి. అవి నాకు ఆనందం. లలితమైనట్లుగా ఉంటాయి. ఒక భావంనుంచి ఇంకో భావాన్ని అందుకోవడం—అది నడకా! నడకకాదు. పరుగు. దూకడం. అక్కడ రుజువుకిలకూర్చి గొప్పది. త్వరగలది. మనస్సు పట్టు వదలక తప్పదు. తప్పించ. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క వంతపేర్లు తిరగవేస్తున్నాను. అంతు పడితేనా? విభ్రమగ్రస్తుణ్నైనాను. పడిలేచాను. ఆ పుస్త కాలలో చెప్పబడిన సంగతులు, అవి ఎటువంటివి? మా తాతయ్య అవి అట్లా జరిగేందుకు లేదని తప్పకుండా అంటాడు. కాని అవి వ్రాసి ఉన్నాయి. శిలాక్షరాలకుమల్లే ఉన్నాయి. వాటిని నిజం కాదనడం ఎట్లా! పుస్తకాలలో మనుష్యులు చెప్ప కుండా చెయ్యకుండా హఠాత్తుగా వస్తారు. ప్రేమలు చేసు కుంటారు. తగాదాలు పడతారు. ఒకర్ని ఒకరు చంపుకుం టారు. కాదు. హత్య చేసుకుంటారు. చావకుండా మిగిలిన మనిషి విడుపులో కొట్టుకుపోతాడు. ఆడదైతే కొట్టుకుపోతుంది. ఇప్పుడేకదా చంపుకొన్నది! అంతలో మగవాడైతే ప్రియురాలిని కలుసుకుంటాడు. ఆడదైతే ప్రియుణ్ణి కలుసుకుంటుంది. గోరీల దొడ్డిలో గోరీలలో. నేను ఏమి చెయ్యాలి? పెద్ద వాళ్లైతే తిడతారా? మెచ్చుకుంటారు. క్షమించి వదిలి పెడతారు. అట్లా చేయాడమా? ఈ పుస్తకాలలో మనుష్యులు మనవంటి మనుష్యులుకాదు. మనకు ఏదో పద్ధతి ఉంది. వారికి అదిలేదు. అది పట్టదు. వారికి ఏవో ఉద్దేశాలు ఉన్నాయో అందామా! అవి ఎప్పుడూ నాకు అంతుపట్టలేదు. తప్పించుకు

తిరిగాయి. 'బ్రూటస్' తన కుమారుణ్ణి చంపాడు. 'మాత్యోఫాల్కోన్' కూడా అంతే. కొడుకును చంపాడు. అది మామూలుగావున్న అన్నట్లు ఉంది. నా చుట్టూ చూసు కుంటాను. నా ఎరిగిన వాళ్లు ఎవ్వరూ అట్లా చేసిన జాడ లేదు. "మర్యాదా"లో ఒకసారి తాతయ్య, మామయ్య పోట్లాడుకున్నారు. తోటలో పోట్లాట జరిగింది. నాకు వాళ్ల కేకలు విన్పించాయి. అంతేమాత్రం! తాతయ్యకు మామయ్యను చంపాలనే వూహైనా వచ్చి ఉంటుందా? నాకు వచ్చిం దని అనిపించలేదు. అయినా నాకు ఆ భయంలేదు. నేను తండ్రి లేనివాణ్ణి. ఈ తర్కపు చావులు నాకు నవ్వుగా ఉండేవి. కథలలో ఈ చావులు ఉన్నాయి. చావులతో అల్లిన కథలు ఉన్నాయి. అక్కడ వాటికి "కానే" కాని, 'లేదు' చెప్పేవాళ్లు కన్పించరు. అదే నన్ను తికమక పెట్టింది. 'హొరేస్' ఉన్నాడు. 'కామీయ్'' ఉంది. అతడు ఆమెను చంపుతానని వెంటపడ్డాడు. 'హొరేస్' తలమీద ఒక హెల్మెట్. చేతిలో ఒరలోంచి తీసిన కత్తి. అట్లా 'హొరేస్' 'కామీయ్' వెంటపడ్డాడు. పుస్తకంలో ఆ బొమ్మ ఉంది. ఆ బొమ్మను చూడగా, దానిమీద అంజా కృతి చేద్దామనిపించింది. కాని నిల్వ్ర తొక్కుకున్నాను. పట్టు బలవంతాన నిల్వ్ర తొక్కుకున్నాను. కారల్ అప్పుడప్పుడు పాడుతూ ఉండేవాడు.

> "అన్నకును చెల్లికిని మధ్యన మిలితమైన
> బంధనము చెల్ల, దృఢమైనై వరీశవిల్ల—
> మరియు బంధమ్ము లితరముల్ కలుగుకల్గ
> సోదరుల నడిమి బంధంపు చొప్పునటు"

ఇది నాకు మనఃక్షోభన్ని కల్గించింది. ఏదో అదృష్టం కొట్టుకువచ్చి నాకు ఒక చెల్లెలే ఉన్నదనుకుందాం. అప్పుడు ఆ చెల్లెలు నాకు "ఎమ్మీ–మారీ" కన్నా దగ్గరగా ఉంటుందా? సన్నిహితురాలవుతుందా? లేకపోతే 'కార్లమానీ' ఉంది. ఆమె కంటే కూర్పుదౌతుందా? దగ్గరదౌతుందా? అప్పుడు అది నాకు ప్రియురాలు కావాలి. ఉంపుడుకత్తె కావాలి. ఈ ప్రియురాలు, ఈ ఉంపుడుకత్తె అన్న మాటలు అప్పటికి ఇంకా నాకు కొత్త. మసక మసకగానే ఉన్నాయి. పత్తాలేని నీడ లకు మల్లే. 'కార్నీయ్' నాటకాల్లో ఈ మాటలు తగలడంతప్ప నాకు అట్టే తెలియదు. ప్రేయసిఉంది. ప్రియుడు ఉన్నాడు. ఇద్దరు ముద్దులు పెట్టుకుంటారు. ఒక్కమంచంమీదపడు కుందామనుకుంటారు. ఒకరికి ఒకరు మాట ఇచ్చుకుంటారు. (ఇది ఏదో కొత్త ఆచారం. నేనూ మా అమ్మ వేరు వేరు మంచాల మీద పడుకునేవాళ్లం. అట్లా వీళ్లు ఎందుకు చెయ్యరు!) నాకు ఇంకొంచెం తెలుసు. అది ఏదో మసక మసగ్గా ఉండేది. అడుగున అంతా దుబ్బులు అట్ల కట్టుకున్నట్లు కొలకుదు పడేదికాదు. ఏదో ఉన్నట్లు కన్పించేది. నేను అన్నను. అటు వంటి పనిచేస్తే తప్పు అనేవాళ్లు. అపచారం చేసినట్లయేది. సగోత్ర వ్యభిచారం అయ్యేది. ఎప్పుడూ నేను దానిని గూర్చి కలలుకంటూ ఉండేవాడిని. మూలం? కొన్ని అంతరంగిక ప్రవృత్తులు ఉన్నాయి. అవి నిషిద్ధాలు. ఇది వాటిని దాచు కోవడం? విస్మరించడం? కావచ్చు. నాకు ఒక అప్పగారు ఉంది. మా అమ్మ. నాకు చెల్లెలు కావాలని ఉంది. ఇప్పుడు ఈ 1963 లో కూడా నా మనస్సుకు నచ్చిన బంధుత్వం ఇది ఒక్కటే. నాకు తరచు ఒక తప్పు చేయడం ఉంది. చాలా కాలం అట్లా జరిగింది. నేను ప్రతి స్త్రీలోను ఈ నా చెల్లెలిని ఈ నా సోదరిని వీక్షిస్తూ వచ్చాను. ఆమె ఎప్పుడూ కన్పించ లేదు. ఎక్కడా కన్పించలేదు. కోర్టులో అప్పీలు చేసుకుంటే ఆ అప్పీలును ఖర్చులు ఇవ్వకోవని కొట్టేసినట్లయింది. అయినాసరే, ఈ పంక్తులు వ్రాస్తున్నప్పుడు నాకు కమీయ్‌ని చంపినవాడు జ్ఞాపకం వస్తున్నాడు. కోపం రగులుకుపోతుంది. అది కొత్తగా ఇప్పుడు అన్నట్లు ఉంటుంది. జీవ సత్తా కలిగి ఉంటుంది. నాకు సైనికత్వం నచ్చదు. అందుకు ఈ "హొరేస్" ఓఘాయిత్యం ఒక కారణంకాదా అనిపిస్తూ ఉంటుంది. సైనికులు తమ అక్కలను, చెల్లెళ్లను చంపుతారు. నేను ఏమైనా చేద్దును. ఎంతైనా చేద్దును. చెమట ఓడుదును. ఎందుకోసం? తుపాకులుపెట్టి కాల్చేవాళ్లకోసం, "హరిఃఓం"గా ఆ స్త్రీ పొంత గుండెలు తూట్లు కొట్టేందుకు. నేను పుస్త కంలో పేజీలు తిప్పుతాను. అవి అచ్చుపడిన పేజీలు. ఆ అచ్చు లో తగిలిన మాటల్లో ఏదైనా నా తప్పును చూపిస్తుందో! నేను పొరపడినానని నిరూపిస్తుందో! ఈ సోదరహంత చెల్లె ళ్లను, అక్కలను హత్య చేసేవాడు. దోష నిర్ముక్తుడు, నేర విముక్తుడు కావాలి. కొద్ది కష్టాలపాటు నేను నానా హంగామా చేశాను. గంతులు వేశాను. అంబోతు ఉంది. అది మోసగింప బడుతుంది. అప్పుడు అది ఎట్లా గోల చేస్తుంది. అట్లా గోల చేశాను. అంతలో కోపాన్ని గదమాయించుకున్నాను. అది అట్లావుంది. అట్లా జరిగింది. నేను ఏదో ఒక వైపుకు వంగి పోవలసింది. పక్షపాతం చూపవలసింది. నేను పట్టే పసివాణ్ణి. నేను సరిగ్గా అర్థం చేసుకోలేకపోయాను. సరిగ్గా అర్థం అయ్యి ఉండదు. పద్యాలు వ్రాయడంలో ఒక రకమైన ఛందస్సు ఉంది. దాన్ని అలెగ్జాండ్రైన్ ఛందస్సు అంటారు. ఈ పుస్తకం ఆ ఛందస్సులో ఉంది. ఆ ఛందస్సులో బంధింపబడిన మాట లలో ఎక్కడో ఈ నేరవిముక్తికి సంబంధించిన రహస్యం దాగి ఉంటుంది. అది నాకు పట్టుపడలేదు. అది నాకు అంటకుండా ఉండియైనా ఉండాలి. లేదా నేను పేజీలను తొందరలో తిరగవేయడంలో, పంక్తులను దాటవేయడంలో తప్పించు కుపోయి అయినా ఉండాలి. ఏమైనా ఆ పంక్తులలో ఎక్కడో ఈ నేర విముక్తియొక్క ఆవసరం నిర్ధారితం చేయబడిఉండి ఉంటుంది. దాని పెంకితనం ఏమోగాని అది నా కళ్లకు కన్పించ కుండా, మనస్సుకు అంటకుండా దాక్కొని ఉండిపోయింది. ఇది ఒక అనిశ్చయిత స్థితి. నాకు నచ్చింది. కథ నాకు పట్టు బడకపోవడంలో కూడా ఒక పద్ధతి ఉంది. అది కూడా నా

మనస్సు వచ్చింది. వచ్చిందని నేను అనుకునేవాణ్ణి. ఇది కూడా ఒకరకంగా బాగానే ఉంది. ఇది ఒక కొత్తలాగా ఉంది.

'గుస్తావ్ ఫ్లాబేర్' నవల ఉంది. 'మదామ్ బోవరి'. ఆ నవలలో చివర పేజీలు నేను కంఠోపాఠం చేశాను. కనీసం ఇరవైసార్లన్నా చదివి ఉంటాను. అక్కడ ఆ కథయొక్క నిర్వహణ సంధి నిర్వహింపబడింది. ఇన్నిసార్లు చదివి ఇంత కంఠోపాఠం చేశానా, అందులో 'విధురుడు'—ముండామోపినవాడు—ఉన్నాడే, వాటకం ఏమిటో నాకు అంతు పట్టలేదు. వాడు చేసిన పనులు విడమరపుగా ఉన్నట్లు కన్పించలేదు. వాడికి కొన్ని ఉత్తరాలు దొరికాయి. దొరికాయిపరే! వాడు గడ్డం పెంచుకోడానికి అది ఏమన్నా కారణమా? వాడు రోదాల్ఫ వంక రూక్షంగా చూచాట్ట? ఎందుకు చూచాట్ట? వాడంటే వాడికి ఈర్ష్య పుట్టిందట. వాడంటే కోపంగా, చేదుగా ఉన్నాట్ట. ఎందుకుట? ఆ విధురుడు అక్కడ కొన్ని మాట అన్నాడు. "నీవంటే నాకు కోపం ఏమీలేదు." ఈ మాటలు ఎందుకు అన్నాట్ట? రోదాల్ఫకు వాడు హాస్యగానిలాగా ఒదో విధంగా కన్పించాడు. హీనంగా కన్పించాడు. అసహ్యంగా కన్పించాడు. ఎందుకు కనిపించాట్ట? ఆ తర్వాత ఛార్లెస్ బోవరి చనిపోయాడు. ఎందుకు చనిపోయాడు? దుఃఖంచేత చనిపోయాడా? జబ్బుచేత చనిపోయాడా? అంతా అయిపోయింది. అప్పుడు డాక్టరు అతని శరీరాన్ని కోశాడు. ఎందుకు కోశాట్ట? ఇందులో వెంకితనం ఉంది. ప్రతిఘటన ఉంది. దానికి అంతం లేదు. నాకు ఇది అంతా గుహ్యమేననుకోండి. అయితే ఏమి? నాకు ఇదంతా ఒదో ఇదిగా ఉండేది. మనస్సుకు అలుపు కూడా కల్గేది. అయినా నాకు ఆ పద్ధతి నచ్చింది. నచ్చినట్లనిపించింది. ఇందుకు కారణం ఉంది. ఇక్కడ అర్థం కావడం ఉంది. అర్థం కాకపోవడమూ ఉంది. ఈ ద్వ్యర్థస్థితివలన నాకు ఒక విధమైన ఆనందం కల్గేది. అసలు జగత్తులోవున్న విశేషమే ఇది. అది క్లిష్టమైంది. జటిలమైంది. మా తాతయ్య ఇంటి దగ్గర ఎప్పుడూ మానవ హృదయాన్ని గూర్చి ఉపన్యాసాలు కొట్టిపోసేవాడు. మీమాంస చేసేవాడు. వివేకం లేకుండా మాట్లాడేవాడు. స్వేచ్ఛగా మాట్లాడేవాడు. నాకుమాత్రం ఆ మానవ హృదయం పట్టి సరుకులేని సంగతిగా కన్పిస్తుంది. శూన్యమైనదన్నట్లు నిరాకర్షకమై కన్పిస్తుంది. దానికి ఒక వైశిష్ట్యం అంటూ లేదని అనిపిస్తుంది. అయితే ఇందుకు ఒక అపవాదం ఉంది. ఇట్లా అనిపించేది మామూలు జగత్తులో. పుస్తకాలలో కాదు. శబ్దమయ ప్రపంచంలో కాదు. మామూలు జగత్తులో ఈ హృదయానికి రుచిలేదు. రుచి ఎరుగదు. పుస్తకాలలో అట్లా కాదు. అక్కడ పేర్లే మత్తు ఎక్కిస్తూ ఉంటాయి. నా అంతఃకరణప్రవృత్తులమీద ఆ పేర్ల మత్తుమందు చల్లుతాయి. అప్పుడు నాకు అనిర్వాచ్యమైన సౌఖ్యమో, లేక వర్ణింపరాని దుఃఖమో కల్గుతుంది. "చార్ బోవరి" అని నేను లోపల అనుకున్నాననుకోండి. ఎక్కడినుంచి వచ్చాడే వాడో, నాకు ఒక గజ దూరంలో మాసిన గడ్డమూ, పీలికల గుడ్డలూ—వాడూ కళ్లముందు ఆడేవాడు. ఆ దృశ్యాన్ని భరించడం ఎట్లా? అది నిర్భరం. దుర్భరం. అట్లా అనిపించేది. ఒకవిధంగా ఇవి బాధను కల్గిస్తున్నా సంతోషాన్ని ఆనందాన్ని కూడా చేకూర్చేవి. అందువల్ల కలిగే ఆనంద విశేషం అంతర్బాధాసంవలనం చెంది ఉండేవి.

ఇది ఇట్లా జరగడానికి రెండు భయాలు కారణం. ఆ భయాలు పరస్పర విరుద్ధాలు. వాటికి ఏకవాక్యతలేదు. సంవాదంలేదు. ఈ పుస్తక ప్రపంచం పట్టి కాల్పనిక జగత్తు. అందులో "హోరేస్"లు, "చార్ బోవరి"లు ఉంటారు. వాళ్లతో కలిసి ఎల్లకాలం తిరగడం నాకు ఇష్టంలేదు. భయం కూడాను. అందువల్ల ఆ ప్రపంచంలో తల ముందుకుపెట్టి ఎందులోవో తొంగి చూసినట్లు చూడడం అంటే నాకు భయమైపోయింది. ఆ ప్రపంచంలో "రూ లా గోఫ్"గాని, "కార్లెమాజ్"కాని కన్పించరు. మా అమ్మ కూడా కన్పించదు. ఎప్పుడూ వాళ్లు కనపడరు. ఇంకోవిధంగా ఆలోచిద్దాము. పుస్తక ప్రపంచంలో శబ్దాలు వూరేగింపులు వచ్చినట్లు వస్తాయి. వరుసగా వస్తాయి. పెద్దవాళ్లు ఉన్నారు. వారికి అవి ఏమేమో అర్థాలను ఇస్తాయి. ఏవో విశేషాలను తెల్పుతాయి. ఆ అర్థాలు, ఆ విశేషాలు నాకు పట్టుపడటంలేదు. తప్పించుకుంటున్నాయి. నాకు కళ్లు ఉన్నాయి. ఆ కళ్ల ద్వారా శబ్దాలను మనస్సులోకి ఆకర్షిస్తున్నాను. ఆ శబ్దాలు విషదిగ్ధాలైనట్లు ఉన్నాయి. నాకు తెలిసిన దానికంటే అవి ఎంతో పౌష్కల్యం గలవి ఉన్నాయి. నాలో ఒక కొత్త శక్తి, విచిత్రమైన శక్తి, అద్భుతమైన శక్తి ఏదో నిర్మితిని పొందుతోంది. నాకు మాటలు నేర్పు నేర్పుతోంది. నానారంభణాన్ని కల్గిస్తున్నది. వాక్యాలలో కదలు అల్లుతోంది. ఆ కథలో విచిత్రమైన మనుష్యులు ప్రాదుర్భావం చెందుతున్నారు. అంతా పట్టి కోపిష్టి మనుషులు. ఉగ్రులు. వారిలో నాకు పొత్తేమిటి? ఎటువంటి పొత్తూ లేదు. ఆ కథలో ఒక దుఃఖం; ఒక జీవితం నాశనం కావడం; ఇట్లా ఉంటోంది. అందులో వచ్చే మనుష్యులు కూడా అట్లాంటివాళ్లే వస్తున్నారు. ఇది ఏదో చేటు! విషం! ఈ చేటు నాకు సోకి, ఆ విషం నాకు తగిలి, నేను చచ్చిపోతే? అమ్మో శబ్దాన్ని నేను మ్రింగుతున్నాను. శబ్దశక్తివలన ఏర్పడిన దృశ్యం నన్ను మ్రింగుతోంది. ఈ రెండు లక్షణాలకు పొంతన కుదరడంలేదు. ఇవి యుగపత్తుగా వస్తున్న ప్రమాదాలు. వాటిల్లో సంవాదంలేని కారణం ఉండి, నేను అంటుతోంచి, చిట్టచివరకు బయట పడ్డాను.

అప్పుడు సాయంత్రం అవుతోంది. సాయంవేళ సూర్యాస్తమయ సంరంభంలో ఆరంభం అయ్యే కౌసుంభకాంతులు పరభిస్తున్నాయి. నేను శబ్దమయ ప్రపంచం అనే అడవిలో చిక్కుపడిపోయాను. దారి తెలియక కొట్టుకుంటున్నాను. ఇక్కే అలికిడి అయితే చాలు. వణుకు పుట్టుకొస్తోంది. ఏమాత్రం చప్పుడైనా ఏదో అరిచినట్లు అవభాసిస్తున్నది.

మనుష్యుని పేడ, మనుష్యుని వాసన లేకుండా భాషయొక్క ఆది స్వరూపాన్ని అసంస్కృత స్థితిని అందుకుంటున్నాననుకున్నాను. పట్టుకుంటున్నాననుకున్నాను. మా అమ్మ వచ్చింది. నేన్ను చూడలేదు. 'పిచ్చివాడా? ఏమి చదువురా? కళ్ళ నాశనం అవుతాయి'' అంది. దీపం వేసింది. నాకు ఊరట కల్గింది. అసంతృప్తి లేకత్తింది. తిరిగి కుటుంబ జీవనం అనే విరామం లేని విసుగులో పడ్డాను. నా ముఖం మాడిపోయింది. నేను ఎగిరి గంతువేశాను. ధామ ధూమములు చేశాను. అరిచాను. ఎగిరిపడ్డాను. తమాయించుకున్నాను. ఇదంతా ఏదోగా కన్పిస్తుంది. పరుషంగా, కటువుగా, అనాగరకంగా ఉన్నట్లు కన్పిస్తుంది. నవ్వు తెప్పిస్తుంది. తిరిగి నేను శిశువునైనాను. శైశవంలో పడ్డాను. ఇది తిరిగి సంపాయించుకున్నట్లు ఉంది. అప్పుడు గూడా నాకు బాధ తగ్గలేదు. పరధ్యానపడ్డాను. ఈ పుస్తకాలు జీవితాన్ని మాట్లాడుతున్నాయి? ఏమి చెబుతున్నాయి? ఎవరు వ్రాశారు? ఎందుకు వ్రాశారు? ఒక్క రోజున నా ఈ ఆటుర్దాను తాతయ్యముందు వెళ్ళగ్రక్కుకున్నాను. ఆయన ఆలోచించాడు. ఇక వీడికి విముక్తి నివ్వాలి. తప్పదు—అనుకున్నాడు. స్వేచ్ఛగా ఉండనివ్వాలి. మరో మార్గం లేదూ—అనుకున్నాడు. అనుకున్నంతపనీ చేశాడు. ఆ చేసిన పద్ధతి గొప్పగా ఉంది. ఇప్పటికీ ఆ ముద్ర నాయందు ఉంది దాని చెరుపులేదు.

తాతయ్యకు ఒక అలవాటు ఉండేది. నన్ను కాళ్ళ మీద వేసుకుని ఉయ్యాల వూపుతూ పాడేవాడు. నాకు నవ్వు వచ్చేది. నవ్వేవాణ్ణి. అందులో మర్యాద లేకపోవచ్చు. అయినా ఆపుకొని ఆపుకొని నవ్వేవాణ్ణి. తాతయ్య పాట ఆపేవాడు. నన్ను ఒడిలో కూర్చోపెట్టుకునేవాడు. కళ్ళలో కళ్ళ పెట్టి చూచేవాడు. "నేను మనుష్యుణ్ణి" అంటూ ఆ పాట అర్థం చెప్పేవాడు. కంఠంలో అధికారం. మాటలో దర్పం. ఇట్లా చెప్పేవాడు. "నేను మనుష్యుణ్ణి. మానవ సంబంధమైన దేదీ నాకు విజాతీయంకాదు" అనేవాడు. తాతయ్య దగ్గర అతిశయోక్తి కొంచెం హెచ్చుపాలులో ఉండే. ప్లేటోక్కు కవులంటే మహా చెడ్డ రోత. వాళ్ళను తన "రిపబ్లిక్" లోంచి బహిష్కరించాడు. కారల్‌కు ఇంజనీర్లంటే గిట్టదు. వర్తకులంటే గిట్టదు. ఉద్యోగులన్నా కూడా గిట్టదేమో! వీళ్ళందర్నీ తన "రిపబ్లిక్" లోంచి వెలివేశాడు. శుద్ధ విజ్ఞానం ఉన్నదనుకొండి, అందులో విశేషణమే తాతయ్యకు ప్రధానం విశేష్యంకాదు. ఆ విశేషణాన్ని తాతయ్య ఆనందించేవాడు. "గేలిక్కి" అనేచోట మాకు కార్ఖానాలు ఉన్నాయి. మామయ్య జార్జి అప్పుడప్పుడు మమ్మల్ని అక్కడికి తీసుకుపోతూ ఉండేవాడు. జూలై మాసంలో ఎప్పుడూ రెండోపక్షాన్ని మేము అక్కడే గడిపేవాళ్ళం. అక్కడ వేడిగా ఉండేది. పరుషంగా ఉండేది. సభ్యత కన్పించేదికాదు. మనుష్యులు ఒదో రకంగా ఉండేవాళ్ళు. చిరిగిన గుడ్డలు. వాళ్ళాను. వాళ్ళ దర్జీ భరించలేక పోయేవాళ్ళం. వాళ్ళ మమ్మల్ని ఒకటే వేధించేవాళ్ళు. అబ్బో! అక్కడి మోత భరించరానిదిగా ఉండేది. చెవులు చిల్లులు పడేవి. భయం వేసేది. విసుగు పుట్టేది. చచ్చినట్టు ఉండేది. తాతయ్య ఈలలు వేసేవాడు. యంత్రాలలోంచి కరిగిన లోహం ప్రవహిస్తుంటే "ఓహో" అనేవాడు. ఇదంతా నటన. మర్యాద కోసం చేసేవాడు. మామయ్య ఏమన్నా అనుకొనిపోతాడేమో నని నటించేవాడు. కాని ఆ కళ్ళ తాతయ్యను పట్టి ఇచ్చేవి. వాటిల్లో చైతన్యం ఉండేదికాదు. ప్రాణం ఉండేదికాదు. ఆగస్టులో "కాంటర్బరీ" కి వెళ్ళేవాళ్ళం. అక్కడ చూడాలి తాతయ్యని. గంతులు వేసేవాడు. గ్రహాలను కలయ తిరిగే వాడు. పాత భవంతులు కనిపిస్తే వాటు తక్కున ఆగిపోయే వాడు. "నాయనా! ఇది చూశావా! ఇది పాతకాలపు ప్రాన్సులో రోమన్‌లు కట్టిన గోడ. ఇటుకలతో కట్టారు. అనేవాడు. ఆయనకు చేతికర్ర ఒకటి ఉండేది. దానితో ఆ గోడను తట్టి చూపిస్తూ ఈ మాట చెప్పేవాడు. "చర్చి"ల నిర్మాణంలో ఒక పద్ధతి శిల్పం ఉంది. తాతయ్యకు అది అంటే ఇష్టం. పోపు అనుచరులంటే అయిష్టం. అయినా ఒక చర్చి గనుక ప్రాచ్య దేశపు శిల్ప సంప్రదాయాలను అనుసరించి నిర్మించ బడినదైతే చాలు. ఆయనక, ఈ అయిష్టం అడ్డు వచ్చేదికాదు. ఆయన ఆ చర్చికి వెళ్ళేవాడు. అదే ఐరోపాలోని ఏ ఇతర ప్రాంతాలలోనో పాశ్చాత్య యుగములనాటి కాలంలో ప్రచలితం అయివున్న శిల్ప సంప్రదాయాలనుబట్టి నిర్మించబడినదను కోండి. అప్పుడు అటువంటి 'చర్చి' కి వెళ్ళడం తాతయ్య ఇష్టా ఇష్టాలమీదను, 'కళా విలువ' మీదను ఆధారపడి ఉండేది. పాట కచ్చేరీలకు వెళ్ళడం అరుదు. వెళ్ళకుండా ఉండేవాడని కాదు. తాతయ్యకు "బీథోవెన్" అంటే ఇష్టం. ఆ అడం బరం, ఆ జంత్ర వాద్యాలు తాతయ్యకు నచ్చేవి. 'బాకే' అన్నా ఇష్టంలేకపోలేదు. ఉత్సాహంమాత్రం తక్కువ. ఒక్కొక్కప్పుడు తాతయ్య పియానో వాయిస్తూ ఉండేవాడు. కూర్చునేవాడుకాదు. అట్లా నిలబడి ఇష్టంలేక బిగసుకుపోయినట్లున్న వ్రేళ్ళతో అట్లా 'పియానో' మెట్లను తాకేవాడు. అమ్మమ్మ నవ్వేది. అనేది. 'ఫ్రాన్క్ పాటలు కడుతున్నాడయ్యా'' అని. మామయ్యలు—ముఖ్యంగా జార్జి—కూడా సంగీత ప్రియులే. వారికి 'బీథోవెన్' సంగీతం అంటే మాత్రం గిట్టదు. అసహ్యించుకునేవాళ్ళు. అల్పమైన కచేరీలు జరుగుతుండేవి. అవి అంటే వాళ్ళకు ఇష్టం. ఈ అల్పపు కచ్చేరీలలో జంత్ర వాద్యాలు అట్టే ఉండవు. మహా ఉన్నా; పదికి మించవు. ఇటువంటివి ఇళ్ళలోనే జరిగేవి. వాటిని మామయ్యలు నాజూకు చేసేవాళ్ళు. ఇంట్లో అభిరుచులు ఇట్లా ఉండేవి. తాతయ్యకు ఇవి ఏమీ పెద్ద లెక్కకాదు. ఆయన పట్టించుకునేవాడేకాదు. కాని అనేవాడు. "స్విట్జర్లు ఉన్నారు చూశావూ. వాళ్ళంతా సంగీతంముందు, తర్వాత వాళ్ళుగా పుట్టారు" అని. నేను పుట్టినప్పుడు; అప్పటికి పుట్టి వారం రోజులై ఉండేమో! ఒక గమ్మత్తు జరిగింది. ఇంట్లో ఏదో గంట గణగణ లాడిందట. నేను తలఎత్తి అటు చూచానట. అంతే. తాతయ్య మనుమడి జాతకం చెప్పేశాడు. వాడికి

కూడా మంచి చెవి ఉంది. పీడు కూడా సంగీతప్రియుడే— అని నిర్ణయించాడట.

చదువులలో కొన్ని చదువులు ఉన్నాయి. అవి భగవంతుని దగ్గరకు దారులు. విద్యలలో కవిత్వ పద్ధతులలో విధిధ్యానలు చేయడం, గగన చుంబిత ప్రాకారాలు నిర్మించడం, శిల్పపు పనితో తోరణాలు రచించడం, దారువులనో లోహములనో క్రీస్తుకు శిలువవేయబడిన ఘట్టాలను శిల్పించడం ఈమొదలైనవన్నీ అటువంటి విద్యలు. ఇక్కడ శిల్పపు పనితనంలో అయానన్ని జాలానికి సహజమైన, నిసర్గమైన ప్రకృతిసిద్ధమైన సౌందర్యం ఆపాదనం చేయబడుతుంది. అందుచేత ఈవిద్యలు తక్కిన విద్యలలో మిగిలి కన్పిస్తాయి. భగవంతుని సృష్టి ఉంది. మానవుని సృష్టి ఉంది. ఈ రెండు సృష్టులయందు జీవం అయి ఉంటున్న ప్రాణశక్తి ఒక్కటే. భేదంలేనిది. కొండమీంచి జిల్లుమంటూ జల జలగా జారువారే ఎత్తిపోతలలో ఇంద్రధనస్సు పసుపర్ణ కిమ్మీరితంగా తళతళలు పోతుంది. మరిగపాన్ ఫ్లూబేర్ వ్రాతలలో రెంబ్రాండ్ట్ బొమ్మలలో ఆహారికార్మికపు తళతళలు, కొత్తదనం చెందడం లేనిదం ఎట్లా! 'ఫ్లూబెర్' వ్రాసిన అన్ని పంక్తుల మధ్య ఇంద్రధనస్సులు ఉన్నాయి రెంబ్రాండ్ట్ గీసిన ప్రతి బొమ్మలోని కాంతిమాధ్య నీడలమాధ్య మధుర కారుణ్యకాలు ఆడుతున్నాయి. ఇక్కడ భేదప్రతిపత్తి లేదు. దాన్ని ఏమనాలి? 'అధ్యాత్మ' అనాలి. ఆ 'అధ్యాత్మ' భగవంతుని మానవ్యుల సంబంధాలు చెబుతుంది. మానుష్యులకు భగవంతునివలని సాక్షిభూతమై, స్రష్ట సత్తా కల్గి పరిఢవిల్లుతుంది. గాతయ్య ఉన్నాడు. ఆయన సత్యాన్ని అమూర్త సౌందర్యం అంటాడు. సౌందర్యాన్ని సత్యము యొక్క మూర్తస్థితి అంటాడు. సర్వమైన ఉన్నత లక్ష్యాలకు, భావాలకు, ఆదర్శాలకు అది జనిస్థానం అంటాడు. కొన్ని అసాధారణ పరిస్థితులు ఉంటాయి. సందర్భాలు ఉంటాయి పర్వతాలలో మేఘాలు పగిలి జడి వానలను తెచ్చి గాలులలో ఈలలు వేశాయనుకోండి. విక్టర్ హ్యూగో ప్రబోధితుడైనా డనుకోండి. ఆయనకు దివ్యమైన ఆవేశం వచ్చిందనుకోండి. ఇవన్నీ అసాధారణమైన పరిస్థితులు. సందర్భాలు. అప్పుడు సర్వ రసములు, సర్వ భావములు స్థాయీస్థితిని పొందుతాయి. స్థాయీభావాన్ని భజిస్తాయి. అక్కడ సత్యము, శివము, సుందరము, ఏకం అవుతాయి. అక్కడ అప్పుడు ద్వైత భావం అన్నదే ఉండదు. అద్వైతసిద్ధి కల్గుతుంది.

నామతం ఏమిటో, నా ధర్మం ఏమిటో నాకు తెలిసి పోయింది. పుస్తక ప్రపంచంకన్నా నాకు వేరు ప్రపంచం లేదు. వేరు మతంలేదు. పుస్తకంముందు అన్నీ దిగదుడుపే. ఏదీ ముఖ్యంకాదు. లైబ్రరీ నాకు దేవాలయం. నేను ఒక మతాధికారి మనుమవాణ్ణి. ప్రపంచంయొక్క శిఖరస్థానంలో నా నివాసం. మాది ఆరో అంతస్తు. అది కేంద్రస్థానంలో మహా వృక్షం వంటిది. అక్కడ నేను చెట్టుమీద పక్షి గూడు చేసుకున్నట్లు నీడన్ని ఏర్పాటు చేసుకున్నాను. చిటారు కొమ్మ మీద వాలి కూర్చున్నాను. ఈ చెట్టుకు కూడా కాండం ఉంటూ ఉంది. అది మనుష్యులను పైకి తీసుకుపోతూ, క్రిందికి దింపుతూ ఉండే యంత్రమును; దాని కాండమంటాను. నామార్గం అదికాదు. నేను బాల్యనిమీదుగా వచ్చాను. బాల్యంలోనీ మీదుగా పోతాను. దారిపోయేవాళ్లమీద ఆట్లా దృష్టి సారిస్తాను. మా ఇంటి ప్రక్కవాళ్ల అబ్బాయి ఉన్నాడు. జోసెఫ్ పెరో. వాడి వయస్సు నా వయస్సు ఒక్కటే. నాకు మల్లేనే వాడి జుట్టు కూడా గిరజాలు తిరిగి ఉంటుంది. ఉంగరాలు ఉంగరాలుగా ఉంటుంది. శైశవ దశలోవున్న పిల్లవాళ్లలో కూడా స్త్రీ సహజమైన మెత్తని లక్షణం ఒకటి ఉంటుంది. అది ఆ వయస్సులో వాడిలోనూ ఉంది. 'పెరో' లోనూ ఉంది. వాడిని చూసి నేను ఆట్లా చెయ్యి ఊపుతాను. తిరిగి నా గూటిలో ప్రవేశిస్తానంతే. క్రిందికి దిగిరావడం అన్నది ఎప్పుడూ లేదు. మా అమ్మ నన్ను 'లగ్జంబర్గ్ గార్డెన్స్'కు తీసుకు పోతూ ఉంటుంది. ఇది నిత్యమూ జరిగే పనే. అప్పుడు మాత్రమే నేను అధమ లోకాలలో అడుగు పెట్టడం. కాని నా కాయం మాత్రం అక్కడే ఉంటుంది. 'చెట్టుమీద చిటారు కొమ్మమీద' ఇప్పుడు గూడా అక్కడే ఉండిఉంటుంది. ఉండి ఉంటుందని నమ్ముతున్నాను. ప్రతి మనిషికి సహజమైన స్థానం, సహజమైన నీడము అంటూ ఉంటాయి. మరియు మనిషి ఔన్నత్యం, అభిమానం వంటి గుణములవల్ల, విలువవంటి వస్తువులవల్ల నిర్ణయంకాదు. అన్నింటిని శైశవం నిర్ణయిస్తుంది. అందరి జాతకాలు అక్కడే తేలుతాయి. అప్పుడే తేలుతాయి. నా స్థానం పారిస్‌లో ఆరో అంతస్థులో. అక్కడినుంచి ఇళ్ల కప్పులన్నీ కన్పిస్తూ ఉంటాయి. చాలాకాలంవరకూ నాకు దరీ దేశాలంటే ఉక్కిరి బిక్కిరి అయిపోయేది. సమతల ప్రదేశాలు నన్ను క్రుంగదీసేవి. కుజగ్రహం చుట్టూ నేను కాళ్లు ఈడ్చుకుంటూ పరిభ్రమించేవాణ్ణి. ఆ ఒత్తిడి కూడా నన్ను క్రుంగదీసింది. అదిమివేసింది. ఇప్పుడు నాకు సుఖం లభించాలంటే ఏ అల్పపు పుట్టనో చూసుకొని, దాన్ని అధిరోహించాలి. అప్పుడు నాకు తిరిగి నా చెప్పిన ఆరో అంతస్థులో ఉన్నట్లు ఉంటుంది. ఇంకోసారి శబ్దమయ ప్రపంచపు అనుభూతిపు వల్లని గాలి అప్పుడు నా నాసారంధ్రాలలో సంచారులు పోతుంది. అప్పుడు విశ్వం యావత్తూ నాకు పాదాక్రాంతం కావలసిందే. పేరుకోసం ప్రతి జీవి, ప్రతి వస్తువు దేవుళ్లాడవలసిందే. ఆ పేరు పెట్టడం సృష్టివంటిది. అది వాచారంభణమున్నా వచో స్వీకారమున్నా; ఇది భ్రాంతి అంటారు. మాయవంటిది అంటారు. లేకపోతే విపర్యశోభ అంటారు. అనండి. కాని అది పరమార్థం. అది నాకు లేని రోజున, శబ్దమయ ప్రపంచంలో నేను సృష్టికర్తనై ఉండేవాడనేకాదు.

"ఎన్‌కౌంటర్" సౌజన్యంతో

# టి. ఎస్. ఎలియట్

శ్రీ బుచ్చిబాబు

ఎలియట్ రచనలలో నేను మొట్టమొదట చదివిన గ్రంథం 'కవిత్వప్రయోజనం, విమర్శప్రయోజనం' అన్నది. 1942 లో ఎమ్.ఎ. డిగ్రీ పరీక్షకి సిద్ధమవుతున్న రోజులు. పాఠ్యభాగం, ఆంగ్లసాహిత్యం—రొమాన్టిక్ కవులుగా ఎంచబడే, వర్డ్స్‌వర్త్, షెల్లీకీట్స్‌ల కవితారీతులు ప్రధానవిషయం. ఈ కవులగురించి, ఎందరెందరో విమర్శకులు వ్రాసినవాటిని చదివాను. అందుట్లో టి.ఎస్. ఎలియట్ లేడు. పాఠ్యగ్రంథాలలో, సజీవులైన సమకాలీనుల విమర్శకుల ప్రస్తావన లేక పోవడం సంప్రదాయం. ఈ రొమాన్టిక్ కవుల ప్రభావం, ఆనాడు భావకవిత్వాన్ని ప్రచారంలోకి తెస్తున్న తెనుగు కవులపై చాలా వుండటం విన్నాక, వీరిని గురించి సమకాలీనులైన విమర్శకులు ఏమంటున్నారో తెలుసుకోవాలన్న కుతూహలం హెచ్చింది. అదృష్టవశాత్తు ఆసమయంలో ఈ ఎలియట్ గ్రంథం నాకు దొరికింది. చదివి ఉక్కిరిబిక్కిరయ్యాను. అప్పటికి నాలో పాతుకున్న భావాలెన్నో తారుమారైనాయి. షెల్లీ చాలా గొప్పకవి అనీ అతనిప్రతిభ, ఊహాబలం, భావాలు అపూర్వమైనవనీ, ఒక అభిప్రాయం వుండేది. ఎలియట్ విమర్శ చదివినప్పుడు, ఆ అభిప్రాయం మార్చుకోవాలనిపించింది.

అదివరలో నాకు పరిచితులైన విమర్శకుల ధోరణిలో వేరు, ఎలియట్ ధోరణి వేరు. వెనకటితరం విమర్శకులదృష్టిలో, రొమాన్టిక్ కవులు అసాధారణ వ్యక్తులు, శిఖరాలపైనే వారినివాసం. ఎలియట్ విమర్శ చదివాక, వారు **మామూలు** మనుషులుగా, కనబడసాగారు. 'షెల్లీ' అన్నది అంతవరకూ ఒక మధురమైన ధ్వనిగా వుండేది. ఎలియట్ రచన చదివాక, ఆ ధ్వనికి, ఆకృతి, రక్తమాంసాలు, నాడి, మెదడు, వొచ్చాయి.

''షెల్లీ పట్ల మక్కువ ఏర్పడ్డం, యువ్వనదశకు చిహ్నం. నూనూగు మీసాల సమయంలో షెల్లీ చెలికాడు— నడివయస్సులో కూడా అంతటి సన్నిహితుడవుతాడా?''

ఇంకా చూడండి.

''షెల్లీభావాలంటే నాకు అసహ్యం. అతనిభావాలనూ, ఉద్రేకాలనూ విడదియ్యలేం. అతని జీవితంలో ఘట్టాలు స్మరించకుండా అతని కవితని ఆస్వాదించలేం. ఆజీవితం పరిశీలిస్తే, నాకు కనబడే షెల్లీలో హాస్యంలేదు. స్వార్థపరుడుగా, దగాకోరుగా కనబడతాడు,...అతని లేఖలు విసుగుపుట్టిస్తాయి



షెల్లీభావాలంటే నాకురోత. ఈ రోతవల్ల అతని కవితని ఆనందించలేక పోతున్నాను....గణితం చెప్పే కవిత అనతగ్గట్టు అన్నాడుషెల్లీ— అతనికవితంతా గుణవిశాలతో నిండివుంది.'' అని ఎలియట్.

షెల్లీకవిత్వం అప్పుడప్పుడు చదువుతూ వుంటాను. ఆతనంటే గౌరవం ఇంకాకాస్త మిగిలింది. అయినా, ఈ ఎలియట్ విమర్శ మెదడులో ఒకమూల ముసుగులా చెంగు దాచివిప్పినా, కరస్పర్శ జరగకుండా అడ్డుకుంటూనే వుంది.

మరోక అభిప్రాయాన్ని కూడా తారుమారు చేసింది ఎలియట్ గ్రంథం. ఆరోజుల్లో కవిత్వాన్ని ఆస్వాదించాలంటే, ఒక రకం మానసికస్థితి అలవరుచుకోవాలనేవాణ్ణి. మానవుడు ఏకాంతజీవి. వొంటిగా వొస్తాడు, వొంటిగాపోతాడు. చావు పుట్టుకలే పరమసత్యాలు. అనంతవిశ్వంలో మానవుడు అల్పుడు ఈ భావాలని జీర్ణించుకున్నాక ఏర్పడే మానసిక స్థితిలో, కొంత దైన్యం వుంటుంది. కవిత్వాన్ని ఆనందించడానికి ఈ దైన్యం అవసరం— అనుకునేవాణ్ణి. దీనిప్రస్తావన ఈ గ్రంథంలో

"'మంచి 'శైలి' గా తోచిన స్థితిని ఎరగకుండానే, అయిన శైలి ఉత్కృష్ట స్థితిని అందుకుంది."

"అమితమైన ఉద్రేక ప్రకర్ష అంత్యదశ చిహ్నం."

"ఉద్రేకులైనప్పుడే మనుషుల నిజస్వరూపం బైట పడుతుం దనుకునేందుకు ఆధారంలేదు. భౌతికంగా ఉత్పన్నమైన ఉద్రేకంబట్టి చూస్తే, మనుషుల్లో తేడా కనబడదు. అందరూ ఒకలాగే కనబడతారు. ఉద్రిక్తులైనప్పుడు కాక ఇతర అవస్థలలోనే వారి భావ ప్రకర్షకి విలువ ఉంటుంది." బలమైన ఉద్రేకం, బలంగల మనుషుల్లోనే హర్షింపతగ్గది. బుద్ధిని గోల్పోయి, ఉద్రేకానికి లొంగిపోయినప్పుడు మానవత్వాన్ని గోల్పోతాడు మనిషి. నైతిక సంఘర్షణా, తిరగబడి ఎదుర్కొనే శక్తి ఉన్నప్పుడే అతను ఎన్నతగిన మనిషవుతాడు. కాని, జనసామాన్యంలో, ఆ బలమైన ఉద్రేకంగాని, దాన్ని ఎదుర్కొని లొంగదీసుకునే శక్తిగాని లేనందువల్ల, ఎవరన్నా ఉద్రేకం చూపితే మెచ్చుకుని చప్పట్లు కొడతారు ప్రజ. చేత సత్యము, సత్వము లోపించినవారే, ఉద్రేకాన్ని, జీవంగా భావిస్తారు."

నా కథలపైనా, నాటకాలపైనా, ఈ సూత్రాల ప్రభావం కాస్త కూస్త లేకపోలేదు. ఉద్రేకం కనబడక, శిక్షణద్వారా అదుపులోకి తెచ్చుకుని ప్రవర్తించే నాయకులు, నాయికలు, నా రచనలలో కనబడతారు. వీరిని పాఠకుడు మెచ్చు కుంటాడా లేదా అన్నది వేరే విషయం. ఎలియట్ విమ ర్శలు ప్రచారంలోకి వస్తే మెచ్చుకునే అవకాశాలు పెరుగు తాయని మాత్రం అనుకుంటున్నాను.

మరికొన్ని భావాలు.

ఒక కవిని గురించి "అతనిలో చాలా శక్తి ఉంది—కాని బాధపడేందుకే ఆ శక్తి ఉపకరిస్తుంది."

అనాటి భావకవిత్వంలో ఒక విషాదం, దైన్యం, దుఃఖం ఉండేవి. ఇవి రొమాంటిక్ కవిత్వపు ఛాయలు. ఈ విచారానికి కారణమేమిటి ?

"మానవుడి కోరికలకి అనువైన సంబంధ బాంధవ్యాలు మనుష్యులలో లేవన్న జిజ్ఞాస— కవితావస్తువవడం ఒక కారణం. మానవుడికి లభ్యమవని వాంఛలు కాక, మరో రకం వాంఛ లున్నాయని గుర్తించకపోవడం మరొక కారణం. మనంతట మనం స్వయంగా అనుభవించి కొన్ని సత్యాలని కనుక్కోడంలో ఉంది ఆ బాధ."

మరొకచోట :

"మనుష్యులం గనుక మనం మంచో, చెడో, ఏదో ఒకటి చెయ్యాలి. ఓ విధంగా, ఏమీ చెయ్యకపోవడం కంటె చెడు చెయ్యడమే మంచిదనిపిస్తుంది—ఏదో చెయ్యడంవల్ల మనం సజీవులమైనట్లు తెలుస్తోంది. ముక్తిపొందడంలో ఉంది మానవుడి ఘనత. వినాశం చెందడంలోనూ అంతటి ఘనతా వుందేమో."

థామస్ స్టేరన్స్ ఎలియట్ అమెరికాలో మిస్సూరి ప్రాంతంలో సెంట్‌లూయి గ్రామంలో 1888 సెప్టెంబర్ 26వ తేదీని జన్మించాడు. ఆయన పూర్వీకులు 17వ శతాబ్దంలో ఇంగ్లండు నుండి వలసపోయి బోస్టన్‌లో స్థిరపడిపోయినవారే. తండ్రి వ్యాపారస్తుడు. హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో నాలుగేళ్లు విద్యాభ్యాసంచేసి, 1909లో పట్టాపుచ్చుకున్నాడు, ఎలియట్. తత్త్వశాస్త్రం పట్ల శ్రద్ధచూపాడు. 1910లో సోర్బాన్‌లో తత్వము, సాహిత్యము చదివి తిరిగి హార్వర్డ్‌లో మరికొంతకాలం చదువుసాగించాడు. 1913లో విశ్వవిద్యాలయ శాఖలో పనిచేసి జెర్మనీకో తర్వాత ఆక్స్‌ఫోర్డ్‌లో ఉన్నతవిద్య నభ్యసించాడు. 1915లో వివాహానంతరం ఇంగ్లండులో నివాసం ఏర్పరుచుకుని వుండిపోయ్యాడు. కొంతకాలం ఉపాధ్యాయుడుగా, తరువాత బ్యాంకులోనూ పనిచేశాక, 1917లో 'ఇగొయిస్ట్' అనే పత్రిక సహాయసంపాదకుడుగా, పిమ్మట 'క్రైటీరియన్' పత్రిక సంపాదకుడుగా పదేళ్లు పనిచేశాడు. 1917—1920 ల మధ్య రచన మొదలెట్టి ఖండకావ్యాలు ప్రచురించాడు. 1922లో 'బీడునేల' (The waste land) అనే గద్యకావ్యం వెలువడింది. దీనితో ఆధునిక కవితా ఉద్యమానికి మార్గదర్శకుడుగా నాయకుడుగా ఆయన కీర్తి, ప్రభావమూ పెరుగుతూవచ్చి ఈనాడు ప్రపంచ సాహిత్యంలో అగ్రశ్రేణి కవిగా ఆయన స్థానం స్థిరపడింది. 1927 లో బ్రిటిషు పౌరుడుగా, పౌర సత్వపు హక్కులు పొందాడు. 1925నుండి ఫేబర్ ప్రచురణ కర్తల సలహాదారుడుగా ఉన్నాడు. 1930 నుండి ఆయన గేయ నాటకాలు రచించడం మొదలుపెట్టాడు. 'మర్డర్ ఇన్ ది కెతడ్రల్' ను 1935 లో కాంటర్‌బరీలో ప్రదర్శించారు. ఈ నాటకం ప్రేక్షకుల్ని ఆకర్షించింది. మరి నాలుగు గేయ నాటికలు వ్రాశాడు. 1944 లో 'ఫోర్‌క్వార్టెట్స్' (Four Quartets) అనే గేయ సంపుటి వెలువడింది. గతంతో సమన్వయం కుదుర్చుకోడానికి సాగించిన నాలుగు యాత్రల కథనం ఇందలి వస్తువు. ఆధునిక విశ్వకవితారంగంలో. ప్రముఖ విమర్శకులు ఈ కావ్యాన్ని మహా కావ్యంగా ఎన్నిక చేశారు.

1920 నుండి సాహిత్య విమర్శ సాగిస్తూ, ఎన్నెన్నో వ్యాసాలు వ్రాశాడు. సాహిత్యమే కాక, ఇతర సాంఘిక సమస్యలను పరిశీలిస్తూ గ్రంథాలు వ్రాశాడు. 1948 లో ఆర్డర్ ఆఫ్ మెరిట్—బిరుదు, నోబెల్ బహుమానం పొందాడు. ఎన్నో విశ్వవిద్యాలయాలు, డాక్టరేట్ బిరుదు నిచ్చి ఎలియట్‌ని గౌరవించాయి. మొదటి భార్య చని పోయిన కొన్ని సంవత్సరాలకి 1957 లో 'వాలెరి ఫ్లెచర్' అను నామెను వివాహమాడాడు. 1965 జనవరి 4వ తేదీన కీర్తిశేషుడైనాడు. సాహిత్యంపట్ల ప్రేమానురాగాలున్న వ్యక్తులందరూ కంట తడిపెట్టుకున్నారు—ఎలియట్ అస్తమించినప్పుడు.

కాని చిత్రం, 1949 లో ఎడిన్‌బరోలో అంతర్జాతీయ ఉత్సవాల సందర్భంలో ఎలియట్ వ్రాసిన నాటకాన్ని ప్రదర్శించినప్పుడు, "ప్రతివాళ్లూ చెప్పుకుంటున్న ఈ ఎలియట్ ఎవరండీ?" అన్నారట ప్రేక్షకులలో ఒకరు. ఎలియట్ రచనలు చదవకపోయినా కూడా. ఆయన పేరుకి ఎంతో విలువ వుంది. 1930 నుండి వెలువడుతున్న గ్రంథాలలో ఎలియట్ ప్రస్తావన ఉండితీరింది. సాహిత్యం గురించి ఎవరు ఏది వ్రాసినా, ఎలియట్ నిర్వచనాన్ని ఉదహరించకుండా ఉండలేరు. ఆయనతో సమాధానం కుదుర్చుకోకుండా ఏ పాశ్చాత్య రచయితకీ జరగడంలేదు. ఒక్క సాహిత్యరంగంలోనే కాక, విజ్ఞానశాస్త్రం, తత్వం, మతం, తర్కం, నాగరికత, చరిత్ర, కళలు, విద్యావిధానం—వీటిల్లో దేన్నిగూర్చి చర్చ జరిగినా, ఎలియట్ పేరు పేర్కొనడమూ, ఆయన అభిప్రాయాన్ని ఉదహరించడమూ జరుగక తప్పదు. అంతర్జాతీయ సాహితీవేత్త ఎవరంటే, ఎలియట్ అని సమాధానం తడుముకోకుండా చెప్పేస్తారు. నోబెల్ బహుమానం. ఎలియట్‌కి కవిగా ఇచ్చారు గావున, ఆయన కవిత్వం గూర్చి ముందుగా తెలుసుకుందాం.

ఆయన వ్రాసిన ఖండకావ్యాల పేర్లు తెలుగులో చిట్టాగా వ్రాసి విసిగించడం నా కిష్టంలేదు. ఇంగ్లీషుపేర్లు తెలుగులో అవతరించగానే వచ్చిన వికారాభాసం నాకు వదల బుద్ధిపుట్టదు. దానివల్ల ప్రయోజనమూ లేదు. ఆంగ్ల సాహిత్యంతో గాఢమైన పరిచయం లేనివారికి, ఎలియట్‌ని గూర్చి తెలుసుకోవాలన్న కుతూహలం ఉంటుంది. వారిని ఉద్దేశించే నేను వ్రాస్తున్నది కూడా. కాని, ఆంగ్ల సాహిత్యంతో పరిచయం లేనివారికి ఎలియట్ కవిత్వాన్ని గూర్చి చెప్పడం సాధ్యం కాదనుకుంటా. ఎందుకంటే, ఆయన కవిత నిండా ఇతర పాశ్చాత్య కవులనుండి సూచనలు, ఉదాహరణలూ ఉంటాయి. అన్యదేశీయ సాహిత్యాల నుండి కొన్ని వాక్యాలూ, భావాలూ పొందుపరచబడి ఉంటాయి. వాటి విశిష్టత తెలిస్తేగాని, ఈయన కావ్యం పూర్తిగా అవగాహన అవదు. టీకాతాత్పర్యం లేకుండా, తెలుగులో అనువదించి చూపినా ప్రయోజనంలేదు. కావున, అట్లాంటి సూచనలు, ధ్వనులు, ప్రయోగాలు లేని భాగాలలో కొన్నిటిని మాత్రం మచ్చుకి ఉదహరిస్తాము.

ఈయన కావ్యంలోని వస్తువేది ? సంఘంలో ఉత్తమ స్థితి చెందిన ధనిక వర్గాలవారి అహంభావం, ధనార్జనకోసం పన్నే కుతంత్రాలు, కాలక్షేపం అవక వెర్రి పోకడలు పోయిన స్త్రీల మనస్తత్వాలు, నాగరికతలో తాత్కాలిక భౌతిక, లౌకిక పురోభివృద్ధిని అన్వేషించేవారి హృదయాల్లో కరుడుకట్టుకు పోయిన వైరాగ్యం, అసంతృప్తి, మానసికాశాంతి, ఆధ్యాత్మికానుభూతి ఏమిటో తెలియక పట్నాల నాగరికత పెంపొందించడం కోసం ప్రబలిన సంకుచిత ప్రాంతీయ తత్వం, స్వార్థాల సంఘర్షణనుండి బైలుదేరే యుద్ధాలు, మానవత్వం పతనం— ఇవీ కావ్య వస్తువులు.

'కాఫీ చెంచాలతో నా జీవితాన్ని కొలిచివేశానులే.' ఎలియట్ కవితా శైలి లక్షణాలేవి ? ఒకే పాదంలో అందమైనదాన్నీ, వికృతమైనదాన్నీ కుదించడం, ఉదాత్తమైన భావాన్నీ, పోకబారు మాటలనీ ఒకేచోట ప్రవేశపెట్టడం, ఊహాబలంతో ఉద్వేగంతో భాష సాగి ఉద్ధృతమైన కవితావేశం రేకెత్తే సమయంలో దానితోబాటు ఒక సాధారణ చమత్కృతిని విసరడం—ఇవీ లక్షణాలు.

"నేను ముసలివాణ్ణై పోతాను . . .
పంట్లాం చివరలు మడిచి తొడుగుతానులే."

* * *

"వాలుస్తోంది.
వీధి తలుపుమీద నెంబరుంది.
జ్ఞాపకంలేదా ?
తాళంచెవి నీ దగ్గరే ఉంది.
మెట్లమీద ఆ దీపం, ఒక గుండ్రని వెలుగుని మోస్తుంది.
మెట్లెక్కు.
పరుపు సిద్ధంగా వుంది, గోడని టూత్‌బ్రష్,
తలుపు దగ్గర జోళ్లు వొదిలెయ్యి, పడుకో,
జీవితానికి సిద్ధపడు
కత్తి చివరి పోటు."

ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానానికి సంబంధించిన ఉపమానాలు ఉదాహరణలు, సంప్రదాయ కవితారీతులతో మిళితమై వుంటాయి. బస్తీల వీధుల్లో లేచే పొగను గూర్చిన యీ వర్ణన నాకిష్టం.

"కిటికీ అద్దాలపై తన మూతిని రాస్తుంది పసుపు పచ్చపొగ.
సాయంత్రపు మూలలమీద తన నాలుకను ప్రసరింప చేస్తుంది.
మురుగునీటి సరస్సుమీద క్షణం నిలిచి.
వంటింటిపై చూరునుండి రాలిన మసిని తన వెన్నుమీద పోసుకుని
ప్రాకారందాటి, ఒక్కసారి గెంతి
అది అక్టోబర్ మాసంనాటి చల్లటి రాత్రిని గ్రహించి
ఆ ఇంట్లో ముడిచి పెట్టుకుని నిద్రపోతుంది."

పొగనిద్రపోయింది, అదిలేచేటందుకు బోలెడు వ్యవధివుంది. తొందర పడకండి అనిహెచ్చరిస్తూ.

"హత్యకీ, సృష్టికీ బోలెడు వ్యవధుంది.
తింటున్న పళ్లెంలో ఎత్తిపడేసే చేతులకు
తగినంత సమయుంది.
నీకు నాకు బోలెడు వ్యవధి—

వంద అనిశ్చయాలకీ,
వంద దృశ్యాలకే, పునర్విమర్శలకీ—
'టోస్టు టీ, తీసుకునేముందు జరపేచ్చులే.''

* * *

''ఆ గదిలో మహిళలు మైకెల్ఏంజిలో (ఒకశిల్పి) గూర్చి మాట్లాడుతూ.
వస్తూ, పోతూవున్నారు.''

కొన్ని వింత ప్రయోగాలు.

''మూలలకి నవ్వింది.'' ''చంద్రమామ జ్ఞాపకశక్తి పోయింది.'' ''రాత్రుళ్ళు పరిభ్రమించే వాసనంతో ఆమె వొంటిగ వుంది.'' ''మూసినగదులలో అడవాసనలు.'' ''బాధ్యత వెరగని గర్భంలోని పిండములాగ అతను నవ్వుతున్నాడు.'' ''మార్ధ్యలస్మైని వీజడలో అల్లిక్.'' ''మైపోయుపమిచ్చి బల్ల మీద పడుకో బెట్టిన రోగికి మల్లె ఆకాశంకింద పరుచుకున్న సాయంత్రపువేళవ్వికాబోదాము.'' ''మూసెనీ, తారునీ,చెమట్లగా కారుస్తున్నది.'' ఎలియట్ కావ్యాలన్నింటిలోకీ గొప్పదికాక పోయినా 'బీడునేల' ((The waste lanb) అన్న కావ్యం పొందిన ప్రచారం మరే కావ్యమూ పొందలేదు. ఇది వెలువడినప్పుడు, మాకేమీఅర్థం కాలేదన్నారు.మరి కొన్ని యేళ్ళగా వ్యాఖ్యానాలు వెలువడ్డాక, అందరి ప్రశంసల్నీ విపులీకరించ గలుగుతున్నారు. ఈకావ్యంనిండా, ఇతర సాహిత్యాలనుండిభాగాలు, మాటలు. సూచనలు వుండడంవల్లనూ, వస్తువు, ప్రాచీన మానవజాతుల గుర్చిన గాథలను పురస్కరించుకుని సమకూర్చ బడినందునా, ఎలియట్, ఈకావ్యంచివరలో, ఆయాభాగాలలో వాడిన పదాలకి అర్థంచెప్పుతూ వోక వివరణ పట్టిక కూర్చాడు. 17 పుటల కావ్యానికి 7 పుటల వివరణా పట్టిక. అందులో ఇల్లా చెప్పుకున్నాడు ఎలియట్.

"ఈ కావ్యం ఆకృతి, సాంకేతిక పదజాలం చాలాభాగం, జెస్సీ వెస్టన్ అను ఆమె వ్రాసిన 'ఫ్రమ్ రిట్యువల్ టు రొమాన్స్' నుండి సేకరించబడింది. నా వివరణాపట్టిక కంటె, ఆమె పుస్తకమే ఈ కావ్యంలోని అర్థాలని స్ఫుటంగా పరిష్కరించగలదు. కాబట్టి ఇందలి అర్థం పూర్తిగా అవగాహన చేసుకోదల్చినవారు ఆ గ్రంథాన్ని చదవమని కోరుతున్నాను."

కావ్యం స్వయంప్రకాశంగా ఉండలి. అందలి అర్థాన్ని గ్రహించడానికి మరేదో చదివే అవసరం రాకూడదని, ఈ పద్ధతిని ఆనాటి విమర్శకులు దుయ్యబట్టారు. కొందరు అందలి మాటల అర్థాలూ, వాటి వెనక ఉన్న గాథలూ వెదుకుతూ పరిశోధనలు ప్రచురించారు. ఇవేవీ ఆ కావ్యం అందచందాల అవగాహనకి తోడ్పడనందున ఈ పద్ధతిని విరమించారు.

ఈ కావ్యం మొదటిసారి 'డయల్' పత్రికలో ప్రచురించబడినప్పుడు వివరణ పట్టిక లేదుట. పుస్తకరూపంగా ప్రచురించినప్పుడు మరీ చిన్నదైంది. కొంత విషయం చేర్చి, గ్రంథం పరిమితి పెంచాలన్న ఉద్దేశంతో ఇది వ్రాసినట్లు ఎలియట్ తర్వాత చెప్పుకున్నాడు. అంతకుముందు వ్రాసిన కావ్యాలలో ఇట్లాంటి భాగాలుంటే ఎందులోనుంచో దొంగిలించాడన్నరుట. ఇప్పుడూ విమర్శకులు ఇల్లా అనకుండా ంచూ వ్యాఖ్యానం వ్రాసినట్లు కూడా చెప్పుకున్నాడు. ఇంకా ఇల్లా వ్రాశాడు : ''దీనివల్ల కొంత అపకారం జరిగింది. ప్రతి వాడూ సాహిత్యపరిశోధకుల్లాంటివూ, చలామణి అవడం జరిగింది. ఇప్పుడు నేను వాటిని తొలగించినా లాభంలేదు. ఆ వివరణ చిట్టాకున్న ప్రచారం, పలుకుబడి అసలు కావ్యానికి కూడ లేదేమో. ఈ కావ్యాన్ని కొని అందులో వివరణచిట్టా కనబడక పోతే పాఠకుడు ఆ పుస్తకాన్ని ఇచ్చివేసి సొమ్ము తిరిగివ్వమంటాడు.'' అని.

అనేక దేశాల సాహిత్యాలకు సంబంధించిన రీతులు, ధ్వనులు, పదజాలం ఇందులో ఇమిడిఉన్నాయి గనుక, ఇట్లాంటివి లేని ఒకటి రెండు భాగాలని మాత్రం ఉదాహరిస్తాను.

గోల్డ్‌స్మిత్ అనే ఆంగ్లకవి పతితని గూర్చి ఒక ఖండ కావ్యం వ్రాశాడు. ఒక అందమైన కన్య ఒకణ్ణి ప్రేమిస్తుంది. అతనికి లోబడుతుంది. తర్వాత అతడు ఆమెని పరిత్యజిస్తాడు. ఆమె గతి ఏం కావాలి ? ఆత్మహత్య తప్ప మార్గంలేదు. ఇదీ ఆ గేయంలో విషయం. ఈ సమస్యనే ఎలియట్ 'బీడునేల' లో ఇల్లా చిత్రిస్తాడు.

''అటుతిరిగి అద్దంలో క్షణం చూసుకుంటుంది—
ప్రియుడు తనని విడిచి వెళ్లినట్లు తెలియదు.
ఒక్క అసంపూర్ణ భావం ఆమె మెదడులో మసలుతుంది.
'అమ్మయ్య. అది కాస్తా ఐపోయింది— ఇంక బెంగ లేదు.'—

సుందర లలన పతనం చెందినప్పుడు
గదిలో, ఒంటరిగా అటూ ఇటూ పచార్లు చేసి
స్వయంప్రవర్తకమైన చేత్తో జుట్టుని సరిచేసుకుని,
గ్రామఫోను రికార్డు వేసుగుంటుంది.''

సామ్రాజ్యవాదుల దుండగాలకు గురై బీడుపడిన నేల స్వరూపం చిత్రిస్తూ గంగానది ప్రాంతాన్ని ఇల్లా వర్ణిస్తాడు.

''గంగ దిగజారింది,
వానకోసం వేచిఉన్నాయి మెత్తటి ఆకులు—
హిమవత్ శిఖరాలపై నల్ల మేఘాలు గుమిగూడాయి
అడవి, నిశ్శబ్దంతో ఒంగి, పొంచి చూస్తోంది.
అప్పుడు పలికింది పిడుగు
దా—
దత్త, మనం ఏమిచ్చాము ?
రక్తం గుండెని కదుపుతోంది మిత్రమా.

ఒక యుగంపాటు జాగ్రత్తగా ప్రవర్తించి తెచ్చు
కున్న వివేకం తుడిచివెయ్యలేదు.
ఆ క్షణంలో మనం లొంగిపోయి కనబరచిన సాహ
సాన్ని—
దానికోసమే మనం జీవించాం—
ఇది మరణానంతరం పత్రికల శ్రద్ధాంజలిలో పడదులే.

'బీడునేల' అన్న కావ్యం. ఆధునిక కవితా పద్ధతిని నెల కొల్పింది. అనేకుల్లా ఈ పద్ధతిలో వ్రాస్తున్నారు. నిజమే. కానా ఇది గొప్ప కావ్యం అనుకోలేను నేను. అనేక సాహిత్యాలు చదివి, వాటిని ఆధారంగా కృత్రిమంగా కూర్చబడిన కావ్యం ఇది—జీవితపు అనుభవంనుండి, ఒక తృష్ణతో, తపనతో సహజమైన భావన, ఉద్రేకంతో సృష్టించబడ్డ కావ్యం కాదు. నాగరికత ప్రబలినకొద్దీ, కవిత్వం సన్నగిల్లుతుం దన్నాడు మెకాలె. ఆధునిక పాశ్చాత్య నాగరికతని ప్రతిబింబించే ఒక చమత్కారమైన రచన ఇది. వినోదం కల్గిస్తుంది, చక్కిలిగింత పెడుతుంది. ఇతర కావ్యాల వ్యాఖ్యతల వైచిత్రిని అంట జేస్తుంది. నవ్వు పుట్టిస్తుంది. క్రాస్‌వర్డ్ పజిల్‌ని విడదీయుడంలో ఉన్న బుద్ధి కౌశలాన్ని రేకెత్తిస్తుంది, స్థిరపడిన ఆదర్శాన్ని వెక్కిరిస్తుంది. త్రోసిపుచ్చిన వ్యాకులతకి విపరీతార్థం కల్పిస్తుంది. అందరూ చదవవగ్గదే—కానా గొప్ప కావ్యం అనలేను.

నిస్సందేహంగా ఎలియట్ గొప్ప కవి, ప్రతిభాశాలి. 'ది రాక్' అనే కావ్యంలోనూ, 'ఫోర్ క్వార్టెట్స్' అనే కావ్యంలోనూ అద్భుతమైన కవిత్వఖండా లున్నాయి.

"ముందు తిరగ్గానే కనిపిస్తుంది ఎడారి,
రైల్లో ఇరుక్కుని కూర్చుంటే నీ పక్కనే ఉంది ఎడారి,
నీ సోదరుడి మనస్సులో ఉంది ఎడారి."

నిరుద్యోగుల్ని గూర్చి :

"ఖాళీస్థలాల్లో నిలబడతాం,
దీపంలేని గదిలో గబగబ పోతుకుతాం."
"ఇద్దరు మనుష్యులికి పోకేటే సిగరెట్
ఇద్దరు స్త్రీలకి అరగ్లాసు సానీయుం."

"ఫోర్ క్వార్టెట్స్" అనేది మంచి కావ్యం. ఇందలి వస్తువు—మానవుడి ఆంతరంగిక పరిశోధన. 'బరంట్ నార్టన్' ఇల్లు ఖాళీ—దూరంగా తోటలో పిల్లలు ఆడుకుంటూ ఉంటారు. గనక, మరికొందరు సజీవులైన మనుష్యులున్నట్లు గ్రహిస్తాడు. 'ఈస్ట్ కోకర్' లో పల్లె ప్రజలు, అర్ధరాత్రి పొలంలో నాట్యం చేస్తూ ఉంటారు. 'డ్రై సాల్వేజస్' లో బెస్తవాళ్లు చేపలు పట్టడంలో నిమగ్నులై ఉంటారు. తిరిగిరాని భర్తలకోసం ఎదురుచూస్తూ ఉంటారు బెస్తవాండ్ర భార్యలు. 'లిటిల్ గిడ్డింగ్' లో గతంనుండి మిల్టన్, వార్లెస్ మొదలైన ప్రముఖ వ్యక్తులు దర్శన మిస్తారు. మచ్చుకి కొన్ని :

"వర్తమానం, గతం
భవిష్యత్తులో ఇమిడి ఉన్నాయి."

*     *     *

"నా ముగింపు నా ప్రారంభంలోనే ఉంది."

*     *     *

"దేన్ని ఆశించకని కోరాను నా ఆత్మని
అది తప్పిదాన్నే ఆశించవొచ్చు.
ప్రేమించవొద్దన్నాను, కూడనిదాన్నే ప్రేమించవచ్చు
అది, ప్రేమ నేచిఉండడంలోనే."

*     *     *

గాయపడ్డ శస్త్రవైద్యుడు ఉక్కుని నడుపుతాడు
గాయపడ్డ భాగాన్ని ప్రశ్నిస్తుంది ఆ చేష్ట.
రక్తం స్రవించే ఆ చేతుల క్రింద
వైద్యుని అనురాగం స్పృశిస్తాం
వ్యాధిగలిసి మాటిచ్చే పటంలోని రహస్యాన్ని
ఛేదించటం అంటటితో సమాప్తం.

*     *     *

మన జబ్బే మనకున్న ఆరోగ్యం—
బాగవాలంటే వ్యాధి ముదరాలి.
ఈ లోకం
నాశనమైన కోటీశ్వరుడు కట్టించిన
ఆసుపత్రి
ఇక్కడ మనం బాగుంటే
ఆపేక్షతో ఉక్కిరిబిక్కిరై చస్తాము.

*     *     *

పద్య నాటికలను ప్రచారంలోకి తీసుకురావడానికి కృషి చేసినవారిలో ఎలియట్ ముఖ్యుడు. ఇదివరలో చారిత్రిక, పౌరాణిక విషయాలని గురించి కవితాశైలిలో నాటకాలను వ్రాసే సంప్రదాయం ఉంది. వీటిల్లో పాత్రలు, మహానుభావులు, ప్రముఖ వ్యక్తులు, పురాణ పురుషులు అవడంవల్ల వారికి వ్యవహారిక భాష నప్పదనీ, ఉదాత్త సాహిత్యబద్ధమైన శైలి ఉండితీరాలనీ, వారి వాదం. అన్ని దేశాలలోనూ ఈ సంప్రదాయాన్ని అనుసరించారు. కాని, సమకాలిక సమాజాన్ని చిత్రించే నాటకాలలో పాత్రలు సామాన్యప్రజ లైనప్పుడు ఈ కావ్యధోరణి తగదనీ, మామూలుగా నిత్యజీవితంలో వారు వాడే భాషే వాడాలనీ చాలామంది అభిప్రాయం. ఎలియట్ మొదట వ్రాసిన పద్యనాటిక, 'మర్డర్ ఇన్ ది కెథడ్రల్'. ఇందులో పాత్రలు చారిత్రిక వ్యక్తులు. ఇక్కడ గంభీరమైన కవితాశైలి రాణించింది. ఇది గొప్ప పద్యనాటకం. తర్వాత ఈయన వ్రాసిన నాలుగు పద్య నాటకాలూ సాంఘికములు. పాత్రలు ఈనాటి సంఘంలో మన మెరుగున్న వ్యక్తులు.

గేయంగా, పద్యంగా, వీరి సంభాషణ నడిపడం ఎంతవరకూ సమంజసం ! ఈ పద్ధతిని సమర్థిస్తూ చెప్పే కారణాలలో రెండు ముఖ్యమైనవి.

ఒకటి. అపూర్వమైన చిత్త ప్రవృత్తిని పొంది బలమైన ఉద్రేకాన్ని ప్రకటించినప్పుడు, మానవుడు కవిత్వం లోకి జారతాడన్నది. నాటకం అట్లాంటి అపూర్వ సన్నివేశాల కూర్పు గావున, ఉద్రేక ప్రకర్షకి, కవిత్వమే శరణ్యం.

సాంఘిక నాటకంలో పాత్రలకీ, తిలకిస్తున్న ప్రేక్షకులకీ, కాస్త దూరం ఏర్పడాలన్నది రెండో సూత్రం. సాంఘిక నాటకంలో పాత్రలు, ప్రేక్షకజనంలో వారిలాగే ఉంటారు, వేషధారణలో. సహజమైన సన్నిహితం ఇందువల్ల ఏర్పడుతుంది. కాని, ఈ సన్నిహితం మరీ ముదిరితే ప్రమాదిస్తుంది. ఇది కళ,—'ఇదొక నాటకం'—అన్న మాయ, భ్రమ సడలి—రంగస్థలంపై, ఎవరో ఎవరినైనా కోపగించి కొట్ట బోతుంటే, ప్రేక్షకులలో కొందరు రంగస్థలంపైకి ఉరికి 'తన్నండి' అనో, 'ఆగండి' అనో తాము కూడా ఆ పాత్రలలో కలిసిపోయి, కార్యానికి పూనుకొనే ప్రమాదం ఏర్పడుతుంది.

కార్యంతో నిమిత్తంలేకుండా, కాస్త దూరంగా ఉండి, నాటకం అల్లిన వాతావరణంలోకి జారిపోవడానికి కవిత్వం, అవసరం అని ఎలియట్, డ్రై, మొదలైనవారి సిద్ధాంతం. ఇది నాకూ సమ్మతమే. ఎటొచ్చీ, వాడే భాషలో బిగి, గాంభీర్యం, పాత్రల చిత్తప్రవృత్తులను అతిక్రమించకుండా ఒక అదుపులోకి తెచ్చి, వడిపే జిజ్ఞాస పోగొట్టుకోకూడదు. ఈ సైద్ధాంతిని ఎంతవరకూ ఆచరణలో పెట్టొచ్చో పరిశీలిస్తూ, ఎలియట్ నాలుగు పద్య నాటికలు వ్రాశాడు. సామాన్యంగా బైట మర్యాదగా జీవితం గడిపేవారి అంతరంగంలో రగిలే సంఘర్షణ వీటిల్లో ఇతివృత్తమైనందున, ఈ పద్య నాటికలు సంస్కారంగల ప్రేక్షకజనం మన్నన అందుకున్నాయి. పిన్నలు సంప్రదాయంపై తిరుగుబాటుచేసి, గతాన్నుండి తప్పించుకుని వేరే కొత్త జీవిత విధానాన్ని అనుసరించడం అసంభవం—అని చూపడం ఒక నాటకం ఇతివృత్తం. ఇందులో పెద్దలు, తాము చిన్నప్పుడు చేసిన తప్పిదాలు తమ సంతానంపై నీడలుగా ప్రసరించి ఇబ్బంది కలగజేస్తాయి. చెడుగంతా గతంలో దిగవిడిచాను. ఇంక విశ్రాంతిగా ఉండొచ్చు అనుకోవడానికి వీల్లేదు. ఆ గతంలోని ఉదంతాన్ని బైట పెట్టేవాడు ఎప్పుడో తటస్థపడతాడు. అప్పుడు, అది బైటపడకుండా ఉండాలంటే ఆ వ్యక్తిని హత్యచెయ్యాలి. మన చేష్టల ఫలితాలనుండి మనంగాని, మన సంతానం కాని పారిపోలేరన్న నీతి మరొక నాటకంలో వస్తువు.

'ది ఫామిలీ రీ యూనియన్' అనే నాటకంలో నాయకుడు హారీ. ఏదో అపచారం చేసినవాడల్లే బాధపడుతూ ఇంటికి తిరిగి వొచ్చినప్పుడు ఆ బాధ తెరలు విడిపోతాయి. అపచారం తను చేసిందికాదు. తన తండ్రి చేసింది. తన తండ్రి తన తల్లిని హత్యచేయాలన్న 'కసి' తనలో తనే తన భార్యని హత్య చేసిన భ్రాంతిని నెలకొల్పింది.

హారీ : నా జీవితం వొక కల
ఇతరుల మనస్సులు కన్న కల.
ఆమెను తోసేసినట్లు కలగన్నానేమో.

అగాథా : నేనూ అదే అనుకున్నాను.
అవుతే నేం ?
మనం వ్రాసినది డిటెక్టివ్ కథ కాదు—
హత్య, నేరం, పాపం, పశ్చాత్తాపాల ఉదంతం కాదులే.
ఓ దౌర్భాగ్యపు కుటుంబీకుల సంస్కృతి నీవు
ఆ కుటుంబంలోంచి వొక పక్షివై,
ఈ నిప్పులో కాలుస్తున్నావు.

పద్య నాటకాలలో ఉత్తమమైంది 'ది కాక్ టైల్ పార్టీ' అన్నది. మామూలుగా జరిగే 'పార్టీ' సందర్భంలో, జనుల మనస్సుల్లో రేగుతున్న నైతిక సంఘర్షణ, ప్రదర్శిత మౌతుంది ఇందులో.

ఎలియట్ చివరి నాటకం 'ది ఎల్డర్ స్టేట్స్‌మన్' అనేది. ఇందులో నాయకుడు పెద్ద పదవినుండి విరమించి, తన సంతానంనుండి తన కలవాటైన శ్రద్ధాభక్తులను అమితంగా కోరతాడు. తను కాంక్షించినదాన్ని వారు ఇవ్వలేరు. చివరికి తన తప్పిదాన్ని తెలుసుకుంటాడు. అందులో వొక స్వగతం.

"నా బిడ్డలపై ఎందుకు చలాయిస్తావో అధికారం ?
(కొడుకు) మైకెల్‌కి ఇరుకుమార్గం ఎందుకు నిర్దేశించావో ?
ఎందుకంటే—అతనిలో నే నింకా తాండవించాలని.
(కూతురు) మొనికా, ఎప్పుడూ నా దగ్గరే ఉండాలంటావు.
ఎందుకో తెలుసా ?
నాలాంటి మనిషి ఆమెకి తటస్థపడేవరకూ
నా దగ్గరే ఉండాలి.
నే నెట్లాంటి మనిషిని కావాలనుకున్నానో
అట్లాంటి మనిషి ఆమెకి దొరకాలి.
అనుకోడంలో, నా ఘనత ఎట్లాంటిదో
ఎదుర్కొని దగా చేసుకుంటాను."

* * *

మొదట్లో చెప్పినట్లు, నన్నెక్కువగా ఆకర్షించింది ఎలియట్ విమర్శ గ్రంథాలు. కవిగా, నాటక కర్తగా కంటె విమర్శకుడుగా, ఎలియట్ ఖ్యాతి చివరిదాకా నిలిచిపోతుం దనుకుంటా. మహాకవులను గురించి, పాశ్చాత్య సాహితీవేత్తలను గురించి చాలా విమర్శలు వ్రాశారు. డాన్, డ్రైడన్, బాడ్‌లేర్ బ్రామాల్, లాన్సెలట్ ఏండ్రూస్, మార్స్టన్, టూర్నర్,

ఫిర్త్ మొదలైన మరుగుపడ్డ రచయితల విశిష్టతను సోదాహరణంగా చూపి వారిపట్ల అభిరుచి పెంచే యత్నం చేశాడు. శిఖరాలపై నున్న కొందరు కవుల కీర్తి ప్రతిమల్ని కదిపి చూశాడు. ఒకటి రెంటిని కూలదోశాడు కూడా. ఆంగ్ల కవులలో మహాకవిగా మిల్టన్ స్థానం ఏర్పడిపోయింది. నేటి కొందరు తెలుగు రచయితలు ఇంగ్లీషు ప్రయోగాలు, శైలి రీతులు, భావాలూ తెలుగులో ప్రవేశపెట్టి భాషని కలుషితం చేస్తున్నారని పెద్దలు వాపోతున్నట్లే, మిల్టన్ కవి లాటిన్ ప్రయోగాలు, పదాలు, తెచ్చి ఆంగ్లభాషని కలుషితం చేశాడన్న ఫిర్యాదుని చేశాడు ఎలియట్. మిల్టన్‌ది కృత్రిమమైన భాష. ఎవరూ అనుకరించ వీలుకానిది. ఆంగ్లకవితా సాంప్రదాయాన్ని రాజబాటనుండి, మళ్లించి ఎవరూ నడవలేని సందులోకి మళ్లించాడట. ఆయన భాష చైనా గోడలా కవితామతల్లికి అడ్డంగా ఉందిట!

ఇదంతా ఎలియట్ మొదట్లో మిల్టన్‌పై వ్రాసిన వ్యాసంలో ఉంది. పెద్దయ్యాక, తన అభిరుచుల్ని నిర్ణయాల్ని సింహావలోకనం చేస్తూ, మిల్టన్‌పై మరొక వ్యాసం వ్రాసి, అందులో చిన్ననాటి తన వైఖరికి పశ్చాత్తాపం వెలిబుచ్చి, పొరబాటు ఒప్పుకుని, ఆ ప్రతిమను మళ్లా శిఖరంపైన స్థాపించాడు.

కవులపై ఎలియట్ చేసిన విమర్శ జోలికి పోను ఈ వ్యాసంలో. ఎందుకంటే, ఆ కవుల కావ్యాలతో పరిచయం ఉంటే తప్ప, ఆ పరామర్శకి ప్రయోజనం ఉండదు. ఇదికాక, ఆయన కవిత్వం గూర్చి, విమర్శ గూర్చి, ఎన్నెన్నో కొత్త కోణాలను తరిచి చూచారు: నూతన సూత్రాలని ప్రతిపాదించాడు. వీటిల్లో మనకి సులువుగా అర్థమై అన్వయించే కొన్నింటిని గూర్చే వ్రాస్తాను.

గొప్ప గ్రంథాలు చదవడంవల్ల కలిగే అనుభూతి, ఆనందమూ మన వ్యక్తిత్వాన్ని ఎట్లా మార్చివేసేది, జీవిత వికాసానికి తోడ్పడేదీ విశదపరుస్తూ ఇట్లా అంటాడు:

"ప్రాహాజలంతో కూడుకున్న గ్రంథం వ్రాసిన ప్రతి రచయితా మనలో ఉబికిన మనిషిని మొత్తంగా కదపడానికి యత్నిస్తాడు. మనకి ఇష్టం ఉన్నా, లేకపోయినా, మొత్తం మనుష్యులుగా ఆ ప్రభావానికి లొంగిపోతాము."

కవిత్వంపట్ల అభిరుచి ఏర్పడడమూ, కాలంతోపాటు ఆ అభిరుచి అభివృద్ధిచెందడమూ, మనం పెరగడంతో ఆకావ్యం కూడా పెరగడమూ గురించి ఎలియట్ చెప్పినవి, మనందరి అనుభవంలోనివే.

"కవిత్వంపట్ల కాస్త కూస్త అభిరుచిగల ప్రతి వ్యక్తీ యౌవనదశలో ఒక కవి ప్రభావానికో, ఒక కావ్యం ప్రభావానికో పారవశ్యంతో లొంగిపోయిన క్షణాలు జ్ఞప్తి చేసుకోగలడు. ఒకరి తర్వాత ఒకరు— అనేక కవుల ప్రభావాలకి లొంగిపోయి ఉండొచ్చు. నడి వయస్సులో కంటె యౌవనదశలో మన అనుభూతులు, గ్రాహ్యశక్తులూ తీక్షణం అవడమే ఇందుకు కారణం అనుకో నక్కర్లేదు. ఇదంతా ఇల్లా జరుగుతుం దనుకుంటా. చిన్నప్పుడు మన వ్యక్తిత్వాలు పూర్తిగా వికసించి, స్థిరపడవు— పూర్వం, ఆక్రమించేసిన ఖాళీ గదిలాంటివి, అనాటి వ్యక్తిత్వాలు. ఈ గదిలోకి ఎదిగిన కవి వ్యక్తిత్వం ప్రవేశిస్తుంది. ఎక్కువగా చదివే అభ్యాసం లేనివారిలో కూడా, పెద్దయ్యాక ఇట్లాంటిదే జరుగుతుంది. ఏదో ఒక రచయిత ప్రభావానికి పూర్తిగా లొంగిపోతాము— కొన్ని రోజులు. తర్వాత మరొక రచయిత ప్రభావానికి లొంగిపోతాము. మన మనస్సులో ఆ రచయితలు, ఒకరిపై ఒకరు వొత్తిడిచేస్తూ మారుతూ ఉంటారు. వీరిని మనం తూచి, పోల్చి చూస్తాం. ఒకరిలో ఉన్న లక్షణాలు, రెండోవారిలో ఉండవు. అంటే, మనం విమర్శనాదృష్టి అలవరుచుకున్నామన్నమాట. ఈ వృద్ధిచెందే మన విమర్శనాశక్తే, ఏ ఒక్క రచయితకీ పూర్తిగా లొంగిపోకుండా మనల్ని కాపాడుతుంది. అనేకమంది రచయితలతో పరిచయం ఉండడంవల్ల ఇదే ప్రయోజనం. ఒకరి తర్వాత ఒకరు— ఆ రచయితల ప్రభావాలకు గురై ఏ ఒక్కరికీ లొంగిపోకుండా ఉంటామన్నమాట."

నవలలు మొదలైన కల్పనా సాహిత్యం చదవడంవల్ల కలిగే ప్రయోజనం గూర్చి ఎలియట్ అభిప్రాయాలు చూద్దాం.

"నవలల్లోని సన్నివేశాలు, పాత్రలు, చేష్టలూ ఉద్రేకాలూ— వీటిద్వారా జీవితాన్ని గూర్చిన మన పరిజ్ఞానం మూటిగా పెరుగుతుం దనుకోడం కల్ల. మన మెరుగునా మనుష్యులూ, జీవితమూ, వీటికి మనకీ ఉన్న సంబంధమూ— ఈరకం పరిశీలనతో, స్వతంగా అనుభవించి తెలుసుకోడంతో పెరుగుతుంది కాని, కల్పిత జగత్తు ద్వారా కాదు. నవలల ద్వారా మనకి లభించిన పరిజ్ఞానం, ఇతరుల ద్వారా మనం తెలుసుకున్నదే కాని స్వతంకాదు. ఇవన్నీ జీవితాన్ని గూర్చి కాని, జీవితం కాదు. కల్పిత సాహిత్యంలోని సంఘటనలను, మన కళ్లముందు, జరిగినవిగా భావించినపుడు, నిజంతోబాటు, కొంతంత అబద్ధం కూడా, ఎదురౌతుంది."

ఈ జగత్తు మరొక వ్యక్తి కల్పించింది— ఆ వ్యక్తి ఒక రకం మనిషి, అతనికి ఇది ప్రధానమైనదిగా తోచినవి— కొన్నిటికి విలువ కట్టాడు, కొన్నింటిని విసర్జించాడు— అన్న జిజ్ఞాసతో చదివినప్పుడే, కవిత సాహిత్యం మనకి ఉపకరిస్తుందని ఎలియట్ వాదం. మనం పెరిగి పెద్దవాళ్లమై, అనేక నవలలు చదివాక, వివిధమైన దృక్పథాలు, జీవిత విలువలు మనలో ఇమిడిఉంటాయి. ఉత్తమ గ్రంథాలు చదవడంవల్ల మనం పొందే ప్రయోజనం కూడా ఇదేనన్న కొంద కొందరి వాదాన్ని ఖండిస్తున్నాడు ఎలియట్.

"మన అభిరుచిని సరిదిద్దుకునే ఉద్దేశంతో, శ్రద్ధగా చదివినప్పుడు కంటె, కాలక్షేపానికి, వినోదానికి చదివిన కల్పిత

సాహిత్యాన్నుండే విలువైన ప్రయోజనాన్ని పొందుతామని నా నమ్మకం. శ్రమ లేకుండా, కులాసాగే చదివి పారేసే గ్రంథమే మనసుపై స్థిరమైన ప్రభావాన్ని చూపుతుందేమో" అంటాడు. దీని పర్యవసానం ఏమిటి? కాలక్షేపానికీ, వినోదానికీ, మనం ఎక్కువగా సమకాలిక సాహిత్యం చదువుతాం గనుక, సమకాలిక రచనలనే మనం జాగ్రత్తగా పరిశీలించి, పరామర్శించాల్సి ఉంటుందన్న 'షరా' తో ఇలా అభిరుచిని గూర్చిన ప్రస్తావన ముగిస్తాడు.

సాహితీ సంప్రదాయానికీ, వ్యక్తిగతమైన ప్రజ్ఞకీ ఉన్న సంబంధాన్ని వివరిస్తూ ఎలియట్ చేసిన కొన్ని నిర్వచనాలు అద్భుతమైనవి. ఆయన తన 'వేస్ట్‌లాండ్' అనే కావ్యాన్ని ప్రచురించినప్పుడు, అది ఆంగ్ల సాహితీ సాంప్రదాయానికి విరుద్ధమైనదిగా ఎన్నికచేసి, ఆనాటి విమర్శకులు విరుచుకు పడటంతో ఎలియట్ సాహితీ సంప్రదాయం అంటే తనే మనుకుంటున్నాడో విశదపరుస్తూ వ్యాసరచనకి పూనుకున్నాడు.

"పెడసరమైన కొన్ని విశ్వాసాలని ప్రతిపాదించటం మాత్రమే సాంప్రదాయంగా ఎంచడంలేదు నేను. సహజమైన అలవాట్లు, పనులు, ఆచారాలు—మత సంబంధమైన కర్మకాండ నుండి అపరిచితుణ్ణి ఆహ్వానించే విధానం వరకూ ఏదైనా సరే,—ఒకే స్థలంలో ఉండే వ్యక్తుల రక్తసంబంధాన్ని సూచించే ప్రక్రియలూ—ఇవన్నీ సంప్రదాయంలో ఇమిడి ఉంటాయి. సంప్రదాయంలో నిషేధింపబడినవి ఎన్నో ఉంటాయి. నిషేధింపబడినవన్నీ చెడ్డవనీ, నేడు వాటిని పరిత్యజించాలనీ కొందరు అభిప్రాయపడుతున్నారు. ఇది నాకు ఆశ్చర్యంగా ఉంది.

శరత్కాలపు గాలికి ఆకులు ఊడిపోగా మిగిలిన చెట్టు మన దృష్టిని ఆకర్షించినట్లు కొన్ని ఆచారాలు, అలవాట్లు నిషేధింపబడినప్పుడే మన దృష్టిని ఆకర్షిస్తాయి. హైరాణలో ఆ రాలిన ఆకుల్ని ఏరి, వాళ్ళ కొమ్మలకు అతికించే యత్నం చెయ్యొచ్చు—కాని ఆ చెట్టులో ఇంకా చేవవుంటే, కొత్త ఆకులు అందుకొంచి ఎల్లాగూ పుడతాయి గావున ఆ ఎండిన చెట్టుని నరకడం మేలు.

మార్పులేక స్థిరంగా నిలిచిపోయేది సంప్రదాయమని మనలో మరొక అభిప్రాయముంది. ఇది పొరబాటు. తమ ఆధిక్యతని ప్రకటించుకోడానికి, కొందరు సాంప్రదాయాన్ని పట్టుకు వ్రేళ్లాడతారు. ఇదీ పొరబాటే. ఒక సమయంలో, ఒక సమాజానికి, సాంప్రదాయం ఎంతవరకూ ఉపకరిస్తుందో పరిశీలించి, మంచిని స్వీకరించి అనవసరమైనదాన్ని పరిత్యజించడం జరిగినప్పుడే మనం ఆశించిన సమాజం లభిస్తుందనొచ్చు."

ఆస్తి సంక్రమించినట్లుగా సాంప్రదాయం మనకి సంక్రమించదు. దాన్ని సంపాదించుకోవాలంటే మనం ఏంచెయ్యాలి అన్న ప్రశ్నకి, ఎలియట్ సమాధానం ఇది.

"పాతికేళ్ళు దాటిన తర్వాత కూడా కవిత్వం కొనసాగించదలిచిన ప్రతి వ్యక్తీ, చరిత్రపట్ల ఒక దృక్పథం అలవరచుకోవాలి. భూతకాలంయొక్క గతాన్ని మాత్రమేకాక, వర్తమానకాలంలో దాని ఉనికిని గ్రహించగల జిజ్ఞాస కలిగి ఉండాలి. గతంపట్ల ఇట్లాంటి మమత ఉన్నవాడు, సమకాలిక జగత్తునంతా మన ఎముకల్లో జీర్ణించుకొని రచన సాగించడమే కాకుండా, ప్రపంచ సాహిత్యం లోతుపాతులతో పరిచయం కలిగి, ఆ విశ్వ సాహిత్యం, తన జాతి సాహిత్యంయొక్క అవధులేవో తెలుసుకోడం, ఈ రెంటి ఏక కాలీనతలో ఒక అంతరం ఉన్నదన్న చైతన్యంతో కలం పట్టిన రచయిత, సాంప్రదాయాన్ని వదులుకోలేడు. కాలానికి లొంగని విలువల్ని గురించి పట్టించుకునేవాడు, తన కాలానికి ముడిపడ్డ ప్రయోజనాలని సాధించి తీరతాడు."

రచయిత ఏకాంతజీవి, సాంప్రదాయం లేవదీసిన గోడల మధ్య ఉండలేడు, వాటిని పడగొట్టి, విముక్తుడు కావాలి—అన్న వాదం ఒకటి ప్రచారంలో ఉన్నరోజుల్లో, ఆ వాదాన్ని త్రోసిపుచ్చ సాహసించిన కొద్దిమంది విమర్శకులలో ఎలియట్ అగ్రగణ్యుడనే చెప్పాలి. "ఏకాకిగానున్న ఏ రచయితా పూర్తిగా అర్థమవడు. గతించిన కవులమధ్య అతనిస్థానం తెలుసుకున్నప్పుడే, అతని కవిత్వానికి ప్రయోజనం ఏర్పడుతుంది. ఒక కొత్త రచన వెలువడగానే, వెనకటి రచనల విలువలన్నీ మారి, మరొక క్రమం ఏర్పడుతుంది." ఎంతటి అధునికుడైనా, ప్రాచీన కవులను కొలిచిన కొలతబద్దలతోనే, కొలవబడాలి అంటూ వెనకటి కవులు నెలకొల్పిన సాంప్రదాయాన్ని విస్మరించకూడదని హెచ్చరిస్తాడు ఎలియట్. గతాన్ని గూర్చిన జిజ్ఞాస కవి తన జీవితాంతం పెంపొందించుకోవాలంటాడు. ఈ సందర్భంలోనే ప్రతి కళాకారుడూ వళ్ళు వేయవల్సిన నిర్వచనం చేశాడు ఎలియట్.

"ఆక్షణంలో తనని మించిన విలువలకి లొంగిపోవాలి కళాకారుడు. అనుక్షణమూ, ఆత్మత్యాగం చెయ్యడంలో తన వ్యక్తిత్వాన్ని అంత మొందించడంలో ఉంది కళాకారుడి పురోగమనం. ప్రత్యేకమైన తన వ్యక్తిత్వం విచ్ఛిన్నమైనవాడు, అతని రచన సాంప్రదాయంలో ఒక భాగంగా స్థిరపడిపోతుంది. ఆ స్థితిలో కళ కూడా, విజ్ఞానశాస్త్రానికున్న హోదాని తెచ్చుకుంటుంది." కళాకారుడి వ్యక్తిత్వం—ఒక ఉద్యమంగా చలామణి అవుతున్న ఈ రోజుల్లో, వ్యక్తిత్వాన్ని త్యాగంచేసి, పరోక్షమైన విలువ సాధించి, విజ్ఞాన శాస్త్రానికున్న స్థూలమైన పరిణామాన్ని కళ కూడా అందుకోవడంలోవున్న సౌందర్యాన్ని పరిచయం చేసిన ఎలియట్ నిజంగా అభినందనీయుడు.

"కళాకారుడు పరిపూర్ణుడైనకొద్దీ, అతనిలో బాధపడే వ్యక్తీ, సృష్టిచేసే మనస్సూ విడిపోయి, దూరమౌతాయి. ఈ ఎడబాటువల్లనే అతను సృష్టించిన రచనకి పుష్టి సమకూరుతుంది."

అపూర్వమైన అనుభవాలు, వాటినుండి జనించే అసాధారణమైన ఉద్రేకాలు కవికి లభించినప్పుడే అతని కవితకి ఒక విశిష్టత సమకూరుతుందన్న వాదాన్ని ఖండిస్తాడు ఎలియట్. కవిపొందే రాగమూ, భావమూ, సార్వసాధారణమైనవే కావచ్చు. కాని అతని కవితలో ప్రత్యక్షమయ్యే మనస్తత్వము సంక్లిష్టమైనది కావచ్చు—కాని అది అసాధారణమైన అనుభవం పొందిన వ్యక్తిలో కలిగే మిశ్రితమైన చిత్తక్షోభ అనక్కర్లేదు. చాలామంది కవులు రాగంలో, భావంలో కొత్తదనం అన్వేషించడం పొరబాటంటాడు ఎలియట్. కొత్తదనాన్ని అన్వేషించడం, వక్రమార్గాన్ని కనుక్కోడంలో అంతమొందొచ్చు.

"కొత్త చిత్తప్రవృత్తులను కనుక్కోడం కవి పనికాదు. యథార్థమైన ఉద్రేకంలోలేని చిత్తవృత్తులను వ్యక్తంచేసి, కవితలో అవతరింప చెయ్యడం మాత్రమే అతని పని. తాను నిత్య జీవితంలో పొందని అనుభూతులు కూడా, ఇందుకు ఉపకరిస్తాయి" అంటాడు.

ఐతిహ్యాన్నిగూర్చిన ఈ వ్యాసం ముగింపు మరపురానిది.

"విచ్చలవిడిగా ఉద్రేకాన్ని పైకి ఉబికించడం కవిత్వం పనికాదు—ఉద్రేకాన్నుండి పారి పోవడమే కవిత్వం సాధించేది. వ్యక్తిత్వ ప్రకర్ష కాదు. వ్యక్తిత్వాన్నుండి పారిపోవాలి. వ్యక్తిత్వమూ, ఉద్రేకాలూ ఉన్నవారికే ఇట్లా వీటినుండి పారిపోవడం అంటే ఏమిటో తెలిసొస్తుంది."

కవిత్వానికీ, తత్త్వశాస్త్రానికీ, మతానికీ దగ్గర సంబంధం ఉన్నదని ప్రపంచ సాహితీపరులు అవెూదించిన విషయమే. ఈ నమ్మకాన్ని పురస్కరించుకుని, మహా కవుల కావ్యాలలో లీనమైన తత్త్వజ్ఞానాన్ని విడగొట్టి పరామర్శించడం జరుగుతూనే ఉంది. మతం ఆదేశించిన నైతిక చింతన, ఆధ్యాత్మిక విలువలు షేక్స్పియర్ నాటకాలలోలేవు గనక, షేక్స్పియర్‌ని గొప్పకవిగా అంగీకరించలే నన్నాడు టాల్‌స్టాయ్. వాల్మీకి, సోఫొక్లిస్, డాంటె, గెటె, కాళిదాసు, టాగూర్—వీరి కావ్యాలలోని తత్త్వజ్ఞానాన్ని పరిశీలించి, తాత్త్వికచింతనని కవితతో ముడిపెట్టే సంప్రదాయముంటుంది. మతంలో నమ్మిక, రాజకీయవాదంపట్ల సానుభూతి, ఏదో ఒక తత్త్వం, సామాజిక పరిజ్ఞానం—ఇవేవీ కవికి అవసరం లేదనడు ఎలియట్. వీటిపట్ల అతనికి గురి, విశ్వాసము ఉండితీరాలి. సమాజంలో అతనికున్న స్థానాన్ని గూర్చిన జిజ్ఞాస పోగొట్టుకోకూడదు. కాని, తన వ్యక్తిగతమైన నమ్మకాలు, భావాలు, విశ్వాసాలు, కవిత్వంలో ప్రాధాన్యం ఇవ్వడంవేరు. సమాజం సిద్ధంచేసి అమర్చియుంచిన తాత్త్విక స్వరూపాన్ని విడనాడి, స్వంతంగా తా నొక వూహా సామ్రాజ్యాన్ని, తత్త్వాన్ని కల్పించుకుని అర్థంకాని కవిత వ్రాసినందుకు, బ్లేక్ కవిని దుయ్యబట్టాడు ఎలియట్. సమాజ స్వరూపంతో అన్వయం కుదరని ఒక సొంత తత్త్వం కల్పించుకుని చిత్రిస్తే ఆ చిత్రణ ఎవరికీ అర్థం కాకుండా పోతుంది. కవి, తన కావ్యంలో ఎంతవరకూ తాత్త్వికచింతన కొనసాగించాలి అన్న విషయంగూర్చి నిర్దేశించే హక్కు మనకి లేకపోయినా, విమర్శకుడు, ఈతాత్త్వికచింతనలో ఎంతవరకూ నిమిత్తం పెట్టుకోవాలో నిర్ణయించుకుని కొన్ని గిరులు గీసుకోవాలంటాడు ఎలియట్. కవితలో తాత్త్వికచింతనపట్ల అభిరుచిగల విమర్శకులు, అసలు కవితని విస్మరించి తమ స్వంత తత్త్వాన్ని కవికి ఆపాదించి విపరీత వ్యాఖ్యానం చెయ్యడమన్నా జరుగుతుంది. లేదా ఏ తత్త్వం జోలికీపోక, స్వచ్ఛమైన కవిత ఒకటున్నదంటూ, ఆ కవి వెనకవున్న సంస్కృతినీ చరిత్రనీ, సమాజాన్నీ విస్మరించి సంప్రదాయబద్ధమైన విలువలతో నిమిత్తం ఒదులుకుని, గాజుమేడలో ఏకాంతజీవనానికి పూనుకోడమేనా జరుగుతుంది. ఈ రెండూ ప్రమాదకరమైన దృక్పథాలేనంటాడు ఎలియట్. ముఖ్యంగా అధునికయుగంలో విజ్ఞానశాస్త్రం ప్రబలి, మతంపట్ల విశ్వాసం సన్నగిలుతూంది- ఆధ్యాత్మికచింతన, సంప్రదాయం నెలకొల్పిన ఆరాధనభావం, అతీంద్రియ జ్ఞానాన్వేషణ మరుగుపడుతున్నట్లు గ్రహించి వాటిని విడనాడలేక, ఏ కొత్త తత్త్వంలోకో జారి, ఓదార్పుపొందుతున్నారు జనం· మతంలోని ఉద్రేకాన్ని మాత్రం తీసుకుని దానితో మిళితమైన కర్మకాండని విసర్జించాలని కొందరి యత్నం. కావల్సిన మన శ్శాంతి కవిత్వంలో చూరగొంటావని మరికొందరి యత్నం. విజ్ఞానశాస్త్రంలో కవిత్వం లేదా అని కొందరి ప్రశ్న. ఈ గంద్రగోళంలో కవితా ప్రపంచం సరిహద్దులు తారుమారై, అదే మతంగా, తత్త్వంగా తటస్థపడుతూండడం గమనించి ఎలియట్ మళ్ళ సరిహద్దుల్ని గీసి సుస్థిరం చెయ్యాలని గట్టి యత్నంచేశాడు. కొన్ని వాక్యాలను ఉదహరిస్తాను.

"ఉద్రేకానికి ప్రస్ఫుటమైన స్వరూపంలేదనీ, భావానికి స్ఫుటమైన ఆకృతి ఉందనీ చెప్పుకుంటూ ఉంటాము. నిజానికి, ఉద్రేకంలో కూడా స్పష్టమైన ఉద్రేకం, అస్పష్టమైన ఉద్రేకం అంటూ ఉంటాయి. స్పష్టమైన భావ ప్రకర్షకి ఎంతటి బుద్ధికుశలత అవసరమో, స్పష్టమైన ఉద్రేకాన్ని ప్రకటించడానికి అంతటి బుద్ధి కుశలతా అవసరమే."

షేక్స్పియర్ నాటకాల్లో తత్త్వాన్ని వెదికేవారిని ఆక్షేపిస్తూ ఇల్లా అంటాడు ఎలియట్.

"షేక్స్పియర్ నాటకానికి అర్థంలేదు అనడం పొరబాటైనా, షేక్స్పియర్ ఏ ఒక నాటకంలోనూ 'అర్థం' అంటూ ఒకటుందనుకోను. 'ఇది జీవితం'అని భ్రమింపచేసేదే గొప్ప కవిత్వం. షేక్స్పియర్, డాంటె, వర్జిల్ హోమర్, సొఫక్లీస్‌లు కల్పించిన జగత్తులోకి ప్రవేశించినప్పుడు, బుద్ధిబలంవల్ల గ్రహించి ప్రకటించగలదేదో ఆ జగత్తులో ఉందనుకుంటాం—ఇందుకు కారణం? స్పష్టమైన ప్రతి ఉద్రేకమూ బుద్ధి ద్వారా ప్రకటితమవడానికి అనువైందిగా ఉంటుంది." ఈ వ్యాసం ముగింపులో ఇల్లా అంటాడు. "తత్త్వానికీ, మతానికీ బదులుగా ఎంచడానికి వీలులేదు. కవిత్వాన్ని; దాని పనివేరు. ఆ ప్రయోజనం రసానికీ, ఉద్రేకానికీ సంబంధించింది గన

బుద్ధికుశలతకి తెలిసిన రీతిలో దాన్ని వ్యక్తం చెయ్యడం సాధ్యం కాదు."

మరొకచోట :

పరిశోధనకి, పాండిత్యానికీ లొంగని ఉదంతం గొప్ప కవిత్వంలో కొంతైనా ఉండితీరుతుంది—మనకి ముఖ్యమైనది కూడా అదే. కావ్యం సృష్టించబడగానే, ఏదో ఒక క్రొత్త వస్తువు తటస్థపడుతుంది. దాని పుట్టుకనీపూర్వం ఏం జరిగిందో శోధించినంతమాత్రాన ఆ రహస్యం బైటపడదు. బైటపడనప్పుడే దాన్ని సృష్టి'గా భావిస్తాను.

కవిత్వంకంటె జాతీయమైన కళ మరొకటి లేదంటాడు ఎలియట్. తన ప్రాంతంలో, తన ప్రజలో కవి ప్రభావం తగ్గి, కవిత్వం వెనకబడినప్పుడు, ప్రతి ఒక్కరూ బెంగపడటం చాలదు. తన చుట్టు పక్కల ప్రాంతాలలో, ఇరుగు పొరుగు వారిలో కవిత్వం ప్రాముఖ్యాన్ని గోల్పోయినా కూడా మనందరం ఖేదపడాలంటాడు. ఈ వాక్యాలు ప్రతిఒక్కరూ గమనించ తగ్గవి.

"మతంపట్ల నమ్మకం తగ్గిపోతోందని ప్రతివారూ అంటున్నారు. మతంతో ముడిపడ్డ మన్నితమైన అనుభూతి దిగజారిపోతోందన్న విషయం వీ రెవరూ గుర్తిస్తున్నట్లు లేదు. మన పెద్దలు నేర్పిన దైవారాధనాభావం, కొన్ని విశ్వాసాలు మనలో లేకపోవడంలో విశేషంలేదు. వారికున్న ఆధ్యాత్మిక చింతన, తత్సంబంధమైన ఉద్రేకమూ మనలో లోపించడమే ఆధునిక యుగంలోవున్న బాధ. ఇప్పుడు మనకి ఒక నమ్మికలో విశ్వాసం కుదరకపోయినా, అనమ్మిక ఏమిటో అర్థంచేసుకోగలం. కాని మత సంబంధమైన అనుభూతి మాయమైనప్పుడు, చరిత్ర ప్రారంభంనుండీ మానవుడు సృష్టించిన భాష, భావాలూ అర్థరహితమైనవిగా కన్పడతాయి. కవితాభావము, రసము, దేశ దేశానికీ, యుగ యుగానికీ మారినట్లుగానే మత సంబంధమైన అనుభూతి కూడా మారుతూ ఉంటుంది. ఆది గ్రంథం మారక పోయినా అది పురిగొల్పే అనుభూతి మారుతుంది. ఇది మానవ జీవితం తప్పించుకోలేని అవస్థ. ఇవి జీవించడం గురించికంటె, మృతిచెందడం గురించి నేను ఆదుర్దాపడతాను. ఏమో ముందు ముందు కవిత్వం ప్రేరేపించే ఉద్రేకం, భావం అన్ని దేశాల లోనూ మాయమవుతాయేమో—అట్లా జరిగిననాడు చాలా మంది కోరుతున్నట్లుగా ఈ ప్రపంచం అంతా ఒకటే నన్నది యథార్థమై పూరుకుంటుందేమో".

1944 లో 'ఏది మహా కావ్యం?' అన్న విషయమై ఎలియట్ ఇచ్చిన ఉపన్యాసం ఉత్కృష్టమైనది. ఆయన వ్రాసిన సాహితీ వ్యాసాలలో, గొప్పదిగా పరిగణించదగ్గ ఒక్క వ్యాసాన్ని పేర్కొనమంటె, దీన్నే ఎన్నుతాను. ఆయన వూహా బలం, శైలిపటిమ, పాండిత్యము, విమర్శనాకౌశలము, హాస్యము ఉదాత్తభావ ప్రకర్ష, గంభీర భావాలను సోదాహరణంగా అమర్చి, తర్కబద్ధంగా ముందుకు తీసుకువెళ్లగల చమత్కృతి, విశ్వ సాహిత్యం వర్థిల్లాలన్న ఆవేదన, అంతర్జాతీయ దృక్పథం, ఒక ప్రత్యేకమైన సూత్రాన్ని ప్రపంచసాహిత్యానికి అన్వయింప చేసే తృష్ణని పాఠకుడిలో రేకెత్తించగల వైచిత్రి, విషయం ఏదికాదో పరామర్శించి, అదేదో తేల్చడం, స్వల్పవిషయాలపట్ల శ్రద్ధాభక్తులు, కవిత్వంపట్ల, విమర్శపట్ల అనురాగం, ఉద్రేకాన్ని ఉటికించి, పొంగిపొర్లకుండా నొక్కిపట్టే మానసిక శిక్షణ, నిజాయితీ, చెప్పిన విషయాన్ని, ఎవరికివారు, వారివారి దేశాల కవిత్వానికీ, కవులకి అన్వయించి, పోల్చి చూసుకునే పటిమను రగల్చడం—ఎలియట్ విమర్శలలో ప్రత్యక్షమయ్యే ఈలక్షణాలన్నీ యీవ్యాసంలో దర్శనమిస్తాయి. ఇప్పుడు ఆవ్యాసంలో విశేషాలను విపులీకరించడానికి పూనుకోవడం లేదు నేను.

ఏదిమహాకావ్యం అన్నప్రశ్నకి, ఆయన చెప్పిన సమాధానం మాత్రం ఇక్కడ చెప్తాను.

ఒకదేశపునాగరికత పరిపాకముచెంది నప్పుడూ, అనాటి భాష, సాహిత్యము సమరసతము చెందినప్పుడూ, కవి మనస్సు పరిపక్వంచెంది నప్పుడూ మహాకావ్యం అవతరిస్తుంది. 'పరిపాకం' అంటేఏమిటో పరిపాకముచెందని వారికి తెలియచెప్పడం సాధ్యం కాదు. మనంఎదిగి, పరిపక్వత కలిగివుంటే, ఆలక్షణాన్ని వెంటనే గుర్తిస్తాము. పరిపక్వమైన భాషతోపాటు, పరిపక్వమైన వేషభాషలు, చేష్టలు, అలవాట్లు కూడా వుండాలి. గతాన్నిగూర్చి విమర్శాత్మకమైన జిజ్ఞాసవుండాలి ప్రజలలో—వర్తమానంపట్ల విశ్వాసం కుదుర్చుకోవాలి, భవిష్యత్తుగూర్చి అనుమానాలు కూడదు. కవికి పూర్వకవులనుగూర్చి తెలిసుండాలి. ఆతని వెనుక ఉన్న సంప్రదాయంతో మనకి పరిచయం ఉండాలి. ప్రజామోదం పొందిన శైలిలో ఆయువుపట్లు కని స్వంతం చేసికోవాలి. సిద్ధమైన మనస్సు ఉండాలంటే చరిత్ర-దాన్నిగూర్చి జిజ్ఞాస మాత్రమే కాకుండా మరొకదేశపు నాగరికత చరిత్రలని గూర్చిన పరిజ్ఞానం సంపాదించాలి. ప్రాంతీయభావం నమసి విశాలదృక్పథం అలవడడానికి ఈరకంగా ఎదిగిన ప్రజ కావాలి. ప్రజామోదంపొందిన సామాన్యశైలి అంటే, అట్లాంటి శైలి తటస్థపడగానే "ఇదొక ప్రతిభాశాలి వాడిన భాష" అని ఆశ్చర్యం ప్రకటించక "ఇది ఈభాషలోని ప్రతిభని పూర్తిగా వ్యక్తం చేసింది" అనగలగాలి.

"ఈనాడు వొస్తు సముదాయాన్ని గూర్చిన భోగట్టా జ్ఞానంగా చలామణీ అయి, జీవితసమస్యలను సాంకేతిక నిపుణుల ద్వారా పరిష్కారం చేసుకుంటున్నాం. ఈపరిస్థితులలో మరో రకం ప్రాంతీయతత్వం ప్రబలుతోంది. ఇదికాలానికి గాని, స్థలానికి సంబంధించింది కాదు. ఇది ప్రచారంలో కొస్తే, అందరం కలిసి ఒకరకం ప్రాంతీయతత్వం అమలు జరపడం జరుగుతుంది. ఈప్రమాదం తప్పాలంటే, ఆదర్శగ్రంథం లక్షణాలను గురించి మనం పట్టించుకోవాలి."

ప్రథమంలో తాను రచించిన విమర్శలూ, కావ్యాలూ, వల్ల ఆధునిక సాహితీకృషికి మార్గదర్శకుడుగా ఎంచబడినా ఒకదశలో, ఎలియట్ చేసిన నిర్వచనం, అమితమైన ప్రచారం పొంది, ఆయన్ని అంతవరకూ మెచ్చుకుంటూవొచ్చిన వారంతా పెదవి చప్పరించి. అసంతృప్తి, విముఖత కనబరచసాగారు,

సాహిత్యంలో వాది సాంప్రదాయకమైన మార్గము; రాజకీయంలో రాజపక్షావలంబిని, మతంలో, రోమన్ కాథలిక్‌ని."
ఇదీ నిర్వచనం. ఈఆదర్శం చాలామందికి నచ్చినట్టులేదు. ఇందుకు కారణం లేకపోలేదు. మొదటి ప్రపంచసంగ్రామానంతరం, ప్రజలకి రాజులపట్ల, నియంతలపట్ల, విశ్వాసం సడలింది విజ్ఞానశాస్త్రాభివృద్ధితోపాటు, మతంపట్ల విశ్వాసం సడలింది. సాంప్రదాయకమైన మహాకావ్యాలు, పాఠ్యగ్రంథాలైన ఆదర్శగ్రంథాలు, ఈ విలువలచుట్టూ అల్లబడి ఉంటంవల్ల సాంప్రదాయ సాహిత్యంపట్ల గురితప్పింది. సామాన్యమానవుడు ప్రధాన వ్యక్తయ్యాడు; గుంపు సంస్కృతి ప్రచారంలో కొచ్చింది. విజ్ఞానశాస్త్రం సాధించిన ఫలితాలని మానవులందరూ సమంగా పొంది, జాతివిచక్షణ లేకుండా, ఒక సర్వమానవ సమాజం నెలకొల్పబడాలన్న నినాదాలు బైలుదేరాయి. ఈప్రవాహంలో ఎలియట్ వెలిబుచ్చిన పద్ధతి ఎదురీతలా తోచింది.

తన ఆదర్శాలని, మార్గాన్నీ విపులీకరించి, సమర్థిస్తూ ఎలియట్ ఎన్నో రచనలు చేశాడు. 1939 లో 'క్రైస్తవ సమాజం గూర్చి ఒక అభిప్రాయం అన్న శీర్షిక నిచ్చిన ఉపన్యాసాలని గ్రంథంగా వెలువరించాడు. సంస్కృతీ సాహిత్యాలకూ, కళలూ, నాగరికతకూ మతం పునాది. ఒక ప్రాంతంలో అవతరించిన మతం నిర్దేశించిన సూత్రాలని, జీవితవిధానాన్ని, సంస్కృతి, నాగరికతలను విడగొట్టలేం. అదిమంచిది కూడా కాదు. మతంవెనకవున్న ఆవేదన, తృష్ణ, ఉద్రేకం కళలకి వెన్నెముక లాంటివి. ఆఆవేదన, ఉద్రేకం విస్మరించి, స్వచ్ఛమైన కళని ఆరాధించాలనుకోడం వెర్రి—అదీ ఎలియట్ ఈగ్రంథంలో చెప్పదల్చుకున్నది. ఇదంతా పాశ్చాత్యదేశాలలోని క్రైస్తవ సమాజాన్ని గురించి చెప్పినప్పటికీ, ఇతరదేశాలవారుకూడా తమ మతాన్ని గురించి ఆలోచించుకునే అవకాశం కలగచేస్తాడు ఎలియట్. క్రైస్తవసమాజం బదులు, హిందూసమాజం, బౌద్ధసమాజం—గూర్చి ఆలోచిస్తే ఈసూత్రాలన్నీ ఎంత వరకూ ఆయామతావలంబులకు వర్తిస్తాయో తెలిసొస్తుంది.

"మతాన్ని బుద్ధిబలంతో అంగీకరించి గౌరవించాలి, వొక్క ఉద్రేకంతో అంగీకరిస్తే చాలదు."

" 'నేను క్రైస్తమతావలంబకుణ్ణి' అని చెప్పకున్న వ్యక్తిని దండించక విడిచేసే సమాజాన్ని నెలకొల్పమని తృప్తి పడాలి. కాని మనం నిజంగా పాటిస్తున్న జీవితపు విలువల్ని గూర్చిన పరిజ్ఞానం యొక్క స్వరూపాన్ని యెదుర్కోక దాచి వేస్తున్నాం. ఇతర సమాజాలని ఆక్షేపిస్తూ, మనకీవారికీ వున్న సన్నిహితత్వాన్ని మరుగు పరుస్తున్నాం. ఈపోలికల్ని గుర్తిస్తే ఇతరులు మనకంటే ఉన్నతదశలో వున్నారని అంగీకరించాల్సి ఒస్తుంది. నియంతృత్వాన్ని అధిక్షేపించడంలో, వారుచూపే శక్తిసామర్థ్యాలపట్ల గౌరవం కూడా వుండేమొ."—

మతభూయిష్టమైన సమాజం మాకక్కర్లేదు అంటె, మనకి సిద్ధమయ్యేది 'నియంతప్రజాస్వామ్యం'. ఈసమాజిక వ్యవస్థలో, అందరూ వొకేలాగు కనబడాలి, ప్రవర్తించాలి. వ్యక్తిగతమైన అవసరాలకు ఇందులో చోటులేదు. పాకచక్యంపేరిట, ఆరోగ్యసూత్రాలకి సంబంధించిన నీతినియమాలు తలెత్తుతాయి. ప్రచారంద్వారా, అందరిభావాలూ వొకటవుతాయి. పాలకులకు నచ్చిన సిద్ధాంతాలను పురస్కరించుకుని 'కళ' కొనసాగుతుంది. 'ఇది మాకొద్దు బాబో' అన్నవారికి, మతం నేర్పిన శిక్షణ, ఓరిమి సమానతలే శరణ్యం."

ప్రజాస్వామ్యంలో కళలో భవిష్యత్తు గురించి ఇల్లా వ్రాస్తాడు ఎలియట్.

"పాలకులు కళలో మంచి, చెడుగులను విడదీసి, చవకిలాని దాన్ని నిషేధించాలి అనను నేను. ఈ నిషేధంకంటె ప్రమాదకరమైన నిషేధంఒకటుంది. వ్యాపారదృష్ట్యా గుంపులు ప్రచారంలో తెచ్చే చౌకబారు కళ ఒక ప్రమాదకరమైన నిషేధం. గుంపులు చేసే ప్రచారం విధానాలు కళాభివృద్ధికి ఆటంకాలు. ఆర్థిక స్థితి కళకి అంతరాయం; విద్యావిధానం మరొక అంతరాయం; బాధ్యత గుర్తెరింగిన కళా పోషకులు లేకపోవడం అంతరాయం. తమ స్వంత కళలు క్షీణిస్తున్నా ప్రతి ప్రాంతంవారు తమ కళ ఉత్తమమైందని ఇతర ప్రాంతాలకి ఎగుమతి చెయ్యడం జరుగుతోంది. మత ప్రచారంలో నిమగ్నులైనవారు, కళలని గురించి పట్టించుగోరు. ఆ యా కళలలో కృషి చేస్తున్న వారు, మతం గురించి పట్టించుగోరు. ఈ రంగాలపట్ల నేను అభిరుచి కనబరచకపోతే సిగ్గుపడ నవసరంలేదని, పాలకులు వీటిని గురించి పట్టించుగోరు. దీని ఫలితం ఏమిటి? ఉత్తమ సాహితీ పరుడి కృషిని ఏ కొద్దిమందో తన ప్రాంతంలో వారు తెలుసుకుంటారు. చలామణీ అవుతున్న రచయిత కృషిని విమర్శదృష్టి, అక్షరాస్యతలేని గుంపులు తెలుసుకుంటున్నారు.

మత ప్రచారకులు, యువకులకు మతంపట్ల విశ్వాసం కుదిరేలాగు చేసుకోవాలని యత్నాలు జరుపుతూ ఉంటారు. ఆధునిక విజ్ఞాన శాస్త్ర పరిశోధకులు బైట పెట్టిన విషయాలవల్ల నాస్తికతత్వం ప్రబలుతోంది. ముఖ్యంగా యువజనులలో—కావున ఇట్లాంటి పరిశోధకుల రచనలలో, మత ప్రాబల్యానికి దోహదమిచ్చే వాక్యాలే వున్నావుంటే వాటిని పైకిలాగి యువకులకు నచ్చచెప్పి ప్రమాణాలు చూపి మతాన్ని స్వీకరించేటట్లు చెయ్యాలని మత ప్రచారకుల యత్నం. 1930 లో జరిగిన 'లాంబెత్' సమావేశం ఇట్లాంటి యత్నం. వారొక నివేదికని సమర్పించారు. ఆ నివేదికని పరామర్శిస్తూ ఎలియట్ ఒక సమీక్ష ప్రచురించాడు. మత ప్రచారకులు గురైన సాధక బాధకాల్ని, హాస్యంతో చమత్కారంతో విపులీకరించాడు.

"కొత్తగా బైలుదేరుతున్న యువకతరం వారిలో ఒక నూతన మానసిక వికాసం, సంచలనం బైలుదేరింది" అన్న నివేదికలో వాక్యంపై ఎలియట్ వ్యాఖ్యానం ఇది.

"మొత్తంగా ఒక తరంవారిలో సంచలనం బైలుదేరడం అసంభవం. అన్ని చోట్లా, ఎప్పుడూ, ఆవిధమైన వివేకం ప్రకటించేవారి సంఖ్య చాలా తక్కువ. రెండువేల సంవత్సరాలుగా కొనసాగి, సిద్ధించిన చర్చి ప్రాబల్యంపట్ల కొద్ది మంది చదువుకున్నవారికి అక్కడక్కడ గౌరవం ఏర్పడింది

అని ఉండొచ్చు ఈ నివేదికలో. తత్త్వంపట్ల అభిరుచి గల వారు చాలా కొద్దిమందే ఉంటారు. మతంపట్ల నేటి యువకులకు నమ్మిక పెరగకపోయినా, దానిపట్ల విముఖత పెరగ లేద వొచ్చు."

వార్తా పత్రికలవారు ప్రముఖుల అభిప్రాయాలనిపురస్కరించుకుని, 'మత ప్రాబల్యం పెరుగుతోంది' అన్న నినాదాలు ప్రచురించడం గురించి ఎలియట్ వాక్యాలు : "మత ప్రాబల్యం పెరిగిందీ అనడంలో అర్థంలేదు—ఎందుకంటే అది క్షీణించడం జరగదు. మత ప్రాబ్యలం తగ్గడం ఎవరికీ మంచిదికాదు. అది మంచిదైతే ముద్రణాలయంలో చాలా మందికి పనుండదు. విజ్ఞాన శాస్త్రాన్ని ప్రజలలో వెద జల్లుతూ ప్రజామోదంపొందిన రచయితలకు పాఠకులు కొదవవుతారు. హక్స్లీసోదరుల లైవురైటర్లు చప్పుడు చెయ్యవు. మతం లేకుంటే విసుగుతో మానవజాతే నసిస్తుంది.

తమతమ శాస్త్రాలలో పరిశోధనలు సాగిస్తూ, అందరి పరిజ్ఞానాన్ని పురస్కరించుకుని, వొక కొత్తతత్త్వాన్ని ప్రచారం చేస్తున్న కొందరు ప్రసిద్ధ శాస్త్రజ్ఞుల కృషినిగురించి ఎలియట్ వాఖ్యానం యిది.

"ఇట్లాంటి తత్త్వాలు వ్యక్తం చేస్తున్న వారందరూ ఇంగ్లీషువారే అని నాఅనుమానం. ఐన్‌స్టీన్, ష్రెడింగర్, ప్లాన్క్ మొదలైన వారి నోటంట కూడా ఇట్లాంటి అభిప్రాయాలు విన్నాను. కాని'మమ్మల్ని ప్రశ్నలడిగింది 'నర్లివన్' అని వీరు సమర్థించుకోవొచ్చు.........మనందరిలోనూ, హెచ్.జి.వెల్సు కున్నలాంటి 'ప్రథమపాపం' వుందను కుంటాను. ఒక ప్రత్యేక మైన శాఖలో మనం తెలుసుకున్న విజ్ఞానసూత్రాల నాధారంగా అన్నింటికీ సమన్వయం కుదిరే ప్రమాణాలు వెదగడంలో మన కెంతో సంతోషంవుంది. వ్యక్తిగతమైన తత్త్వాలని బహిర్గతం చెయ్యడం మనకి సరదా. ఈరంగంలో శాస్త్రజ్ఞుణ్ణి వొదిలిపెడితే తను నిత్యవ్యవహారాలలో తెల్సుకున్న అనుభవాలనే, తాత్విక సూత్రాలుగా స్వీకరించమంటాడు." యువకులలో మతం నెలకొల్పాలంటే అందులోని సుళువైన మార్గాలని ఎత్తి చూపాలనీ, కఠినమైనవాటిని వొదిలెయ్యాలనీ, లాంబెత్ నివేదికలో పేర్కొన్నప్పుడు—దాన్ని ఎలియట్ ఖండించాడు. మతం కష్టమైందనీ, శిక్షణతోకూడుకున్నదనీ గ్రహించినప్పుడే, యువకులకు దానిపట్ల అభిమతం ఏర్పడుతుందని ఈయన నమ్మకం.

మతంపట్ల విశ్వాసం కుదరనివారు, మతంలోని విశిష్టమైన అనుభూతి వొదులుకోలేక, మరోక కొత్త తత్వంతో ముడిపెట్టి, తృప్తిచెందడం చాలాకాలంగా జరుగుతూవుంది. ప్రకృతిని ఆరాధించడం, కళోపాసన, సమాజసేవ-మొదలైనవి ఈ విధంగా అవతరించిన ఉద్యమాలే. సమాజసేవనే, మానవతావాదం (Humanism) అంటున్నారు. ఈ వాదనికి చాలా పలుకుబడీ, ప్రచారమూవుంది. విజ్ఞానశాస్త్రం అభివృద్ధితో దీనికి మరింత బలం చేకూరింది. మానవ సేవే మాధవసేవ అన్న తత్వం అమలుకొచ్చింది. 1940—45 ప్రాంతంలో, కొందరు యువకులలాగు, నేనూ ఈవాదాన్ని స్వీకరించినవాణ్ణే. కాని మానవతావాదంగూర్చి ఎలియట్ వ్రాసిన రెండు వ్యాసాలు చదివాక, ఈతత్వానికి ప్రయోజనం ప్రాప్తిపటికీ, మతానికి బదులుగా దీన్నిలేవనెత్తి తృప్తిపడటం ఆత్మ వంచన అని అంగీకరించక తప్పిందికాదు.

మానవతా వాదాన్ని ప్రచారంలోకి తెచ్చిన ప్రముఖులలో, ఇర్వింగ్‌బాబిట్, ఫార్‌స్టర్‌లు ముఖ్యులు. మతంలో నమ్మికలేని వారికి మానవతావాదమే శరణు అని వారునమ్మి, కారణాలు చూపుతూ గ్రంధాలు వ్రాశారు. ఇది ఎంత వరకూ సమంజసమైనవో విమర్శిస్తూ, ఎలియట్ వ్రాసిన రెండు వ్యాసాలూ ఉత్కృష్టమైనవి. అందరూ చదవతగ్గవి. వాటిల్లో విశేషాలను నేనిప్పుడు పేర్కొనడంలేదు. దానికి మరెవరన్నాపూనుకోవాలి. మానవతావాదాన్ని గూర్చిన అభిప్రాయాలని, సింహావలోకనం చేసి సూత్రాలుగా చివరలో పొందుపరిచాడు ఎలియట్. వాటిని మాత్రం ఇక్కడ ఉదహరిస్తాను.

1. తాత్త్విక సూత్రాలని ప్రతిపాదించడం, మానవతావాదం పనికాదు. సాధారణ సంస్కృతికి సంబంధించిందికావున, దీనికి తాత్త్విక సిద్ధాంతాలు పునాదులతో నిమిత్తంలేదు. లోకజ్ఞానంతోకాని, కారణాలతో దీనికి పనిలేదు. దీనిస్వరూపం ఫలాన అని ప్రస్ఫుటంగా నిర్వచించడానికి యీతత్త్వందిగితే, అదిమరొక స్వరూపంతెచ్చుకుంటుంది.

2. ఔదార్యము, సమానత, విశాలదృక్పధము,-వాటిని పెంపొందించి, ఉన్మత్తుల బారినుండి కాపాడుతుంది.

3. సంకుచితదృష్టి, మూర్ఖత్వం ఎంతఅవసరమో విశాలదృక్పధము, ఔదార్యము అంతఅవసరం.

4. దేనినీ ఖండించడం దీని పనికాదు, సంస్కృతినీ, అభిరుచిని ఆధారంచేసుకుని, నచ్చచెప్పడమే దానిపని. కొత్తదాన్ని సృష్టించదు, ఉన్నదాన్ని విమర్శిస్తుంది. రాజకీయ, సామాజిక జీవితానికీ, సిద్ధాంతాలకే ఇది అవసరం.

5. తత్త్వాన్నిగూర్చి, గట్టి సిద్ధాంతాలేవీ ప్రతిపాదించదు మానవతావాదం. "ఈ మతం, ఈ తత్త్వం నాగరికమైనవా? కావా?" అన్న ప్రశ్న అడగటం మట్టుకే దీనిపని.

6. మానవతావాదంతో తృప్తిపడే వ్యక్తులు కొందరున్నారు. అట్లాంటివారు, అవసరం.

7. పెడలోవని వెడుతున్నప్పుడు, మనల్ని ప్రశాంతతతో మెలగమంటుంది కాని, మతం బదలు నన్నేస్వీకరించమనదు.

8. కొద్దిమందికి మాత్రమే యీవాదం ఉపకరిస్తుంది.

సాహిత్యేతర సమస్యలను లోతుగా పరిశీలించి ఎలియట్ వ్రాసిన ప్రసిద్ధగ్రంధం సంస్కృతిని గూర్చినది. దీనిపేరు notes towards the defipition of culture—అన్నది. సంస్కృతి అన్నదానికి అర్థం ఏమిటి? సంస్కృతి స్వభావం ఎట్లాంటిది. ఏ సందర్భంలో వర్ధిల్లుతుంది. ఏయే సమయాలలో క్షీణిస్తుంది? దీని అభివృద్ధికి జరగవల్సిందేమిటి?—ఈ ప్రశ్నలను గూర్చి గాఢంగా ఆలోచించి, అనే

దేశాల సంస్కృతులను దృష్టిలోవుంచుకుని విపులంగా చర్చించిన గ్రంథం ఇది. చాలా ముఖ్యమైన గ్రంథం. సంస్కృతి పట్ల తృష్ణ, అభిమానం గలవారందరూ చదవవల్సింది. ఇది కఠినమైన గ్రంథం. అంత సులువుగా అర్థం కాదు. లోతులకి దిగడంలో కొత్తకోణాలను పరామర్శించడంలో, అస్పష్టమైన భావనారీతులతో నిండి, మధ్యలో ఎలియట్ "నేను చెపుతున్నది నాకే అంత స్పష్టంగాలేదు" అనడంకూడా జరిగింది. ఈయన చెప్పదల్చుకున్న దేమిటో తెలుసుకుందామని, నాలుగైదుసార్లు శ్రద్ధగా చదివాక, విషయం కొంత విశదమైంది. చాలామంది అనుకుంటున్నదానికి, యీకొత్త భావం వింతగా, విరుద్ధంగా కనబడటంవల్ల, నన్ను ఇది ఆకర్షించడం, దీన్ని గురించి ఆలోచించడం జరిగింది.

ముందు, ఎలియట్ గ్రంథంలోని కొన్ని భావాలను ఉదహరిస్తాను. సంస్కృతులు మూడురకాలు; వ్యక్తికి సంబంధించినదీ, ఒక తెగకి సంబంధించినదీ, మొత్తంగాఒక సమాజానికి సంబంధించినదీ—ఈమూడు రకాలు సంస్కృతులూ, ఒకదానిపైన ఒకటి ఆధారపడతాయన్నది మొదటిభావం.

సత్ప్రవర్తన, మర్యాద—సంస్కృతి లక్షణాలుగా భావిస్తే ఒక తెగకి ప్రతినిధిగావున్న ఒక ఉత్తమపురుషుడు మనదృష్టిలో సంస్కారి అన్నమాట. విద్య, విజ్ఞాన సముపార్జన సంస్కృతి లక్షణాలనుకుంటే, సంస్కృతిగల వ్యక్తిగా పండితుణ్ణి ఎంచుతాము. తాత్త్వికచింతన ముఖ్యలక్షణం అనుకుంటే, మేధావిని ఎన్నుతాము. లలితకళలపట్ల అభిరుచి ప్రధానలక్షణం అనుకుంటె కళాకారుణ్ణి ఎంచుతాము. ఇవన్ని కలిసి ఒకముద్దగా వుండాలన్న సంగతి పట్టించుకోము. దానివిబట్టి, వీటిల్లో, మిగతావి విడిచేసి ఏదో ఒక్కరంగంలో ప్రాముఖ్యం పొందినంత మాత్రాన ఆవ్యక్తిని సంస్కారిగా ఎంచలేము. విద్యలేకుండా, మంచినడవడి, అలవాట్లు రాణించవు. మంచినడవడిలేని విద్యడాంబికానికి దారి తీస్తుంది. ఎంతమేధావి అయినా, మంచితనం లేకుంటే, రాణించడు. సత్ప్రవర్తనకి దారితియ్యని, కళాపటిమ వృథా. వీటిల్లో ఏఒక్కదాన్నీ విడదీసి, 'ఇదేసంస్కృతి' అని ఎట్లాగ అనమో, ఏఒక్కవ్యక్తీ అన్నింటిలోనూ ఆరితేరినవాడై వుంటాడనలేము. పరిపూర్ణమైనసంస్కారి వుండడం అనేది మిధ్య. కాబట్టి, ఒక్కవ్యక్తిలోనూ సంస్కృతిని వెతకక మొత్తం సమాజం యొక్క స్వరూపంలో వెతగాలి—అన్నది సమంజసంగా తోచినా, దీన్ని గమనించం. ఒకదాంట్లో ఆరితేరిన వారంతా, తాము సంస్కారం గలవారుగా భావించడం జరుగుతూంది. ఈకారణంవల్లనే, కళాకారుడు ఎంతటి ప్రతిభాశాలి ఐనా, సంస్కారం కలవాడనలేం.. వారికి తెలియని కళలపట్ల నిర్లక్ష్యం చూపడమేకాకుండా, అప్పుడప్పుడు సత్ప్రవర్తన లోపించనవారుగానో, బుద్ధికుశలత తక్కువైనవారుగానో వుంటారు వీరు. సంస్కృతి సంపదకి దోహదమిచ్చినవ్యక్తి సంస్కారై వుండితీరాలి అనలేము. కాబట్టి, వ్యక్తిగతమైన సంస్కృతినీ, తెగలసంస్కృతినీ, సంఘం సంస్కృతినీ విడదీయలేము. సంస్కృతి యొక్క ఔన్నత్యం, యీమూడింటి సమన్వయంపైనా ఆధారపడుతుంది.

రెండోభావం, మనం పట్టుబట్టి, కృత్రిమ యత్నాల వల్ల, సంస్కృతిని అవతరింప చెయ్యలేమన్నది. సంస్కృతి సహజంగా పెరగాలి. ఒకప్రాంతంలో వుండే సంస్కృతి వెనక చరిత్రవుంది. శాసనాలవల్ల, చట్టాలవల్లా దానిస్వరూపం మార్చి కొత్త సంస్కృతిని ప్రవేశపెట్టడం ఎవ్వరి తరమూకాదు. దగ్గరగా వున్న రెండుప్రాంతాలలో విభిన్నమైన సంస్కృతులు వర్ధిల్లవొచ్చు. ఆరెంటివైరుధ్యం తొలిగించి, ఐక్యత నెలకొల్పాలనుకోడంవెర్రి. ప్రాంతీయ సంస్కృతులు, తమ సహజస్వరూపాన్ని, విడనాడక, విభిన్నదృక్పధాల రాపిడి సాగుతూ వున్నప్పుడే, ఆరెండు సంస్కృతులూ వర్ధిల్లుతాయి.

కొందరు పెద్దలు, వివిధజాతీయ సంస్కృతులనీ ఏకం చేసిఒక ప్రపంచసంస్కృతిని నెలకొల్పాలని కలలు కంటున్నారు. ఇందుకుగాను, 'ఎస్పరాంటో' (esperanto) అనే ఒక కృత్రిమభాషని కూడా ప్రచారంలోకి తెస్తున్నారు. ఇది సాధ్యం కాదని ఎలియట్ భావం. సాధ్యమూకాదు, హర్షించ తగిందీ కాదు. నాలుగైదు సంస్కృతులను, వాటిస్థానాలనుండి, సంప్రదాయంనుండీ, చరిత్రనుండీ విడగొట్టి, బలవంతంగా కలిపివేస్తే కొత్త సంస్కృతి నెలకొల్పబడదు సరిగదా, ఆనాలుగైదు సంస్కృతులూ అంతమొందుతాయి. సంస్కృతి మానవుడికి సహజంగా సంక్రమించేది. అతనున్న సమాజం అంతస్థుని బట్టి, అది వర్ధిల్లుతుంది. దీని అభివృద్ధికి మనం చేసేది ఏమీలేదు—చిన్నచిన్న పొరపాట్లను, మూఢప్రవర్తనలను, సరిదిద్దుకోడం తప్ప, వ్యక్తి తన అభివృద్ధికోసం ఏంచేస్తున్నాడో, సమాజం కూడా, అదనే చేస్తుంది. ఆకృషిలో ఏవన్నా అంతరాయాలుంటే వాటిని తొలిగిద్దాం.

సాహిత్యప్రియులు చదువదగినమహాగ్రంథం

**కాటూరి వేంకటేశ్వర స్మారక సంపుటము**

సంపాదకుడు : కె. బి. రావు, ఎమ్. ఏ.,

శ్రీ॥ శ్రీ॥ కాటూరివారి స్మృతిచిహ్నముగా ప్రవాస సాహితి, హోషియారుపూరువారిచే ప్రకటితము. డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీస్ వారిచే అన్ని గ్రంథాలయములకు సిఫారసు చేయబడినది. ఇందు కాటూరివారి అముద్రిత రచనలు, ప్రత్యేక వ్యాసములు కలవు. సర్వశ్రీ స్వామి శివశంకరులు, దివాకర్ల వేంకటావధాని, యస్వీజోగారావు, జమ్మలమడక మాధవరామ శర్మ, కాండూరి నరసింహాచార్యులు, వసంతరావు వేంకటరావు గార లాంధ్ర సారస్వత సాహిత్యములపై వ్రాసిన వివిధ విషయ గుంఫితవ్యాసరత్నములు కలవు. భారతి, కృష్ణాపత్రిక, సాధన, చుక్కాని, స్రవంతి పత్రికలు వేనోళ్ల మెచ్చిన గ్రంథమిది. కొద్ది ప్రతులు మాత్రమే కలవు. ప్రతులకు:

**కె. కమలాదేవి, ప్రవాససాహితీ ప్రచురణలు,**
**273, కొత్త వీధి, తిరుపతి.**

ఓపికతో చదివి, ఆయనశోరణికి అలవాటైనవారు ఎలియట్ రచనలన్నింటినీ చదవకుండా వుండలేరు. ఇదమిద్దమని నిక్కచ్చిగా ఒకటి రెండు వాక్యాలలో చెప్పి విడిచేసే శాసనకర్త కాడు. తీర్పు పాఠకుడే చేసుకోవాలి. దానికి కావల్సిన మనస్తత్వాన్ని, సాహితీ పరికరాలనీ సమకూరుస్తాడు ఎలియట్. సాహిత్యాన్ని పరామర్శిస్తూ, జీవితాన్ని గూర్చి, మనుష్యుల్ని గూర్చి, అద్భుతమైన పరిశీలనా శక్తుల్ని వ్యక్తం చేసే నిర్వచనాలు చేస్తాడు. వాకిన్మమైనవి కొన్ని.

"అతను తన జీవితాన్ని ధ్వంసం చేసుకున్నాడు. అటా ధ్వంసం చేసుకోడం కూడా వొకరకం వ్యాపారమే."

"రచయితలోలేని లక్షణాలని ఎత్తిచూపడం అతనిలో మంచి లక్షణాలపట్ల ఆదరణని పెంచడమే అవుతుంది."

"మంచి వసతి, దుస్తులు, తిండి సమకూర్చినా, గుంపు గుంపే."

"ఆధునికయుగంలో మతం పట్ల సహనం చూపడమే సహించరానిదిగా పరిణమించొచ్చు."

"ఏమార్పునైనా అంగీకరించేటంతటి దుస్థితి పడితే తప్ప, సమాజంలో మార్పుతేవాలంటే, అబద్దాలతో నచ్చచెప్పాలి."

"పాలకులు ఏ నమ్మకాలని స్వీకరిస్తున్నారన్నది ముఖ్యం కాదు. ఏ నమ్మకాలని స్వీకరించాల్సి వొచ్చింది—అన్నది ముఖ్యం."

హామ్లెట్ నాటకంగురించి ఎలియట్ చేసిన తీర్పు నన్ను కలవరపెట్టింది. ఆనాటకం గొప్పకళా ఖండంకాదంటాడు. నాయకుడైన హామ్లెట్ అంతరంగంలో వున్న ఉద్రేకాన్ని బహిర్గతం చేసేందుకు అనువైన పరిస్థితి బాహ్యజగత్తులో లేకపోవడం వల్ల, అతను కార్యదూరుడవడం, నాటకం వృధాగా కొనసాగడం జరిగిందంటాడు. షేక్స్పియర్ అంతరంగంలో ఏదో పైకి చెప్పుకోలేని బాధ వుంది. ఆ బాధని లోకంతో చెప్పుకునే ఉద్దేశంతో, తగిన పాత్రగా హామ్లెట్‌ని ఎన్నుకున్నాడు. కాని హామ్లెట్ ఎదుర్కొన్న సంఘర్షణ, సన్నివేశం, తనలో ఉద్రేకాన్ని, బాధనీ పూర్తిగా వ్యక్తం చెయ్యడానికి అనువైనవి కావు. పరిస్థితిని మించిన 'గొడవ'—ఉద్రేకం ఉండటం మూలాన ఈ నాటకం కళానుగుణంగా కొనసాగక దెబ్బతిందన్న ఎలియట్ వాదాన్ని, కొంతవరకూ 'చివరికి మిగిలేది'—నవలలో 'చీకటి సమస్య' అన్న అధ్యాయంలో ముచ్చటించాను. ఇది సాహిత్యానికి సంబంధించిన విషయమే అయినా, సాహిత్యం—జీవితం రెండూ ఒకటే నన్న ఎలియట్ తత్వంలోని తపన నన్ను ఈ అధ్యాయానికి పురిగొల్పింది.

సాహిత్యంద్వారా జ్ఞానాన్ని తెమ్పుగున్న విశ్వసాహితీవేత్త ఎలియట్ గెథెని గురించి ఆయన ఇల్లా వ్రాశాడు.

"గొప్ప కవికున్న జ్ఞానం, అతని రచనంకి ఇమిడి ఉంటుంది. దానిని గ్రహించడంతో, మనం కూడా జ్ఞానులం అవుతాము." ఈ వాక్యాలు, ఎలియట్ రచనలో పూర్తిగా వర్తిస్తాయి.

'ఫోర్ క్వార్టెట్స్'—కావ్యం ముగింపులో కొంతభాగం :

"చనిపోయినవారితో మనమూ చనిపోతాం.  
వారితో మనమూ పోతాం.  
మనం వారితో పుట్టాం ....  
చరిత్రలేని ప్రజ  
కాలాన్నుండి విముక్తి చెందరు.  
కాలాతీతమైన అద్భుత క్షణాల సమీకరణ చరిత్ర.  
నిరాడంబరులమై పరిపూర్ణంగా జీవిస్తే  
అన్నీ బాగుంటై.  
నిప్పు, జ్వాలా కిరీటంగా అల్లుకుని  
నిప్పు, గులాబీ వొకటవుతై. "

ఒకటైన అగ్ని గులాబీలాంటి జ్ఞాని టి. ఎస్. ఎలియట్.



# గమ్యం

## శ్రీ వి. సి. బాలకృష్ణ శర్మ

(స్వర్గీయ టి. యస్. ఇలియట్ మహాకవి రచించిన Four Quartets అనే కావ్యాన్ని చదివిన ఉత్సాహంలో వ్రాసిన వాక్యాలు. ఇవి ఆ కావ్యంలోని తొలి భాగంలో ధ్వనించిన భావాలు.)

ఈ ఘడియలు, గడచిన ఘడియలు,
రాగల ఘడియలలో వర్తమాన ఘడియలు
రాగల కాలం గతకాలంలో గ్రసితం.
కాలం సకలం కలకాలం వర్తమానమైతే
కలకాలం నిర్వికల్పమే.

జరిగిఉండ వచ్చునన్న దేంతైనా అగోచరం
జరుగవలసి ఉండేదని నీ వనుకున్నది
జరిగే అవకాశం అనవరతం అదృశ్యం
అది ఒక ఊహా నిర్మిత లోకం.

భవితవ్యం, గతకాలం,
నిర్దేశించే గమ్యం
అది నిత్యం—ప్రస్తుతం.

స్మృతి పథాల అడుగుల సవ్వడి
మన పయనించని వీధుల దారుల్లో
మన మనలే కదిలించని ద్వారాల్లో
గులాబీలు వికసించిన తోటల్లో
అదుగో

నా పలుకులు నీ మెదలో
ప్రతిధ్వనిస్తున్నాయ్.

పరిలే.........ఇది దేనికి ?

శయనించిన రోజాపత్రోపరి
ధూళిధూసరాలను కదలించుట !

.........ఇది దేనికి ?

ఏమో నే నెఱుగను.

ప్రతిధ్వనులు ఇంకా ఉన్నయ్
తోటనిండి వస్తున్నయ్
.........మఱి వస్తావా!

పద పద,
త్వర త్వరగా పట్టాలి.
ఇక మలుపు తిరిగితే సరి.........
.........అంటున్నది పిక కిశోరి.

సింహద్వారం దాటి గమిద్దామా?
మన ప్రప్రథమ ప్రపంచం లోనికి
పిక సుందరి మాయాజాలం లోనికి
మన ప్రప్రథమ ప్రపంచం లోనికి.

అదుగో అక్కడ ఉన్నాయ్
హుందాగా; ప్రచ్ఛన్నంగా;
కుదుపు లేని కదలికతో
ముక్త పత్రనిబిడమైన
శిశిరోష్ణ విలాసంలో
సమీరగమన స్పందనలో.

పిక వధూటి పిలిచింది
ప్రత్యుత్తర మిచ్చింది.
పొదల ఎదల జనియించిన
వినబడని కుహూ గీతాన్ని
కలిపి మురిసి మెరిసింది.

చూడు చూడు గులాబీల
చూపు పడిన చిహ్నాలు
అదిగో అక్కడె ఉన్నాయ్
అతిథులవలె. స్వీకరించు, స్వీకృతులు.

మరి మన పయనం సాగెను
అవి కూడా ఆ కృతిగొని
అలికిడి ఉడిగిన దారుల

నిర్గమించి గుమికూడెను,
నీటి పడియచుట్టు చేరి.

పడియలోని తడిపోసి,
తడిఆరిన మట్టిదఱుల
పడియనిండి తొణుకులిడెను
భానుకిరణ జనిత జలము.

కలువచాన మెలమెల్లగ
కనులు తెఱచి మేలుకొనెను
కాంతి కడుపులో మెరసెను
అవి—
మన వెనుకనె ఉన్నాయ్
అదిగో ప్రతిబింబిస్తూ.

అంతలోనే మబ్బు తెరలు
ఆ జలమే అదృశ్యం
కదల మంది పిక లతాంగి.
పత్ర సముచ్చయమంతా
పసి పాపలు, పసి పాపలు.
ఉద్వేగభరంతో ఒదిగిన
ఉదిత హాసన గ్రసిష్ణువులు

పద పద మని పిక కుమారి
అదలించెను మరల మరల
మనుజ జాతి ఆగలేదు
మరీ అంత సత్యానికి.

గతం, భావి, భవితవ్యం,
వర్తమాన మత్యంతం,
నిర్దేశించే గమ్యం
అది నిత్యం—ప్రస్తుతం.

—

# ప్రజలు ప్రభుత్వం

శ్రీ జాన్ స్ట్రాచీ

వీ్వారు చెప్పేదంతా బాగానే ఉన్నది. అయితే భారీ పరిశ్రమలపట్ల ఇంత శ్రద్ధ చూపకపోయినట్లయితే రష్యా సైనికశక్తి తగ్గిపోతుందని రష్యను కమ్యూనిస్టులు చెబుతారు. నిజానికి రెండవ ప్రపంచ యుద్ధం తరువాత వారు పెంచుకున్నంత సైనికశక్తి వారికి అవసరమని నే ననుకోను. అంతకు ముందు అవసరమై యుండవచ్చు. కేవలం సైనికశక్తిని మాత్రమే పెంచకుండా ఉంటే వారి నిజశక్తి ఇంకా ఎక్కువగా ఉండేది.

1941 సం. లో రష్యను సేనలు హిట్లరు చేతులో అతి ఘోరమైన పరాజయాన్ని పొందాయి. జర్మను సేనల ప్రథమ పురోగమనంలో దాదాపు 100 రష్యను డివిజనులు టాంకులతోసహా నాశనమైపోయినాయి. దానికి స్టాలిన్ పొరపాట్లు కారణం. అంతేకాకుండా అతను భారీపరిశ్రమలపట్ల, ఆయుధ నిర్మాణంపట్ల చూపించిన వెర్రి ఆసక్తి కూడా కారణం. దాని వల్ల నిత్య జీవితావసర వస్తువుల ఉత్పత్తిని, వ్యవసాయాన్ని అశ్రద్ధగా చూడటం జరిగింది. 1930లో వచ్చిన క్షామం దాని ఫలితమే. ఈ క్షామం రాజకీయ, సైనిక పడపోతలకు దారితీసింది.

రెండుకోట్ల మందికిపైగా రష్యన్లను నిర్బంధ నివాసంలో పెట్టారు. రష్యను కమ్యూనిస్టుపార్టీ పటిష్ట పిప్పి అయిపోయింది. సైన్యంలోంచి అనేకమంది అధికారులను లాగి పారవేశారు. వీటన్నిటి మూలాన, రష్యను ప్రజల మానసికశ్శక్తి తగ్గిపోయింది. భారీ పరిశ్రమలు ప్రసాదించిన పదు పాయాలవల్ల ప్రయోజనం లేకపోయినది. అంటే అవి ఉన్నందువల్ల పోట్లాడవలసినట్లుగా పోట్లాడలేదు. అందుకు వారి శక్తి సన్నగిలిం దనుకోటంలో సందేహంలేదు. రష్యన్ సైన్యానికి కనుక అన్ని పెద్ద ఆయుధాలు, ఆయుధశకటాలు లేకుండాటంకీ అంతకుముందు 4,5 సం.లు సైనికఅధికారులను నిర్మూలించకుండా ఉంటే నాజీ కత్తెర సేనలు మాస్కో నగర పరిసరాలకు చేరి రష్యను సేనలను ఘోర పరాజితులను చేయగలిగి ఉండేవారు వారుకారు.

ఇంతకీ దీనికీ ప్రజాప్రభుత్వానికీ సంబంధ మేమిటని అనవచ్చు దానికీ గల సంబంధమిది. రష్యను ప్రభుత్వము భారీ పరిశ్రమల నిర్మాణంపట్ల, ఆయుధ నిర్మాణంపట్ల తనదృష్టిని కేంద్రీకరించినట్లు ప్రజాప్రభుత్వం కేంద్రీకరించుట సాధ్యమయేదికాదు 1930 సంవత్సరాలలో స్టాలినూ, 1950 సంవత్సరాలలో కృశ్చేవ్ అవలంభించిన విధానాలకోసం ప్రజలు చేయవలసి వచ్చిన త్యాగాన్ని ప్రజా ప్రభుత్వంలో అయితే ప్రజలు సమ్మతిస్తారనేది అనూహ్యం. తాము కోరిన ప్రభుత్వాన్ని ఎన్నుకొని ప్రతిష్ఠించగల ప్రాథమిక హక్కు కనుక రష్యను ప్రజల కున్నట్లయితే ఈ భారిపరిశ్రమల, ఆయుధనిర్మాణముల శీఘ్రగతిని కొంత తగ్గించి ఆహార వస్త్రాల, గృహవసతి నిర్మాణాల అభివృద్ధికి ప్రాముఖ్యత నివ్వమని పట్టుబట్టేవారు.

అలా చేయుటం మంచిదో చెడ్డదో ఒప్పో ఒప్పో అనేది వేరే విషయం. కాని, అలాగే చేసి ఉండేవారు. కేవలం నిరంకుశ అధికారంతోనే ప్రజలను నొప్పించే పద్ధతిలోనే రష్యా అభివృద్ధి నడిచింది. కేవలం నెడలు విరచి చేయించేవారన్నమాట. ఒక ప్రభుత్వం తమ ప్రజను ఇంతగా బాధించటం అనేది అనచారమనటమే గాక పొరపాటు కూడ అని చరిత్ర తీర్పు ఇవ్వగలదు. నైతిక, ఆర్థిక అంశాలను పరిగణించకపోయినట్లయితే చివరకు ఈ పద్ధతి సైనికశక్తిని ఎక్కువగా అభివృద్ధి చేస్తుందనే విషయము కూడా సందేహమే. అంతేకాదు ఈ పద్ధతి అవలంబించిన చోటల్లా క్షీణలక్షణాలురాక తప్పవు.

కమ్యూనిస్టులు అవలంబించే నిర్బంధ నిరంకుశ పరిపాలనా దుష్పరిణామాలను రష్యాలోనే కాక దాని ఉపగ్రహ రాజ్యాలలో కూడా, అందులో ముఖ్యంగా తూర్పుజర్మనీలో చూడవచ్చును.

మీరు బెర్లిన్ గోడను చూశారా ? దీనిని చదివేవారిలో చాలామంది చూచిఉండరు. మీరు దానిని చూసిఉంటే బాగుండేది. అదేమీ అంత గొప్పదని కాదు. అది వికారమైన అడ్డుగోడ. దానిపైన ముళ్లతీగె కంచెగా వేశారు. దానికి అవతల వైపు 50 గజాలలో తుపాకులు పట్టుకుని సైనికులు సిద్ధంగా నుంచుని ఉండకపోతే ఎవ్వరైనా దాన్ని నెట్టి అవతలకు వెళ్లగలిగేవారు. ఆ గోడ చిన్నదే. కాని, అది కలిగించే విషాద భావం మాత్రము మహా పెద్దది. శత్రుసేనలను అరికట్టడానికి రోమను చక్రవర్తి హాడ్రియాన్ ఉత్తర బ్రిటనులో మధ్యగా కట్టిన గోడగాని, చైనాలోని పెద్ద గోడ గాని, దాన్ని చూచినపుడు స్ఫురించవు. చరిత్ర ప్రసిద్ధమైన ఈ గోడలలో దేని మోస్తరుగా లేదని అనిపిస్తుంది. అవి బయటినుండి వచ్చే శత్రువులను నిరోధించటానికి ఏర్పడ్డాయి. అట్లాగే కనపడతాయి. ఈ బెర్లిన్ గోడ ఘోరమైన లక్షణం ఏమిటంటే, తమవారినే ఎదిరివారిగా చూస్తుంది. అడ్డగిస్తుంది. రక్షణకు కాదు. తమ ప్రజలకే జైలుగోడ. అది తూర్పు జర్మను ప్రజలను శత్రువుల దాడినుండి రక్షించటానికి కట్టినది కాదు. అక్కడనుండి తప్పించుకుపోకుండా ఉండటానికి కట్టబడింది.

ఎందుకనో ఆ గోడ ఆకారంలో ఇవన్నీ కనపడుతాయి. కొన్నిచోట్ల అది నిజంగా గోడే కాదు. వీధిలో ఒకప్రక్క ఇళ్ళ వరస మీదుగానే వెళ్తుంది. ఈ ఇళ్లు తూర్పు బెర్లిన్ సరిహద్దులలో ఉంటే వాటి కిటికీలను ఇటికలతో మూసివేశారు. పశ్చిమ బెర్లినులో ఆ కిటికీల క్రిందుగా వెళ్తూఉంటే చూపుపోయిన కళ్ళు ఇంతలంగా చేసికొని మనవైపు చూస్తున్నట్లుగా ఉంటుంది. తూర్పు జర్మనీ నుంచి తప్పించుకొనడానికి ఈ ఇళ్ల పైనుంచి కిందకు దూకి చచ్చిపోయిన వారు చాలామంది ఉన్నారు. వారు చచ్చిపోయిన చోటు గుర్తించటానికి అక్కడ కుప్పలు కుప్పలుగా వాడిపోతున్న పువ్వుల గుత్తులు అగపడుతాయి.

ఇదంతా ప్రచారం అని మీ రనవచ్చు. కాని, ఇలాంటి పరిస్థితిని చూసి ప్రచారంచేయకుండా ఉండగలగటం సాధ్యము కాదు. తమ ప్రజలపైన ఎలాంటి వత్తిడినైనా తీసుకు రావటానికి వెనుకాడమనే కమ్యూనిస్టు ప్రభుత్వ దృక్పథ విశ్వయానికి ఇది సహజమైన పరిణామము. (అంటే ఈ గోడ) ఇది ప్రజాప్రభుత్వ తిరస్కారణలో తుది చర్య. ఈవిధంగా చేస్తూ ఉంటే చివరకు దేశం చుట్టూతా గోడ కట్టాల్సి వస్తూంది. లేకపోతే ప్రజలు పారిపోతూ ఉంటారు. అప్పుడు దేశమే ఒక బంధిఖానా అవుతుంది.

కమ్యూనిస్టు రాజ్యాలు సాధించిన దానిలో ప్రధానమైనది వారి సైనికశక్తి గాని, ఆర్థికాభివృద్ధికాని కాదు. రష్యా బలమైన రాజ్యమే. కాని ఒక పెద్ద దేశము ఇంత బలాన్ని సంపాదించటానికి 45 సంవత్సరాలు తీసుకున్నదంటే అందులో పెద్ద విశేషమేమీ లేదు. రష్యా కొంతవరకు ఉపగ్రహ రాజ్యాలు, సాధించిన వాటిలో గొప్పది అని చెప్పుకోవలసినది విద్యారంగంలో. తన జాతీయ ఉత్పత్తిలో ఎంత మొత్తము విద్యకోసము రష్యా ఖర్చుపెడుతున్నదో సరిగా తెలియదు. కాని పశ్చిమ రాజ్యాలకంటే ఎక్కువగా ఖర్చు పెడుతూ ఉండాలి. బ్రిటనులో మేము 3—4% విద్యకోసం ఖర్చుపెడుతున్నాము. ఈ మొత్తము చాలదు. ఏ విధంగా చూసినా చాలదు.

విద్యఅంటే ధనవంతులకు మాత్రమే అని అనుకొంటూ ఉండేవారు. మిగతా అవసరాలను గురించి ఆలోచించిన తర్వాతే విద్య సంగతిని గురించి పట్టించుకొనేవారు. ఇది చాలా తప్పు. కేవలం ఆర్థిక ప్రయోజనాల దృష్టితో చూసినా, అంటే దేశ ఆర్థిక సంపదను అతి శీఘ్రంగా పెంపొందించాలనే దృష్టితో చూసినా విద్యమీద చేసే ఖర్చు అన్నిటికంటే ముఖ్యమైనదిగా పరిణమిస్తుంది. వేరే ఏ తప్పులు చేసినా కమ్యూనిస్టులు ఈ సత్యాన్ని గుర్తించారు. ఇదివరకు ఏ దేశమూ చేయనంత సమగ్రంగా విద్యాప్రణాళికను అమలుపరుస్తున్నారు. ఎక్కువమంది ప్రజలను విద్యావంతులుగా చేస్తున్నారు. దీనివల్ల దేశానికి ఎంతో ఉపయోగం. వారు ఇప్పుడు చేసిన తప్పుల వలన గలిగిన నష్టం భవిష్యత్తులో తొలగిపోవచ్చు. విద్యా విషయంలో కమ్యూనిస్టేతర రాజ్యాలు కూడా ఇంతగా శ్రద్ధ చూపక పోయినట్లయితే వెనుకపడుతారు. కమ్యూనిస్టులకు ప్రపంచములో ఆధిక్యత వస్తుంది. అయితేఇక్కడ ఒక చిన్న విచిత్రం ఇమిడిఉంది. విద్యా ప్రణాళికను అవలు పరతటముతోపాటు వారు చేసిన భయంకరమైన తప్పులను కూడా సరిదిద్దుకుంటే తప్ప ప్రపంచంలో కమ్యూనిస్టులకు ఆ ఆధిక్యతరాదు. చివరకు వారు తమ తమ తప్పులను దిద్దుకుంటారనే నా నమ్మకం. విద్యావంతులైన ప్రజలు నేడు కమ్యూనిస్టు దేశాలలో ఉన్నా నిర్బంధ విధానం క్రింద ఉండటానికి ఎక్కువ కాలం సహించరు. వ్యక్తి స్వాతంత్ర్యము రాజకీయ స్వాతంత్ర్యము, లేకుండా ఎల్లకాలమూ పడి ఉండరు. తమ ప్రభుత్వాలను అదుపులో ఉంచే రాజకీయ వ్యవస్థా నిర్మాణానికి పట్టుపడుతారు. అదే ప్రజాప్రభుత్వము.

# ప్రజలు - ప్రభుత్వం

ప్రజలందరికీ విద్య నివ్వడం అనే ప్రణాళిక రష్యా సాధించినవా టన్నిటిలోకీ మహత్తరమైనది. వారి తప్పులు, అపవాదములు తెచ్చిపెట్టిన నష్టానికి మించిన మంచిని అది తేవచ్చు. అయితే మన మిప్పుడు చూస్తున్న కమ్యూనిస్టు సంఘ స్వభావ స్వరూపాలని పూర్తిగా మార్చడానికి ఉపక రిస్తేనే ఆ మంచిని తెచ్చినట్లవుతుంది. ఇదే ఇక్కడ ఇమిడి ఉన్న విచిత్రం. పశ్చిమ రాజ్యాలు కనక తన విద్యావ్యాప్తి ప్రయత్నాలను ఇనుమడింప జేయకపోతే కమ్యూనిస్టులు ప్రపంచ నాయకత్వాన్ని గెలుచుకోవచ్చు. అయితే కమ్యూనిస్టు ప్రభు త్వాలను ప్రజా ప్రభుత్వాలుగా మారిస్తేనే వారి కది సాధ్యం అవుతుంది. అలా జరిగిన పక్షంలో వారు అందరికన్నా బలీ యులుగా ఉండటానికి ఏమీ అభ్యంతరం ఉండనక్కరలేదు.

కమ్యూనిస్టుల విద్యాప్రణాళికలు నేడు మనం చూస్తూ ఉన్న కమ్యూనిస్టు సంఘాల విచ్ఛిన్నతకు ఉజ్జ్వలతకు కారణం అవుతాయని నా జోస్యం. ఇలాంటి విచిత్రాన్ని చూచి మార్క్సి స్టులు వింతపడ నక్కరలేదు. ఇవి గతి తార్కిక విచిత్రాలు. ఆర్థిక అభివృద్ధి, విద్యాభివృద్ధి, ప్రజాప్రభుత్వ వ్యవస్థలు ఒకదానిపై ఒకటి తమ ప్రభావాన్ని చూపుతాయి. పెట్టుబడి వ్యవస్థ ప్రాఫిట్ రేటును సృష్టించటంతోపాటు దాని సమా ధిని కట్టేవారిని కూడా సృష్టిస్తున్నదని మార్క్స్ అన్నాడు.

అయితే కమ్యూనిస్టు సంఘాల భవిష్యత్తు ఏమిటి ? వారి అభిమానులు చెప్పుతున్నట్లు అవి వర్గరహితమైన సంఘా లుగా పరివర్తన చెందుతాయా ? వర్గరహితమైన సంఘం ఉండాలని నే నెప్పుడూ నమ్ముతాను. అది ఒక విధమైన ఆర్థిక సాంఘిక వ్యవస్థ అనీ, ఆ వ్యవస్థలో వ్యక్తులు చేసే పనుల మూలంగా విభేదం ఉండకూడదనేదే వర్గరహిత సంఘం. ఈ స్థితి కనుక సాధించగలిగితే అది మానవ సంఘము సాధించగలిగిన వాటిలో అన్నిటిలోనూ మహనీయమైన కాగలదు. అందుకనే నేను సోషలిస్టును.

మనం ఒకరి నొకరు నాశనం చేసుకొనకుండా ఉండాలి. కాని నిజానికి అభివృద్ధి స్థితిలో ఉన్న దేశాలన్నీ వర్గరహిత స్థితికే సాగిపోతున్నాయి. కమ్యూనిస్టు దేశాలపట్ల కూడా ఇది నిజము. కమ్యూనిస్టు ప్రభుత్వాలు సరి అయిన ప్రజా ప్రభుత్వ వ్యవస్థలను పెంపొందించకపోవటమే కాక వాటిని నాశనం కూడా చేశారు. కాబట్టి వర్గరహిత సంఘానికి చాలా దూరంలో ఉన్నారు. ఇతరులకంటే వారు ముందు చేరుకుంటారనేది కూడా అనుమానమే. కమ్యూనిస్టులు గాని దేశాలు అనేకం—వారి ఆర్థిక వ్యవస్థ కమ్యూనిస్టులదానికన్న హేతురహితంగా కను పడినా,—కమ్యూనిస్టులకన్నా ముందు చేరుకుంటారు. వారి రాజకీయ వ్యవస్థలు అందుకు అనువుగా ఉన్నాయి.

ఉత్పత్తిసాధనాల యాజమాన్యముకంటె ప్రజాప్రభుత్వ వ్యవస్థలు ఎక్కువ ముఖ్యమని తేలుతున్నది. ఇలా అంటున్నా నని అపార్థము చేసికోవద్దు. ఈరెండూ చాలా ప్రాముఖ్యమైనవి. ఉత్పత్తి సాధనాలు ఎవరి చేతులలోనున్నవి అనేది చాలా ప్రధాన విషయం. ఎందుకంటే సంఘాభివృద్ధి గతిలో ఒక స్థితిలో దీనివల్ల అనేకం నిర్ణయ మవుతాయి. మార్క్స్ కాలంలో బ్రిటనులో అలా జరిగింది. అపుడు ప్రజా ప్రాతినిధ్య సంస్థలు లేవు. పనివారికి వోటు హక్కు లేనందున ఉత్పత్తి సాధనాలు తమ చేతులలో ఉన్నందున పెట్టుబడిదారులకు, భూస్వాములకు సంఘంమీద పూర్తి అధికారం వచ్చింది. కాని ఇపుడు 100 సం. లు తరువాత, పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశా లలో అందరికీ చదువు వచ్చి, అందరు రాజకీయ జీవితంలో పాల్గొనటం జరుగుతున్నది. ప్రజా ప్రభుత్వ వ్యవస్థలు సంఘ జీవనాన్ని తీర్చిదిద్దుతున్నవి. ఉత్పత్తి సాధనాల యాజ మాన్యాన్ని నిర్ణయించగలరు. అంటే వాటిని అదుపు ఆజ్ఞలో పెట్టగలరు.



చర్చ

# నవ్యాంధ్రసాహిత్యంలో దృక్పథాలు

డిసెంబరునెల భారతిలో గోపీచంద్‌గారి నవలలపై సుదర్శనంగారి 'దృక్పథం' వచ్చింది. శకుంతలని ఆమె భర్తయొక్క అనుమతి లేకుండా తీసుకువచ్చి ఆమెతో కాపురం చేసిన అమీంద్రుడు ఆమె ఇతరులతో గూడా చనువుగా ఉంటున్నదని ఆమెని హత్య చేశాడు. ఈ సందర్భంలో రచయిత చాలా సబబయిన ప్రశ్నలు వేశాడు. "ఇప్పుడు తను పడుతున్నంత బాధ ఒకప్పుడు ఆమె భర్త పడిఉండాలిగదా! భర్త అదుపులో నుంచి తీసుకువచ్చిన తనకు, తన అదుపులో ఆమె ఉండాలనే భావం ఎందుకు కలగాలో! ఆ అధికారం తనకు ఎవరిచ్చారో!', అని అన్నారు రచయిత. అంటే తన పాత్రను చూచి తానే ఆశ్చర్యపడ్డాడన్నమాట! దానిపైన విమర్శకుల వ్యాఖ్యానం ఇది—"సాంఘికవాదులు, హేతువాదులు ఇంత దూరం వెళ్లనే వెళ్లరు. వాళ్ల విమర్శ ఎప్పుడూ పరపరామర్శేతప్ప ఆత్మ విమర్శగా రూపొందదు" అని.

విమర్శ నిగ్గు తేలేది అలాంటి చోట్లలోనే! అలాంటి భావాలు వ్యక్తం చేసేటప్పుడే విమర్శకుడు తొట్రుపాటు పడకుండా ఉండాలి. హేతువాదులుగాని, సాంఘికవాదులుగాని అంత దూరం వెళ్లరని ఎందుకన్నారు? ఎందుకు వెళ్ళరు? అక్కడ ఆగిపోతారని ఎవరు చెప్పారు వారికి? ఏదయినా సిద్ధాంత గ్రంథంలో ఉందా? లేక తమకు తెలిసిన 'హేతువాదు' లెవరయినా ఉన్నారా? లేక అలా ఆగిపోయిన వారినే హేతువాదులుగా నిర్వచిస్తారా? దీనిలో విమర్శకుని ఉద్దేశం ఏమిటి? అసలు హేతువాదికాని రచయిత ఆ ప్రశ్నలు వెయ్యగలుగుతాడా?

సాహిత్యంలో తాత్త్విక దృక్పథాన్ని వివరించాలనే సదుద్దేశంతో ప్రారంభించినవారు ఇలాంటి అసంబద్ధపు భావ ప్రకటనకు పూనుకోవటం శోచనీయం. తన భావాలను ఏదో ఒక రకంగా వెళ్లబోసుకోవటం, ఆ భావాల ప్రభావంనుంచి బయటికి రాలేకపోవటం—విమర్శకునిలో ఉండరాదని లోపాలు. ఆ లోపం ఉన్నవారు విమర్శకు పూనుకోవటం ప్రమాదకరం.

ఆలాగే ఇంకొకచోట "చక్రవర్తి భావనలకు బాహ్య ప్రపంచంలో, సంఘంలో అస్తిత్వంలేదు. అంటే కేవలం బహిరుపాధుల ద్వారా నిరూపించబడి నిర్ణయించబడే సత్యం స్థూలంగానే ఉంటుందనీ, బహిరుపాధుల కందని వైవిధ్యం దానిలో ఒక్కొక్క వ్యక్తి మనస్సును బట్టి ఎంతో మేర ఉంటూ ఆ సూక్ష్మం గ్రహించేదీ, దానికి సాక్షి, వ్యక్తి అంతర్యం మాత్రమేననీ తెలుస్తోంది. హేతువాదులు ఈ అంతరంగిక మైన సత్యాన్ని దాని విశిష్టతను అంగీకరించరు" అన్నారు. హేతువాదం కేవలం బహిరుపాధులమీదనే ఆధారపడదనీ, మానసిక పరిణామాన్నిబట్టి సత్యగ్రహణం ఆధారపడిఉంటుందన్న విషయాన్ని ఎవరూ కాదనరనీ విమర్శకులు గ్రహించలేదా? లేక గ్రహించి అవసరం కొద్దీ విస్మరించారా? హేతువాదం మీద సదభిప్రాయం లేకపోవచ్చు తాత్త్వికంగా—కాని ఆ వాదాన్ని విమర్శించటానికి మంచి ఏదీ దానిలో లేదని దుమ్మెత్తిపోయ నవసరంలేదు. అసలీ సందర్భంలో ప్రస్తావించబడిన ఉషారాణీ చక్రవర్తుల సంభాషణ హేతువాదని కొక మచ్చు తునక. ఉషారాణి హేతుబద్ధంగా వాదించి ఉండకపోతే చక్రవర్తి అంత తేలికగా నిరుత్తరుడయ్యేవాడుకాదు.

తన కిష్టమయిన భావాలున్నంతవరకు రచయితను పొగిడి, ఇష్టంలేని చోట 'చింత చచ్చినా పులుపు చావలే'దనటం సద్విమర్శ అనిపించుకోదు. "వివాహంలేని సంఘం స్వర్గం అవుతుందో, నరకం అవుతుందో చెప్పలేం" అన్నంతమాత్రాన భయపడిపోతే—ఆలోచనలో 'అంతదూరం' వెళ్లలేనివారు హేతువాదులో, విమర్శకులో తెలియటంలేదా?

"నిజమైన ప్రేమ ఇలాంటిది అని సిద్ధాంతం చెయ్యటంలోనే దాన్ని సర్వ జనీనమూ సామాజికమూచేసి, దానికి భిన్నమైన వ్యక్తిగతమైన అనుభూతులను నికృష్టమయినవిగా త్రోసిపుచ్చటంవల్ల ఎంతో మేర మానవత్వాన్ని వాస్తవిక జీవితాన్ని, నిరాకరించటం జరుగుతుంది. ఈ ధోరణి సంఘము దృష్ట్యా ఎలా ఉన్నా, వ్యక్తి వికాసం దృష్ట్యానూ, సాహిత్యం లోనూ అభిలషణీయంకాదు" అని క్రొత్త దృష్టిని సమర్థించారు విమర్శకులు. కాని తరువాత ఈ "కొత్త దృష్టికీ వివాహ భవితవ్యానికీ ఏదో సంబంధం ఉన్నదన్న అభిప్రాయం పాఠకులకు మాటవరసగాకూడా రచయిత కలిగించవలసిందికాదు" అన్నారు. ఎందుకని? మొదట చెప్పిన కొత్త దృష్టిని ఒప్పుకుంటే,

దాని ప్రభావం వివాహంమీద లేకుండా ఎలా ఉంటుంది? ఉన్నప్పుడు రచయిత సూచించకుండా ఉండాలని కోరటం ఎందుకు? కొత్త దృష్టి ప్రభావం ప్రతి వ్యవస్థమీద ఎలా ఉంటుందో సూచించినంత మాత్రాన చెడిపోయే వాళ్ళ క్రొత్త దృష్టి కావాలనటం ఎందుకు? ఇంట్లో రచయిత ఉద్దేశాన్ని విమర్శకుడు చెప్పటంకన్నా, రచయితను చాటు చేసుకుని విమర్శకుడు తన ఉద్దేశాన్ని చెప్పుకుంటున్నట్లుగా ఉంది. అది ఉచితంకాదు. విమర్శకు డెప్పుడయినా తన దృష్టిలో రచయిత విలువను చెప్ప కలుగుతాడు. అందులో తప్పులేదు. కాని తనతో ఏకీభవించనప్పుడు రచయిత తాత్త్వికంగా ప్రబోధించాడని" అనుకుంటున్నప్పుడు 'పాత వాసనలు పోలేదనీ' 'ఎంత చదివినా పుచ్చు వాసనలేదనీ' అనటం విమర్శకు విలువ నివ్వదు. ఇలాంటి మాటల రాళ్లను ఏరి రచయితలపైన రువ్వ టం విమర్శకులకు భావ్యంకాదు.

హైదరాబాద్ — కె. జవహరులాల్

# సమాధానం

1. తత్త్వశాస్త్రంలో ఒక 'వాద' మైన హేతువాదానికీ (**Rationalism as a school in Philosophy**) మనిషిలో ఉండే హేతు వివేచనాశక్తికీ (**Reasoning as a function in man**) భేదం గమనించకుండా మొదట దాన్ని రెండోదిగా అనుకోవటంవల్ల పై లేఖకుడు అయోమయత్వంలో పడి, గోపీచంద్ ఏదో అపచారం జరిగించాడని ఆవేశపడుతున్నాడు. హేతువాదికి బుద్ధిచేసే హేతు వివేచనా, ఆ హేతు వివేచన కందే బహిరుపాధులూ ప్రమాణం. 'బుద్ధి తన హద్దుల నతిక్రమించి అతి భౌతిక విషయములను నిరూపించబూనుకొనినచో ఆ నిరూపణములు కేవల విశ్వాసములే గాని, యథార్థతను కలిగియుండ' వని హేతువాది మతము. ఆత్మవిమర్శ. అంటే 'తన హేతువివేచన ఎటువంటిది? అది సరికాదేమో! ప్రమాణం కాదేమో' అనే సందేహం, కలిగిన వ్యక్తి 'హేతు వాదం' పరిధిని దాటిపోయాడన్నమాట. ఆ దాటటం హేతు వివేచనాశక్తిని అతడు ఒక మెట్టుపైకి తీసుకువెళ్లటం ద్వారానే కావచ్చు. గోపీచంద్ దీనికి చెప్పిన సమాధానం ఒకటే: "తర్కానికి అందకుండా ఉండి మానవుని అభిమానంలోకి వచ్చే అనుభూతులు కొన్ని ఉన్నాయి. మానవునిచేత అనేక కార్యాలను చేయించే స్వాభిమానం అనే గుణం ఉంది. వీటిని వేటినీ లెక్కలోకి తీసుకోదు. హేతువాదం ...." పై వాక్యాలు గోపీచంద్ 'తత్త్వవేత్తలు' సీరీస్‌లో వ్రాసినవి, వ్యాసంలో ఉల్లేఖింపబడ్డాయి కూడా. శచీంద్రుడు హేతువాది, సాంఘికవాది, (అంటే సాంఘిక ప్రయోజనాల దృష్ట్యా శకుంతలమీద తన అదుపులో ఉండి నాట్యం వగైరా నేర్చుకోవడమే చాల హేతుబద్ధంగా కనిపిస్తుంది అతనికి. గోపీచంద్ నవలలో వ్యాఖ్యానించినట్లు శచీంద్రుడికి తన ఆవేదనా, శకుంతలమీది భర్త ఆవేదనా ఒకటిగా, పోల్చదగినవిగా కనుపించవన్నమాట) అతడు తనలోని స్వాభిమానం, అహంభావం లెక్కలోకి తీసుకోలేదు. అందుకే చివరకు శకుంతలను హత్యచేశాడు. ఇలా శచీంద్రుని పాత్రను చిత్రించి నిరూపించిన గోపీచంద్ 'హేతువాది' కాదు, హేతువాదాన్ని దాటి వెళ్ళాడు. ఆ వెళ్లటం హేతు వివేచననూ, దానికి మూలమైన బుద్ధినీ మళ్లీ 'హేతు వివేచన' చెయ్యటం ద్వారానే! అంటే గోపీచంద్ హేతు వివేచనాశక్తి కేవలం 'హేతువాదపు' పరిధుల్ని దాటింది అన్నమాట.

పై విధంగానే ఉషారాణి చక్రవర్తుల సంభాషణను అర్థంచేసుకోవాలి. ఉషారాణి 'హేతువాది' గా మాట్లాడుతుంది, బహిరుపాధుల కందని, తన బుద్ధికి గోచరంకాని చక్రవర్తి ప్రేమ వైశిష్ట్యాన్ని గుర్తించటానికి నిరాకరిస్తుంది. అయితే చక్రవర్తి అంతరంగంలోని భావానికి అస్తిత్వం లేదా, ఉన్నది అంటే అది కేవలం సానుభూతి ద్వారానే గ్రాహ్యం. ఆ సానుభూతి పెంపొందించుకోవటంవల్లే గోపీచంద్ చక్రవర్తి పాత్రను సృష్టించగలిగాడు, ఇది కేవలం 'హేతువాది' అయినవాడు చెయ్యలేడు.

2. అస్తిత్వవాదానికి తెలుగు సాహిత్యంలో రూపం కల్పించిన నవల 'మెరుపుల మరకలు'. కేవలం ఆ దృష్టితో నవల నిర్మాణాన్ని, నవలలో ప్రతి అంశాన్ని పరిశీలించటం జరిగింది. అయినప్పుడు నవలలో సాహిత్యపు ఔచిత్యం దృష్ట్యా గోపీచంద్ వివాహ వ్యవస్థ భవితవ్యాన్ని ఉషారాణి పాత్ర వైశిష్ట్యంతో ముడిపెట్టడం, దాన్ని గూర్చిన ఆలోచనల్ని (అంటే సాంఘిక దృష్టి) అనుబంధం చెయ్యడం లోపమే! అందువల్ల నిరూపించదలచిన అస్తిత్వవాదపు స్వరూపం స్పష్టతను కోల్పోతోంది! అంతేగాని గోపీచంద్ అలా ఆలోచన చెయ్యటమే తప్పని, నాకు నచ్చలేదని కాదు! నిజానికి ఆ ఆలోచనల్ని వేరుగా పొందుపరచిన 'శిథిలాలయం' 'ప్రేమోపహతులు' అనే నవలల్ని గూర్చి వ్రాస్తూ "ఇది గోపీచంద్ అస్తిత్వవాదానికి కల్పించిన మార్గాలు' అన్నాను (చివరి వ్యాసంలో).

3. రచయిత దృక్పథాన్ని దాని క్రమ పరిణామాన్ని ఒక వైపు అతని రచనల ద్వారా వివరిస్తూనే, మరొకవైపు ఆ రచనల్లో సాహిత్యపు విలువల్ని, ఔచిత్యానౌచిత్యాలనూ పరిశీలించటం జరుగుతోంది ఈ వ్యాసాల్లో. దృక్పథాన్ని గురించి తన ఇష్టానిష్టాలు, మంచి చెడ్డలు విమర్శకుడు వ్యక్తం చెయ్యటంలేదు. కాని, ఒక దృక్పథం ఎంతవరకు ఏవిధంగా రచనలో పరిపుష్టంగా ఉన్నదీ లేదు అనే విమర్శ, సాహిత్య విమర్శ అవుతుంది. దాన్ని దృక్పథంమీద విమర్శగా ఈ లేఖకుడు భ్రమ పడ్డాడు. సాహిత్యపరంగా చూస్తే 'అస్తిత్వవాదానికి' అంకితమైన నవలలో 'వివాహ వ్యవస్థ భవితవ్యానికీ అస్తిత్వ వాదానికీ

ఏదో సంబంధం ఉన్నదనే అపోహ రచయిత కలిగించడం' ఔచిత్య లోపమే! ఈ లోపం ఎట్లా వచ్చింది అని అన్వేషిస్తే 'రచయితలో యింకా ప్రాత వాసనలు వదలలేదు' అని సమాధానం వచ్చింది. దీన్ని విమర్శకునికి వృత్తాంతంమీద గల యిష్టానిష్టాలుగా లేఖకుడు లాగిస్తే అది కేవలం శైశవ ప్రవృత్తి (Childish Mentality) శిశువుకి యిష్టానిష్టాలకు మించిన వివేచనాజ్ఞానం ఉండదు కాబట్టి! లేఖకుడికి గోపీచంద్‌మీద అభిమానం ఉండవచ్చు. కాని, ఆ అభిమానం గోపీచంద్ ఎప్పుడూ 'హేతువాదే' అనే మూఢనమ్మకంమీదా, ఆ 'హేతువాదం' పరిధిలో 'హేతు వివేచనాశక్తి' కి యథాతథంగా అన్వయిస్తుందనే అజ్ఞానం మీదా ఆధారపడినప్పుడు, పైగా అది ఆవేశంతో వ్యక్తమైనప్పుడు అపహాస్యం అవ్వదు. గోపీచంద్‌మీదా ఇతర రచయితలమీదా—కేవలం పాఠకులుగా—ఎంతో అభిమానం ఉన్నందువల్లే సమగ్రంగా, నిష్పక్షంగా వారి దృక్పథాలమీద యీ రచన సాగుతోంది. పుస్తకాలు క్షుణ్ణంగా చదవకుండా చదివిన దాన్ని ఆలోచించి లక్ష్యయం చేసుకోకుండా కేవలం వినాదాలతో ప్రచారంతో తృప్తిపడి దురభిమానాలు పెంచుకోవటం నేటి దుస్థితి. ఒక రచయిత పుస్తకాలు ఎలా చదవాలో చదివితే అందులో దేన్ని గూర్చి ముఖ్యంగా ఆలోచించాలో, పుస్తకాలకూ రచయితకూ గల సంబంధ మేమిటో నిరూపించే ఉద్దేశమే 'దృక్పథాలు' వ్రాయటానికి కారణం. ఇందులో ఏం 'ప్రమాదం' ఉందో, 'దురభిమానపోషే' లక్షణం ఎక్కడుందో విజ్ఞులే నిర్ణయిస్తారు! పోతే, 'హేతువాదం అంటే ఏమిటి?' అని ఓనమాలు దిద్దేందుకు యీ పత్రిక పుటల్ని వినియోగించ వద్దని మనవి. అది క్షణ యితరత్రా జరగవలసిందే!

—ఆర్. ఎస్. సుదర్శనం

# ఏది అభ్యుదయ కవిత?

“భారతి” జనవరి సంచికలో శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు—అంతర్కృతం “వ్యర్థ గీతం” అనే గేయాన్ని గూర్చి రాసిన విమర్శను “అక్షయ”గారు సమీక్షించగా, ఆ సమీక్షలోని కొన్ని అంశాల్ని కాదంటూ, అభ్యుదయ కవిత్వాన్ని గూర్చి కొన్ని విషయాలు వ్రాశారు. వానిలో కొన్ని దుర్బలమైనవి. ఆయన ప్రతిపాదించిన విషయాలు ప్రధానంగా రెండు. ఒకటి, అభ్యుదయ కవితా తత్త్వం ఆశావాదాభిముఖంగా ఉండాలన్నది. రెండవది, “వ్యర్థగీతం”లో చదువరి పరిపూర్ణమైన అనుభూతి పొందదన్నది. వీనిలో మొదటి కవితా వస్తు విషయకమైన విభజనకు సంబంధించినది. రెండవది కవితానుభూతికి సంబంధించినది. వీటిని వరుసగా సమీక్షిస్తాను.

అసలు అభ్యుదయం అంటే ఏమిటి? సంఘంలోని వ్యక్తుల మనస్సులోని సద్గుణాల పురోగమనమూ, తద్వారా వికసించే సాంఘిక సౌఖ్య దశాభివృద్ధి. అభ్యుదయం—అంటే ఇది కాగా, అభ్యుదయ కవిత అంటే, ఆ భావాన్ని సమాజంలో వృద్ధి పొందించటం ధ్యేయంతో, వ్యక్తుల హృదయాలకి హత్తుకొనేటట్లు చెప్పే కవిత్వం. ఎట్లా చెప్తే వ్యక్తుల మనస్సు పురోగమిస్తుంది? అన్నది ప్రశ్న. కవి వాక్కులో ఆశ కనిపించాలా? నిరాశ కనిపించాలా? ఆశ కనిపిస్తేనే అభ్యుదయ కవిత—అని ఒక దృఢ నిర్ణయం శ్రీపాదవారు చేసుకొన్నారు. కాని, సత్యాన్ని గమనిస్తే, ఆశ, నిరాశ—రెండూ అభ్యుదయానికే దారి తీస్తున్నవి. ఆశావాక్కుయొక్క ప్రభావం ప్రత్యక్షమైనది, నిరాశావాక్కుయొక్క ప్రభావం పరోక్షమైనది. నిజమైన అభ్యుదయం నిరాశమీదనుంచే వస్తుంది. ఆశను రేకెత్తించే రచన, చదువరిలో ఒక ఉత్తేజనను కలిగించి ముందుకు నడపగా—నిరాశను నిరూపించే రచన, చదువరి హృదయాన్ని కరిగించి, అతని కరుణమీదనుండి అభ్యుదయ భావాన్ని దృఢంగా నిర్మిస్తుంది. ఉత్తేజనమీదనుంచి వచ్చే అభ్యుదయంకన్నా, కరుణలోనుంచి వికసించేది గాఢమైనది, శాశ్వతమైనది.

ఇక ఆయన రెండవ ప్రతిపాదన—ఒక నిరాశామయ పరిస్థితిని వర్ణించేటప్పుడు, తన్నిరాశా కారణమైన దీన దశను గూర్చి గూడా చెప్తే, చదువరిలో సానుభూతి కలుగుతుంది! లేకపోతే కలగదు అనేది. “నాకు కలగదు” అని ఆయన అంటే అభ్యంతరంలేదు. ఎందుకంటే, సిద్ధాంతాభిముఖమైన హృదయానుభూతిని వృద్ధి చేసుకొనే పరిస్థితిలో అది సహజమే ఎవరికైనా. ఉదాహరణకు ధనవంతులు మరణిస్తే ఏడవరాదు అనే ఒక తీవ్ర భావం పెంచుకొన్నవాడు, ధనికుల మరణాన్ని వింటే కరగడు. అతని ఆర్ద్రత ఆ విషయంలో విముఖమౌతుంది. కాని, ఏ సిద్ధాంతంలోనూ, హృదయ భాగాల్ని విభజించనివాడు—భావానికి సూటిగా స్పందించే లక్షణం ప్రాథమికంగా కలిగి ఉంటాడు. మానవ హృదయార్ద్రత “ఎవరో చచ్చిపోయారు” అనటం దగ్గరనుండీ ప్రారంభమౌతుంది. “ఎందుకు చచ్చిపోయారు?” అని తర్కించుకొని ఆరంభం కాదు. చనిపోవడంలోని ఘోరత్వాన్ని అనుసరించి కరుణానుభూతి పెరగడం వేరు విషయంకాదు—ఆ మహానుభూతినే కవి వర్ణించాలి అనడం, కవితానుభూతిని, స్వీయ సిద్ధాంతంతో పరిమితం చెయ్యడమే ఔతుంది. సత్యం ఇట్లా ఉండగా, కారణాలతోపాటు ఒక మహా ఘోర దశను వర్ణించిన కవి కన్నా, ఒక్క మాటలో ఒక మహా దీన దశను వ్యంగ్యం చేసి ఒక కవి పాఠకుల్ని కరిగించవచ్చును. కవితా[illegible]

వాదంమీద ఆధారపడదు. చెప్పిన మాటలోని బరువుమీదా వ్యంజక శక్తిమీదా ఆధారపడి ఉంటుంది. కారణాలు చెప్తే గాని మనస్సు కరగదు—అనడం సార్వజనీనమైతే, కృష్ణశాస్త్రి గారి అనేక ఖండికలూ, శ్రీ శ్రీ యొక్క 'ఒకరాత్రి', విశ్వనాథవారి "నీ రథము"—ఒకటేమిటి? దీన దశావర్ణనలోని చాతుర్యానికి పెన్నిధులైన అనేక ఆంధ్ర, ఆంగ్ల సాహిత్యాల్లోని మహా కవుల రచనలన్నీ వ్యర్థం కావాలి. కాని, కాలేదు. శిలామై చదివే పాఠకుల గుండెలు కరిగిస్తూనే ఉన్నాయి. ఎందుకంటే, పాఠకుల్ని కదిలించేది శబ్ద శక్తియేగాని వేరే మనస్సులో ఏర్పరచుకొన్న సిద్ధాంతాలుకావు.

> "ఎన్ని కడుపులలోని
> దరిద్ర దేవతాంగుళీకరాళ స్పర్శచేత
> మీటబడిన ఆర్తాకలి నరాల పాటలు
> అనంత వాయువీథిమై పోయాయో!"

అనే పంక్తులు చూద్దాం. "ఎన్ని" అని ప్రారంభమై గుండెను బాదుకొన్నట్లు, భావాల్ని అంతంచేసే ప్రశ్నార్థకంగా వాక్యం ముగిసే ఒక విధానం గేయంమీదా అనుసరించబడి ఉండడం, వాక్యమంతా ఉద్రేక వాహినిగా సాగించే సమాసాలు గానీ, చిన్న అనుప్రాసలుగానీ పూసిరిని పటంపేయకుండా చేయడం, దరిద్ర దేవత నరాలను మీటి గానం చేస్తోందన్న భావ చిత్రణా, ఆ పాటలు అనంత వాయువుల్లో లీనమౌతున్నవనడంలో మరణ వ్యంజకతలోని ఘోర దశా, ఇంకా మరికొన్ని విశేషాల సామగ్రితో, ఈ పాదాలు పాఠకుని హృదయాన్ని కరిగించగలవు. "ఆకలితో ఎంతమంది చనిపోయారో!" అంటే కవితా శక్తిలేదుగాని, ఎంతో వ్యంజక సామగ్రి ఉండడంతో పై పాదాలు పాఠకుల్ని కదిలించగలవు. కాబట్టి, "వ్యంజకత" అనేదే కవితా శక్తిలోని రహస్యం. కారణ కల్పన కాదు. కారణాల్ని గూడా ఎంతో వ్యంజకతతో వెలువరిస్తే ఇంకా అనుభూతి కలుగవచ్చునంటే, ఔను. అనుభూతికి అంతే మున్నది? కవి శక్తి నిమ్నమైన విషయం అది.

> "ఎన్ని జీవ సంస్కారాలలోని
> నిత్య చైతన్య మహా సాగర తరంగాలు
> ప్రపంచపు బండకు కొట్టుకొని
> తునా తునకలై పగిలి పోయాయో!"

అనడంలో కవి వ్యంగ్యం చెయ్యదలచుకొన్నది ప్రపంచంలోని మూర్ఖత్వాన్ని. ఎందరు మహోన్నత భావుల సందేశాలకీ బాగుపడని ఈ జనులయొక్క హృదయ శిలా లక్షణాన్ని అంతేగానీ, ప్రపంచం అంతా బండ ఎట్లా ఔతుంది? మహాత్ముల ఉపదేశాలకి కొందరైనా మారలేదా? తరంగాలు విరుగుతాయిగాని పగులుతాయా? ఇత్యాది ప్రశ్నలు వెయ్యడం, అక్కడ ఉన్న పదశక్తిని అధిగమించడమే. ఒక నిరాశా దశను ఇక్కడ ఎట్టి Image తో కవి వ్యక్తం చేశాడు? ఇక్కడున్న "ప్రపంచపు బండ" అనే పదాలలో కవి ఎంత నిరాశను ప్రబలంగా వ్యక్తం చెయ్యగలిగాడు? తరంగాలు పగలడం అనే అత్యంత తిరస్కృత ధ్వని విశేషం ఏమిటి? ఇత్యాది విషయాలాలోచించాలి విమర్శకులు. అంతేగాని, ఏదో కారణాల్ని గూర్చి ఆలోచిస్తే, అసలు ఆ కారణాల్నే నిరాకరించవచ్చును. కవి చెప్పేది సత్యమేకాదు, అసత్యంమీదనుంచి అనుభూతిరాదు– అనవచ్చును. తర్కానికి అంతంటూ ఏమున్నది గనుక? కాబట్టి, కవితానుభూతి తర్కం అప్రధానమైన చోట ఆరంభిస్తుంది.

గేయం తుదకు—"కీచురాయి, ఈ పాట ఆలపిస్తోంది భగవంతుడు వినాలని! ఆయన ఈ పాట వినిపించుకోడు!" అని కవి కీచురాయియొక్క నిరంతర నాదాన్ని రూపొందించిన నిరాశా భావనా పథిని ముగించక, "భగవంతుడే వినిపించుకోకపోతే దిక్కేమిటి?" అని శ్రీపాదవారు ప్రశ్నిస్తే, అక్కడి నైరాశ్య భావానికి దిక్కేమిటి? భగవంతుడు వినిపించుకోకపోవడంలోని ఒక దౌర్భాగ్య దశని రూపు గట్టడం కదా కవి ధ్యేయం? ఆ దృష్టితో చూడవద్దా విమర్శకులు మరి? భగవంతుడు విన్నట్లే చెప్పాలి—అనే ఒక భావాన్ని స్థిరీకరించుకొన్న మనస్సులతో చదివితే సరియైన అనుభూతి సిద్ధిస్తుందా?

"ఆయన ఎప్పుడు వినునో!" అని వేసుంటాను. అన్నారాయన. కాని ఆ మాటతో గేయం చప్పబడి పోతుంది. "ఆయన వినిపించుకోడు, ఆయన వినేదాకా కీచురాయి తన పాట ఆపదు" అనడంలో కీచురాయియొక్క నాద శాశ్వతత్వపు సహజ విషయంలోని చమత్కృతి జోడించడంలోని, అనంత నైరాశ్య ధ్వని పై మాటల్లో లేదు.

శ్రీపాదవారు సహిస్తే, మరొక్క మాట. ఆయన ఆదేశా నన్నుసరించి గట్టిగా చెప్తాను. ఆదినుంచి ఆయన వ్రాసిన విమర్శలన్నీ చదివాను. ఆయన శైలిలో శక్తి ఉన్నది. ఈదైన ఒక విధానం ఉన్నది. అనుభూతిగాఢత ఉన్నది. ఇంకా కొన్ని ఉత్తమ గుణాలున్నవి. కాని, కొన్నిచోట్ల ఒక లోపమున్నది. ఆయన కొన్ని సిద్ధాంతాలు గట్టిగా ఏర్పరచుకొన్నారు. వాటికి ఎదురైన భావాల్ని, అవి ఎంత కవితా శక్తి నిముడ్చుకొన్నావరే, ఆయన మెచ్చలేరు. అక్కడ మాత్రం తర్కిస్తారు. తన సిద్ధాంతానుకూలమైతే, ఇక తర్కం ప్రశ్నలేదు. అనుభవించడమే! కాకపోతే

> "కవి హృదయంలాగా
> నొక్కబడిన కీచురాయి గొంతు."

అంటే, "ఎవరు నొక్కేరూ దాని గొంతు?" అని ప్రశ్నించడం నిజంగా ఎంత బాధాకరం? కీచురాయియొక్క సన్నని నాదాన్ని నొక్కబడిన గొంతుగా ఉత్ప్రేక్షించి, దాని పోలికగా కవి హృదయాన్ని తెచ్చి, శాశ్వత నైరాశ్యాన్ని ధ్వనింప

తీసిన వైనం చూడకుండా తర్కాన్ని తెస్తే సమాధానం ఏముంది?

"ఆశావాదాభిముఖత్వము" ఉంటేనే అభ్యుదయ కవిత్వం, అని ఒక సూత్రం ఏర్పరచి, ఆ పరిధిలో అనుభూతిని నిర్ణయించడం చాలా అన్యాయమైన విషయం. ఒకడు తన నిరాశను చెప్పగా, అది విని జాలి పొంది, దాని అభ్యుదయానికి తోడ్పడటం అసంబద్ధంకాదు. ఐనా, ఇది తార్కిక సమాధానమేగాని, కవితానుభూతి సమర్థనకాదు. ఆయన అనుభూతిని విమర్శించారు గాబట్టి ఇంత వ్రాయవలసి వచ్చింది. ఇది "అభ్యుదయ కవిత్వం" అని వేసుకొన్న జాబితాలో చేరదు— అంటే, కానీండి! తామనుకొన్న అభ్యుదయ కవిత్వమే అనుభూతి కల్గిస్తుంది. మరొకటి కల్గించదు— అనలేరు గదా! పైగా "అభ్యుదయం" అనేదాన్ని సమగ్రంగా నిర్వచించ దలచుకొంటే ఈ గేయం అభ్యుదయ కవిత్వమే అనడానికి తగిన ఉపపత్తిని మొదటే నిరూపించాను.

ఏమైనా, శక్తివంతంగా చెప్పడమంటే, అవతలివాళ్ళ బాధించడంకాదు. నిరాశా భావాన్ని చెప్పేవాడికి మరణమే శరణ్యమనడం చాలా అన్యాయం. ఆయన దృష్టిలోనైనా, అది అభ్యుదయభావంకాదు. "ఇకముందు తన రచనలో ఆశను బలంగా చెప్తాడీ కవి" అని తన ఆశను వ్యక్తీకరించవద్దా మరి?

ఏది ఎట్లా ఉన్నా, ఏ చర్చ ఎట్లా సాగినా, చివరి మాట ఏమిటంటే— ఎంత శక్తివంతమైన కవిత్వమైనా అందర్నీ కదిలించదు. తదభిముఖ భావం ఉంటేగని, అందులో అనుభూతి మన హృదయ బహిర్ద్వారాన్ని దాటదు. ఒక కవి రాస్తాడు— దానిలోని తత్త్వం ఎవర్ని కదిలిస్తుందో వార్ని కదిలిస్తుంది. వారియొక్క సంస్కృతి మీదా, సహృదయత మీదా, దాని విలువ ఉంటుంది. మూడు కాలాలలోనూ, కవిత్వతత్త్వం ఇదే! ఆనందించేవాళ్ళని ఆనందించనియ్యండి!

మచిలీపట్నం —ఎ. రామమోహనరావు.



# గ్రంథ విమర్శలు

## పరమాణు కేంద్రపు భౌతిక శాస్త్రాంశములు:

ఇది ప్రొఫెసరు హీసెన్‌బర్గ్ రచించిన "పరమాణు కేంద్రక(వస్తు, శక్తి)విజ్ఞానము" (Neuclear Physics) అనే ఉద్గ్రంథమునకు శ్రీ గొ. వె. ర. కృష్ణారావుగారి ఆంధ్ర అనువాదము. మద్రాసు విశ్వ విద్యాలయమువారి ప్రచురణము. 6 × 10 అంగుళముల సైజులో 358 పుటలు. వెల 10 రూపాయలు.

ప్రొఫెసర్ హీసెన్‌బర్గ్ ఉపన్యాసముల రూపములో ఎనిమిది అధ్యాయములుగల ఈ పుస్తక మూలమును జర్మన్ భాషలో రచించెను. ఇది ఇంగ్లీషు లోనికి పరివర్తితముకాగా ఆ ఇంగ్లీషు గ్రంథమును తెలుగులో ప్రచురించవలెనని మద్రాసు విశ్వ విద్యాలయమువారు పోటీ చేర్పరచి, వారిగో అధ్యాయమును తక్కినవారికన్న తెలుగులో చక్కగా రచించిన గొ. వె. ర. కృష్ణారావుగారిని తక్కిన గ్రంథమునంతయు వ్రాయుటకు నియమించినారు. ఇది వారి పూర్తి గ్రంథము. తెలుగు భాష పనికిరాదు కాక ఇంత పెద్ద సైజులో వైజ్ఞానిక గ్రంథమును తెలుగులో ప్రచురించినవారు లేరనే అనిపిస్తోంది నాకు.

అయితే తెలుగు వైజ్ఞానిక గ్రంథాలలో సామాన్యంగా గోచరిస్తున్న పారిభాషిక పదాల పునరుక్తిదూ, అజ్ఞాత వస్తు గోపనమూ, భావ మాత్ర భంగమూ, ఈ పెద్ద గ్రంథములో కూడా ధారళంగా కనపడుతూండడముతో ఆంధ్రీకరణో ద్యమము బాధకారికాదా? అన్న సందేహము కలుగుతోంది. పారిభాషిక పదావళి — ఈ గ్రంథకర్తవలె — ఎవరి పదావళిని వారు సృష్టించుకునే స్వేచ్ఛ విజ్ఞాన విస్తృతికే ప్రతిబంధకము. వితతకాలంలో వైజ్ఞానిక పదావళి కొంత వలిగి వలిగి క్లుప్తమై ఒక రూపానికి వచ్చింది. తెలుగు భాష సమితి గ్రంథాలలో సులభ వ్యవహార యోగ్యమైన పదావళి చాలా ఉన్నది. ఆ అనుభవాన్ని ఉపయోగించుకోవడమూ ఒక్కొక్క పదాన్ని సమాసాన్ని వాడడము యుక్తమనుకాని, "కాంతి పూర్ణముగ ప్రతి ఫలించుట (Total internal reflection), విద్యుత్ తిరస్కృతి, తరచు (Frequency), విద్యుదావేశకస్తులు (Charges ట) ఉపరితల ఉద్వేగము (Surface tension) ప్లాంకు స్థిరరాశి (Planck's constant), నిష్పంజా (Absolute), గతిప్రాపటీమానము (Valency), రేడియో ధర్మము (Radio activity), స్థాన లక్షణదర్శిని (Periodic table) ప్రాథమిక పంచయము (Quantum) అవధి (Space), ఊదాకు అవ్వలికాంతి (Ultra violet light), న్యాయము (Law), సరితూగు భారము (Equivalant weight), అణుస్థిత-అక్షయ్య-ద్రవ్య దర్శిని (Mass spectograph) అంటూ "అనుకూల పారిభాషిక పదార్థం— దండాన్వయం సమర్పయామి" చేస్తూ పోతే ఎవరి రాతలు వారికోసమేగా తయారవుతాయి, ఇలాగే ఒక్క పారిభాషిక పదముకోసము మిలిములిప్పి, నిర్వికల్పము, అక్షరము (Indestructable), దేశము, అవధి, అవకాశము(Space), సంక్షేప, సంస్థిరత్వము(Conservation) కణము, అణువు (Molecule) రజము, లేశము, రేణువు, రవంత (Particle), ఆరోపణము, ఆవేశము, విద్యుత్ పూరణము, శక్తి (Charge) అంటూ ఎప్పటి కెయ్యది తట్టిన అప్పటికా మాట వాడితే రచయిత నేర్పు చూచి చూచి, చదివే ఓర్పు పోతుంది. "ఆ పదము ప్రమాణముకాదు, ఇదీ కాదు" అన్న అభిప్రాయము లుండవచ్చునుకాని అన్ని మాటల్నీ మార్చడము పులుముడుగా కనబడిపోతుంది. వివరీకరణములో అన్ని పారిభాషిక పదాల స్థానంలో దండాన్వయ పదాలు ప్రవేశ పెట్టడము రచయిత జాగ్రత్త లోపించినదనీ, తొందరగా రచించి ఉండవచ్చుననీ సూచిస్తుంది.

జాగ్రత్త లేకపోవడమువల్లనే సూత్రాల్నీ వైజ్ఞానిక సత్యాల్నీ చెప్పేటప్పుడు వింత భాష వైశిత్యమూ కాక పులుముడు ప్రవేశిస్తుంది. "ఎంతో కొంత పరిమాణముగల హైడ్రోజన్ వాయువు మరెంతో కొంత పరిమాణముగల ఆక్సిజనుతో సమ్మేళనమునొంది నీరేర్పడదు. అవి 1:8 లో కలిసి..... నీరేర్పడుచున్నవి" ట. 'పరిమాణము' అన్న పదాన్ని నిర్ణ (Volume Quantity Magnitude) అను మూడు పదాలకూ ప్రయోగించారు. పై వాక్యానికి చుట్టుపట్ల బరువు అన్నమాట నీరు వాడనేలేదు. మరి ఇక్కడి 1:8 నిష్పత్తి 'బరువును బట్టి' అని ఎలాగ తెలుస్తుంది? "ఈ ప్రత్యేక వస్తువు దానిని తాకెడి ప్రసారమునంతయు గ్రహించి విలువు కొనగలదు" ట (57 వ పుట) Black body అన్ని (రంగుల) ప్రసారమునూ చూపించగలదూ, పల్లీ ప్రసారించగలదు. విలువుకొనగలదని ప్లాంకూ అనలేదు, హీసెన్‌బర్గ్ అని యుండరు (అది తప్పుకనుక) మాత్రములు చెప్పేటట్ల అక్కరలేని మాటల దూబరా సమ్మకారి. ఈ పుస్తకములో పర్యాయ పదములు ధారాళముగా కనబడుతున్నాయి. విశదముచేసే యత్నము కాబోలు. ఆ అలవాటు నిర్వచనాలకూ, సూత్రాలకూ కూడా సంక్రమించినట్లున్నది. అలా

ణము. మొండములయందు తర్వాత ప్రకరణమునందు 'లయాత్మక మగు ప్రసారము' ఏమిటి? 'లయా విన్యాసమైన' ప్రసారమది. 85 వ పుటలో "శక్తివంతమైన లయాస్పందిత క్షేత్రమున ఎలక్ట్రాన్లు దిశకూ........పాజిట్రాన్లుకు దిశగా తెరుగ గొట్టబడును. అందువలన నవి వృత్తాకార మార్గములలో చలించుచుండును" అన్నారు. తెరుగగొట్టబడవు వృత్తాకార మార్గంలో వ్యతిరేక దిశలో తిప్పబడతాయి. మూడు ఫలితాలూ ఒకే క్రియ. ('అందువలన' అని అక్కర లేని తప్పుడు మాటను వేస్తూ) ఒక దానికి యింకొకటి ఫలితా లన్నట్లు తప్పుగా సూచించరాదు. 'తెరుగగొట్టబడును' అన్నది సరికాదు, 'తిప్పబడును' అవాలి. ఈ త్రిప్పటకి కర్త నున్నది 'తెరుగగొట్ట' అన్న మాటకి కర్త లేదన్న అర్థమున్నది. 'గమించే విద్యుదావేశితకణము లయాస్పందిత క్షేత్రములో వర్తుల మార్గంలోనికి తిప్పబడుతుంది" అన్న మౌలిక సూత్ర ఫలితము చెదిరిపోతోంది పై రాతలో. వైజ్ఞానిక సూత్ర ఫలితాన్ని చదువరి గుర్తుగా కూడ దీసుకునేట్టు ఇవ్వరి గాని చెదిరిపోస్తే ఎలాగ? "ఆంగ్లమున పరిష్కృతము" అయిన ఈ పుస్తకంలో ఈ రకపు పరిష్కారము జరగడము మూలం గ్రంథ వస్తు పరిజ్ఞాన లోపము వల్లనే. అనువాదకునికి ఇంగ్లీషూ, తెలుగూ తెలిస్తే చాలదు. మూల గ్రంథ వస్తువు తెలియకపోతే "ముద్దుముద్దకీ బిస్మిల్లా".

ఇంగ్లీషు(వచన) రచన విహంగ యానమువలె పలు ముఖాలుగా సాగిపోతుంది. తెలుగు రచన వ్యాకరణమూ జాతీయమూ అన్న ఘటములలో శిరసావహించి పరిమిత రంగములోనే నర్తిస్తుంది. ఇంగ్లీషు మూలములోని వాక్యము వాక్యానికీ "సరిపోతున్నట్లుగా" మాత్రము తెలుగు వ్రాసుకుంటూ పోవడము ఇంగ్లీషు రచనా భావ మాత్రము తెలుగులో నిరంతరాయముగా దిగడానికి చాలదు. "తీర్థానికి తీర్థమూ, ప్రసాదానికి ప్రసాదమూ" అన్నట్లు తెలుగు వాక్యాల దారి వాటిదీ, మూల గ్రంథకారుని ఆలోచనా మాత్రపు నడత దానిదీ అయిపోతుంది. వైజ్ఞానిక గ్రంథంలో యీ నలుగుడువల్ని నష్టమెక్కువ. అయినా కూడా ఇది ధారాళముగా కూడా కనపడకుండడము శోచనీయము. ఈ పుస్తకములోనూ ఆ నష్టము బాగా తెలుస్తోంది. 86, 87 పుటలు పాలీ కనుక్కున్న 'మ్యాట్రిక్స్' అన్న వీక్షణ దర్శనమును గురించినవి. పాలీ మేధా సౌందర్యము పైన చెప్పిన కారణమువల్ల మరుగుపోయి అదృశ్యమవుతోంది. వెనకటికి దీక్షితులుగారి 'పాక శాస్త్ర పరీక్ష' లో పెళ్లికూతురు, గోధుమ రవ్వ తూచి పోసింది, నెయ్యి కొలిచి పోసింది, స్టౌ మీదె పెట్టింది. వాటి పట్టుకుని, అర నిమిషమే వేచి, కొలిచి పెట్టిన నీళ్లే పోసింది. ఉప్మా ముద్ద ముద్ద అయిపోయిందంటే ఆమెగారి తప్పేమిటో ఆమెకు తెలియలేదు! ఆ కథ జ్ఞాపకానికి వస్తున్నది. ఈ గ్రంథపు మొత్తపు వైఖరి చూస్తే. క్లిష్టాతి క్లిష్టమైన కేంద్రక విజ్ఞానమువంటివి వాక్యముల తెలుగు చేత మాత్రానికి సరిగా దిగవు. ప్రతి వాక్యమూ దాని క్రితపు వాక్యము అందించే విజ్ఞానపు వూహ పుచ్చుకుని సాగాలి. ఆ పని చేయగల అదుపు మాటలను మూల గ్రంథకారుని వూహకు అనుకూలముగా, విజ్ఞాన వస్తువుకు సప్రతికూలముగా అనువాదకుని వచన రచనా ప్రత్యేక గుణాలకు నాతికూలముగా అయ్యే పాకములో ప్రయోగించాలి. స్వంత గ్రంథాలు వ్రాయడముకన్న అనువాదాలు రచించడములో బాధ్యత ఎక్కువ ఇక్కడ ఒక పొరబాటుతో ఇద్దరికి దెబ్బ! అనువదించిన ఇలాంటి పెద్ద గ్రంథాలు గ్రంథ వస్తు పరిచయముగల వారిద్దరు ముగ్గురు పరిశీలించి దిద్దిన తరవాతగాని ప్రచురించేయడము యుక్తముకాదు. వారిలో ఒకరికైనా తెలిసి ఉంటుంది దక్కిన వారిని హెచ్చరించడానికి. పెద్ద పుస్తకాలు చక్కగా ఉపయోగానుకూలంగా ఉండాలని అందరూ ఆశిస్తారు గదా? పుస్తకము అచ్చు కొట్టేసిన తర్వాత లోపాన్ని తెలుసుకోడము కంటె—తన స్వంత పుస్తకము కాదుగదా—లోపాలు సవరింపించుకోడము రచయితకే లాభము.

—ఆచార్య

# కవిరాజు జీవితం

(కర్త : త్రిపురనేని సుబ్బారావు, వెల : సాదా ప్రతి : 4–00, మేలు ప్రతి : 5–00, ప్రాప్తిస్థానం : కవిరాజ సాహితీ సదనం సి, 75, మలక్‌పేటకాలనీ, హైదరాబాదు 24.)

త్రిపురనేని రామస్వామి చౌదరిగారిని గూర్చి యీ తరము వారికి ఎక్కువగా తెలియదు. వారిని గూర్చి తెలియజేయుటకు అప్పుడప్పుడు అర్హులయినవారు, అనర్హులయినవారు ప్రయత్నము చేయకపోలేదు. ఈ ప్రయత్నములవలన రామస్వామి చౌదరిగారి మూర్తి తెలుగువారికి పరిపూర్ణముగా వెల్లడి యైనదని నికరముగా చెప్పజాలము. ప్రాచీన భారతీయ విజ్ఞానమును వ్యాఖ్యానించుచున్నవారి మాదిరిగా, రామస్వామి చౌదరిగారి సిద్ధాంతములను పలుమూలల చాటుచున్నవారును విరళముగా నున్నారు. తమ తలపులను రామస్వామి చౌదరి సాహిత్యమున కంటగట్టి, వారిని వేదికలపైనిలుపువారు కొందరు కాగా, కొందరయితే ఆయన మూల సిద్ధాంతములను సరిగా అవగాహనమునకు తెచ్చుకొనజాలక కేవలము పైబడిన వారి మూర్తిని నలువురకు చూపుచున్నారు. దీనివలన కలిగిన ఫలము, శ్రోతలకు పాఠకులకు రామస్వామిగారి సత్యస్వరూపము సాక్షాత్కరించకుండుట. అనుయాయుల యధికారఖేదముబట్టి ఈ స్థితి ఏర్పడినప్పుడు, రామస్వామి చౌదరిగారి సాహిత్యము గిట్టని, పట్టనివారి వలన నెంత వికృతి కలుగునో వేరే చెప్ప పనిలేదు. ఈ గిట్టనివారు కవిరాజ సాహిత్యమును సహచిత్తముతో చదివినవారని గాని, ఒకవేళ చదివినను సమచర్చనమును పొందినవారని గాని చెప్పుటకు వీలులేదు. తమ మనస్సులలో తలపులలో, నడవడికలలో ఎంతో క్రుళ్ళు కువాడన్ను

తీరుకానిపోగా, రామస్వామిచౌదరిగారి సాహిత్యములో నున్న బలతయు సరియని యీ యెదిరి తెగవారు తూలనాడుచుండిరి. మొత్తముమీద రామస్వామిచౌదరిగారి సిద్ధాంతములను పొగడిన వారి వలన, తెగడినవారి వలన ఆయన వర్ణద్వేషి, చార్వాకుడను తలపులు తెలుగువారిలో విరివిగా పెరిగినవి. ఇది ఆయనకు జరిగిన ఘోరాపచారము. రామస్వామిగారి విమర్శను, వారు విమర్శించిన ధర్మమును మెచ్చుకొన్నవారు సద్వర్ణములలో నున్నారు. చారిత్రక కారణములనుబట్టి వారివిమర్శ కొందరకు ఈవలనే పొడచుకొన్నదేమో! అది రామస్వామి చౌదరిగారి తప్పు గాదు. ఆత్మవిమర్శ, ధర్మవిచారణ చేయవలెనని ఉత్సాహం కారమును పెంచికొన్నవారి తప్పు రామస్వామి చౌదరిగారి తప్పెట్లగును ? వారల సిద్ధాంతముల విస్తృతిని [illegible], వక్రభాష్యములను వ్రాసి, ఆ భాష్యములను జన్మముల నెత్తిమీద రుద్దినవారే యింతగా అపఖ్యాతి పొందినచో, ఆ భాష్యముల వలన వేలకొలది యేండ్లనుండి సదుపములు విరిగిపోయి, జరగరినదానికెంతగా అగ్రహోదగ్రులు కావలె. యథార్థము ఎప్పుడు లోకమునకు కంటకింపుగనే యుండును.

రామస్వామిచౌదరిగారు ధర్మమును రామణీయముగా ప్రవచించిన కవి. ఆయన భగవంతుని పేర జరుగు ప్రళయములను నివారింపజూచిన ధీశాలి. పరిమితమైన ధర్మమును వాడుకకు తెచ్చిన పురాణములలోని అధర్మమును బట్టబయలు చేసిన సత్యవాది. హైందవ సంస్కృతిని యథార్థముతోడి దృష్టితో పరిశీలించిన ధర్మవేత్త. హైందవ ధర్మమునే ప్రమాణముగా తీసికొని, దేవేంద్రుని జీవితమునే సాక్ష్యముగా పరీక్షించినచో, అతనికంటె దుష్టుడు మరొకడుండడని తేటతెల్లము కాకపోదు. చెప్పనలవిని గంగిరెద్దువలె తలయూచుచు ఒప్పుకొనని పెడవాదము, తరతరముల నుండి యొకజాతికి దాస్యము, గ్రుడ్డివారై ఎడ్డతనముతో బ్రతుకీడ్చు పామరులపట్ల వలపుమాపు మానవతావాదము, ఎక్కడి కక్కడ గిఱిగీసిన ధర్మములోని మంచి చెడులను తెలుగున కీడ్చు నిశ్శంక సాహసము, ఆ ధర్మము పెల్లడించు గ్రంథముల గుట్టు మట్టులను కూలంకషముగా తెలిసికొను తీవ్ర పరిశోధనము, ఆ పరిశోధన ఫలములను అందముగా ముద్దులొలుకు తెలుగు నుడికారములో, ఎడక కుంటుపడకుండ సాగుగ, కత్తి పదునువంటి కవితాశక్తి, ఆశక్తి వెల్లడి యగుటకు మార్గమైన యుపహాసము, రామస్వామి చౌదరిగారిని నడిపించిన మహోల శక్తులు. తమ విశాల ధర్మమును విపులీకరించుటకయి వారు చరిత్రను, సాంఘికశాస్త్రమును, ఆధునిక మానవ శాస్త్రమును స్వేచ్ఛగా వినియోగించుకొనిరి. సత్యమును చెప్పునప్పు డాయన వాక్కులో వడివిని, వేడిమిని పుణికిపుచ్చుకొన్న గడుసరితనము లేకపోలేదు. పుట్టు మొదటిసారిగా క్రొత్తబాటలు త్రొక్కువారి పోకడలలో వాడిమి వేడిమి యుండక తప్పదేమో! తనవాడు తన చుట్టుపట్టుల త్రుళ్లింతలాడు దోషములను చూచియే కవిరాజ సాహితీసృష్టి గావించెను. ఆ దోషములు కొన్ని యిప్పుడు లేవు. కొన్ని యున్నవి. మరికొన్ని క్రొత్త దోషములు ఏర్పడుచున్నవి. ఈనాడు రామస్వామిచౌదరిగారి సాహితీ తత్త్వమువలన ప్రయోజన మున్నదా ? యను ప్రశ్న ఉదయించక పోదు. రామస్వామి చౌదరిగారి సాహిత్యములో ధర్మరక్తి, కవితా సౌందర్యము ప్రధానాంగములు. ధర్మములను తెలిసికొన గోరుకొనువారికి సరియైన దారిచూపు, సౌందర్యముతో మనసుకొనువారికి ఉపాస్యప్రాయమైన ఆనందము కవిరాజ కావ్యము లిచ్చును. క్షేమేంద్ర వేమనాదుల కావ్యములకున్న చెల్లుబడియే వారి కావ్యముల కుండును.

అట్టి రామస్వామి చౌదరిగారి జీవితమును, సాహిత్యమును ఒక యాకారమునకు తీసికొనివచ్చి త్రిపురనేని సుబ్బారావుగారు ఆంధ్రుల కందిచ్చిరి. సుబ్బారావుగారు పరమార్థ నివేశముతో కవిరాజ జీవితమును రచింప బూనుకొనిరి. మొదట రామస్వామి చౌదరిగారి జీవితమును చిత్రించిరి. పిదప వారు రచించిన యొక్కొక్క సాహిత్య ప్రక్రియను గూర్చి యొక్కొక్క యధ్యాయము వ్రాసిరి. ఈ సాహితీ ప్రక్రియా విచారమునకు పిదప కవితా పరామర్శ, తాత్త్వికదృష్టి యను మఱి రెండధ్యాయములను చేర్చిరి. ప్రతి భాగమునందు కవిరాజ **గారి అంతరవ్యక్తినిగూర్చి, సాహితీ వ్యాసంగమునుగూర్చియు—** విజ్ఞులు, పత్రికలు వెలువరించిన అభిప్రాయములను పొందించిరి. ఎక్కడెక్కడో యున్న విషయములను కవిరాజుతో సంగడించినవానిని సుబ్బారావుగారు చక్కని వరుసలో చేర్చిరి. శైలి సరళమైన శిష్ట వ్యావహారికము. అతుకులు గతుకులు లేని చక్కని కూర్పు కలది. సుబ్బారావుగారు చేసినది చారిత్రక విమర్శ. ఇది ప్రాచీనులకు తెలియనిది. పాశ్చాత్య విమర్శ వాసన గలది. చారిత్రక విమర్శ యనగా సాహిత్యావతరణమునకు మూలములైన లౌకిక కారణములను కనుగొనుట. కవి పుట్టి పెరిగిన సంఘము, ఆనాటి సామాజిక శక్తులు, ఆ శక్తులు కవిమీద పనిచేసిన తీరును, తత్ఫలితముగా కవి పొందిన దీప్తి, ఆ దీప్తి ఆ కవి రచనలలో చోటు చేసికొన్న తీరు మున్నగునవన్నియు చారిత్రక విమర్శలో ముఖ్యాంగములు. రామస్వామి చౌదరిగారి సాహిత్యమునకు సంబంధించిన యీ ముఖ్యాంగముల పరామర్శయే యీ గ్రంథములో విశేషము. సుబ్బారావుగారు ఒక్కొక్క సాహిత్య ప్రక్రియను చారిత్రక విమర్శ కోణమునుండి సమగ్రముగా పరిశీలించిరి. [illegible] సాహిత్య ప్రక్రియకు సంబంధించినంతవరకు సుబ్బారావుగారు చేసినది వ్యాఖ్యానమువలె నున్నది. పుస్తకమును పూర్తిగా చదివిన తరువాత పాఠకునకు కవిరాజ సాహితీ లౌకికమూర్తి సంపూర్ణముగా సాక్షాత్కరించును. ఈ గ్రంథమును జదువునపుడు రామస్వామిచౌదరిగారు తన గ్రంథములకు వ్రాసిన పీఠికలను చదువుచున్నట్లే యుండును.

ఒక కవి సాహిత్యముయొక్క లౌకికమూర్తి కంటె అతి ప్రధానమైనది దాని అంతరమూర్తి. ఈ యాంతర

చును. లక్ష్మిని ప్రేమించిన మూర్తి యీ నాటకమున ప్రతి నాయకుడు. అప్పన్న భుజంగరావు నమ్మినబంటు. లక్ష్మి రాజారావుల ప్రణయము ప్రోదిచేయుట కతడెంతో తోడ్పడును. లక్ష్మి రాజారావునకు వ్రాసిన ప్రణయలేఖను చూచి, మూర్తి తంత్రములు పన్ని, భుజంగరావు లక్ష్మిని చెఱబెట్టునట్లుగా చేయును. రాజారావు వచ్చి అన్యాపదేశముగా లక్ష్మికి వినబడునట్లుగా నొక పద్యము పఠించును. లక్ష్మి చెఱనుండి తప్పించుకొని అప్పన్న నాశ్రయించును. అప్పన్న లక్ష్మి రాజారావులకు వివాహము చేయువేళ భుజంగరావు హృదయపరివర్తనము గలిగిన మనిషి వచ్చి వర్ణాంతరవివాహము చేసికొనుచున్న చిన్న జంటను దీవించును. పురోహితులగు అవధాని, సిద్ధాంతి ప్రాచీన సంప్రదాయాభిమానులు, లక్ష్మిరాజారావుల ప్రణయమును పరోక్షముగా ప్రతిఘటించినవారు. స్థూలముగా ఇదీ కథ.

దీనికి "నవరాత్రులు" అను పేరేల కల్గినది? ప్రతి నాయకుడగు మూర్తి సిద్ధాంతితో ఈ విధముగా చెప్పును. "లక్ష్మిరాజారావులు ఈ గాంధి నవరాత్రులు తొలిరోజున ప్రేమించుకున్నారట! క్రమంగా వారి ప్రేమ వృద్ధిచెంది మధ్యలో వారికి ఎడబాటు కలిగినా, మళ్లీ నిన్నటిదినం కలిసికో గలిగారట! రేపు తొమ్మిదవ రోజు కదూ? అంచేత ఆనాడు ఈ వర్ణాంతరవివాహము జరిగిస్తే గాంధిగారికి ఆత్మశాంతి కలుగుతుందట! ఆయన ఆశయమూ నెరవేరుతుందట! తెలిసిందా?" తొమ్మిదినాళ్లలో చెల్లిన యితివృత్తమిది!

ఇది ప్రచారదృష్టితో వ్రాసిన నాటకము. నాటకీయ శిల్పము వ్యంగ్యము. సన్నివేశముల చేర్పులో గాని, సంభాషణల కూర్పులో గాని, పాత్రల మనోధర్మము తీర్పులో గాని సంభావ్యత యున్నపక్షైనాలేదు. లక్ష్మిరాజారావుల ప్రణయగాథ యిప్పటి సినిమాలలోని కథల మాదిరిగా నడచినది. పాత్రలు సందర్భోచితములు గాని యధికప్రసంగములు చేయును. వారి మాటలలో ఇప్పటి సాంఘికసమస్యల ప్రస్తావనము నిర్హేతుకముగా దొరలును. భుజంగరావు హృదయ పరివర్తనము సంభవించినతీరు అసహజముగా నున్నది. వర్ణాంతర వివాహములు ప్రచారము చేయువారు నేడు నేల నిడిచి సాముచేయు చున్నారు. ఆ సామే యీనాటకములో కలదు. వర్ణవ్యవస్థాసంఘమున విస్మరించిన యాదర్శవాదము వలన కలుగు మేలు హానిక్కి- సంఘసంస్కారమును నిరోధించుటకై వాటినేటికి సర్వ కులములవారు బహుముఖములుగా ప్రయత్నించిరి. ప్రయత్నించు చున్నారు. చారిత్రకకారణములను బట్టి ధర్మము పేరిట ఒకకులము అహంకారమును పెంచుకొనగా, వర్తమానకాలమును బట్టి, నాగరకతా ధనకనకవస్తువాహనముల పేరిట మరొకకులము అహంకారమును పెంచుకొను చున్నది. స్థితిగతులను సాకల్యముగా పరిశీలింపక యొకకులమును విమర్శించుట "అభ్యుదయము" నకు లక్షణమేమో కాని సమచిత్తతకు తార్కాణము గాదు. లక్ష్మిరాజారావుల ప్రణయము బజారువలపు. ఈవలపును జూచి పవిత్ర సాధ్యసాధనములనే యంగీకరించు బాపూజీ యంతరాత్మ యశాంతికి నిలయమై క్రుంగి కూలి పోవును. పెద్దపెద్ద మాటలను వాడుట, నలుగురిలో చెప్పుట, ప్రబలముగు పరిశోధన మగుచున్నారమనుకొనువారు ఈనాడెందరోయున్నారు. అట్టి ప్రచారమాత్ర జీవుల కీనాటకము రుచించును.

## అంతస్స్రవంతి

కథలసంపుటము, కర్త: కె.వి. ఆచార్య. వెల: 2.00.
ప్రాప్తిస్థానము:— (విజ్ఞానపీఠి, బచ్చేరావుపేట కడప)

మానవజీవనము విశాలమయిన రంగస్థలము. ఈరంగస్థలములో వ్యక్తి పలురకములయిన కోరికలతో విహరించు చుండును. కొందఱ కోరికలు నెరవేఱవు. కోరికలు నెఱవేరనప్పుడు సంయమమును కోల్పోవువారు కొందఱుకాగా, కొందఱు మనసును చెడగొట్టుకొని తమతోపాటు ఇతరులనుగూడ నాశనము చేయుదురు. జీవితములో చరాచిక్కులెన్నో. ఇవి యితరులు కల్పించినవి కావచ్చును. లేక మేని ప్రలోభవేపోవుట చిత్తక్షోభమునకు తోడయిన కోరికల ప్రత్యక్ష కల్పించినవి కావచ్చును. లభించినదానితో తృప్తిపడుచున్నవారు కొందఱు అందని దానికొఱకు ఆరాటపడువారు కొందఱు. జీవనములో ఏదోయొక సందర్భమున నైతికముగా పతనమగువారే యొక్కువ మంది యుందురు. పతితులలో కూడ అంతర్వాణియుండును. పరోపకారదృష్టి యుండును. జీవితములో తమవలన క్రుంగి పోయినవారి సర్వము చేసికొను సహృదయత, వారికి మేలు చేయు సహానుభూతి పతితులలో నుండును. చేసిన పాపములకు ప్రాయశ్చిత్తముగా వారు అయినవారికి కానివారికి ఉపకృత చేయుదురు. వీరి మనుగడలో ఒక ప్రమాణమును బట్టి చూచిన వెలుగు, మరొక ప్రమాణమును బట్టి చూచిన చీకటి యున్నట్లు అగుపడును. కాని సంఘము వారి నేనాడు క్షమించదు. దానిదృష్టిలో వారు అస్పృశ్యులే. వాంఛలు, సంఘము అను రెండు తిరుగలి రాళ్ల నడుమ వ్యక్తి చితికిపోవుచుండును. ఎప్పటికప్పుడు వ్యక్తి వివేకము నుపయోగించనిచో, అతడు తన జీవనములో అకాలవిలయములను సృష్టించికొనును. ఆత్మనివేదన, సహానుభూతి, ప్రాయశ్చిత్తము, పరోపకారము— వీనియన్నిటికి మానవ జీవితములో చోటు గలదు. ఆదర్శవాద మెంతప్రధానమో, స్థితిగతిచింతనము చేయు వివేకము గూడ నంతే ప్రధానము. ఈనాటి చిన్నకథల తీరుతెన్నులకు మారినా, మానవుల మనుగడకు ఏకసూత్రత కల్పించుట దుస్సాధ్యము. విచిత్రమైన మానవజీవన మశాశ్వతము. ఇంతవరకేమి జరుగునో దాని ననుభవించువారికే తెలియదు.

కె. వి. ఆచార్య రచించిన యీ రమణీయకథా సంపుటములో మనుగడలోని గుట్టుతెన్నియో తడవబడినవి. ఇంతగా మానవ మనోధర్మమును చూపిన కథకు లీనాడెందరో లేరు. పాత్రలు పోవు పోకడకు సుస్థిరమయిన కారణములు చూపుట, సన్నివేశములను కార్యకారణసంబంధభావముతో శిల్పదృష్టితో అతుకుట, సొగసైన తలపులను సొగసైన భాషలో వెలువరించుట, మనోధర్మమును ప్రధానపాత్రముగా భాసింపజేయుట

విశేషము. కవిత్వమని పేరు పెట్టదలదుకొన్న రచన కొక్క భక్తి చాలదు. అది వక్తి కట్టుటకు లక్ష గుణములను సంతరింప వలయును. అట్టి పని ఈ రచయిత పెట్టుకొనలేదు. రామాయణ కథా వ్యవహారము మనకు తెలియని వారికిది ఉపయోగ పడగల దనిపించుచున్నది. ఈ గ్రంథము కథా కథనము వరకును, పద్య రచనయందును పరమ సంగ్రహరూపమున వేగవంతమై నిర్విశేషమైన రేడియో హరికథ వలెనున్నది. ఆ ధోరణిలో బాలకాండమునుండి యుద్ధకాండము తుదిగా ఈ గ్రంథము రచింప బడినది.

రావణునిచేత నపహరింపబడి గనిపోబడు చున్న సీతాదేవి తన భూషణములను తీసి జారవిడుచుటను చెప్పు పద్యము చూడుడు.

మదరి రత్నము పేటగాని వశమై కోట్టభించు పక్షోయునన్
ఎదతో వేడ్పును మింటిపై నరుగుచున్ ప్రీక్షించె బృథ్వీస్థలిన్
ముదమేపారగ వానరావృత తలమ్మున్ బుద్ధ్య సమాక్రందినన్
వదిలించంచును భూషణావళుల వాపై వైచెనోమూటగాన్.

మిగిలిన గ్రంథమంతయు నీ తరుసనే రచింప బడినది. మరియు కొన్నింటుగల వాక్యముల యర్థములు ప్రసన్నము కాదు. "మాను భవాస్తినందు, దురిత సంహారికి" (పు. 7) "వార్గింట వెల్గంటి డిల్లింటి రేల్గంటి, యుభ్యాప మొసరింటు నమురిపమ్మ (పు. 4) "ధరణీ సుత కాళరణా" (పు. 31) "వ్యంగ్యమౌ కోతిగ' (పు. 142)— ఇట్టివి చాల గలవు. "అవ్యోన్య జతలు" (6) "కాషాయుబట్టలు': (37) 'బలికెన దాశ" (58) "వనవాన స్వైరోడు': (118) ఇత్యాదులింకెక్కువగా గలవు. "అలవ్యమేమనుంది" (26) "ప్రేమార" (39) "పల్కారి" (111) ఈ మొదలైన పలుకు బడులును గ్రంథమునిండ గలవు. ఛందమ్ము విషయమునను శ్రద్ధ తక్కువగా నున్నది. పీఠిక యూరన పుట చివరి యాటవెలది పద్యము, బాలకాండము పందొమ్మిదవ పుటలోని చంపక మాల పద్యములను చూడవచ్చును. ఇక అచ్చు తప్పుల వంటివాని విషయము నెత్తనక్కరయేలేదు. రావణవధ, సీతాదేవి అగ్ని ప్రవేశము ఇత్యాదులైన తరువాత అతిరాసంగ పరవశులైన వానరులు శ్రీరాముని నుతించిన దండకము "శ్రీ చిట్టిదాసీ ఖ్య పాలా సదాదీనపాలా నమస్తే నమస్తే నమః అను ముగింపుతో నున్నది. కావిత్యమును గణింపని భక్త్యావేశము తోడి రచన లిట్లే యుండును. గుహుడు సీతారామ లక్ష్మణులను గంగదాటించినవాడు. అందుకు ప్రతిగా శ్రీరామచంద్రుడు వానికొక బంగారు నాణె మీయబోగా

> 'కేలు మోడ్చి గుహుడు నీలమేఘశ్యామ !
> చిన్న పదికె ఇంతు జేరిత్తె
> బ్రతుకు సంద్రమీద బడవ నీస్మరణమ్మ
> ఏటి ఇవ్వగలను ఇనికులేశ ! (పుట 38)

అని "కనుల నీరునించి"నాడట గుహుడు రచన ఎట్లున్నను హృదయ సంవాదయోగ్యమైన భావ సంపూర్ణముగల పద్యమిది. ఇట్టి వానికీ గ్రంథమును గావింపవలయును,

## సీతారామాయణము

(రచయిత : శ్రీ మేడూరు సీతారామయ్యశర్మ. ప్రతులకు : రచయిత, రాజాం, శ్రీకాకుళంజిల్లా. మూల్యము: రు. 1—25 క్రౌను 70 పుటలు.

మూడు వందల డెబ్బది ఎనిమి కంద పద్యములలో ఉత్తర కాండాంతముగల రామాయణ కథను సంగ్రహముగా చెప్పిన గ్రంథము. శ్రీరాముని వైకుంఠ యాత్రాదికమును వదలి లవ కుశులతో, సీతతో శ్రీరాముడు సుఖముగా నున్నంత వరకే రచించి రచయిత గ్రంథమును ముగించెను. "విశ్వ కల్యాణార్థము శుభాంతముజేసి, రామ తారక మంత్ర సీతా క్షీరము లచ్చ టచ్చట పద్యములలో అమృతకరములగునట్లు నిలిపి వ్రాసి"నట్లు రచయిత చెప్పుకొనెను. ఇంతకుమించి ఈ గ్రంథమును గూర్చి చెప్పదగిన దేమియునులేదు. మిగిలిన అన్ని విషయములను చిట్టిదాసుగారి గ్రంథమునకిది తల కట్టుగా నున్నది.

> తొలకరి మొలకపుల చందము
> తొలి మొలకగుల మోమునగోము దొంగిలు మగవుల్
> మొలకల మీసలు కులుకుచు
> మొలచుచు నుండంగ కొన్ని మొలువగజూచున్
> (బాల—14)

రామ లక్ష్మణాదుల యౌవనావిర్భావ దశా విశేషమును వర్ణించు పద్య మిది. గ్రంథమంతయు నీ ధోరణిలోనే సాగినది.

—జే. మేంద్ర.

ఉపయోగకరమైన
సరిక్రొత్త గ్రంథములు
వ్యవసాయము — ఫిషరి — కోళ్ళ పెంపకం — ఆడవులు — తోట పని — యింజనీరింగ్ — వైద్యము — వివిధ సాంకేతిక విషయములపై గ్రంథములు గలవు. కేటలాగు ఉచితము.
ఇంగ్లీషులో వ్రాయండి :
N. K. PAUL & SONS,
P. B. No. 12202, Calcutta—5.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad.